



# విషయానుక్రమణిక

జూలై 1944



## చిత్రములు



సంపుటము 21
సంచిక 7

# భారతి

తారణ, ఆషాఢము
1944 జూలై

## ఈశ్వరస్తవము



శ్రీ గుఱ్ఱం వెంకటసుబ్రహ్మణ్యం

మొదల నీటిబిందువు వియన్నది, యన్నది నొక్క బుద్బుదం
బాదటఁ జంద్రవంక, నిఁక నందొక పిచి మరీచి, దానిపెం
పీదశదిక్కులం దొదుగ కెక్కువమై వెలుఁగొందు నెందు, నా
పాదశిరంబు నిన్నుఁ గనవచ్చునె యెంతటివాని కీశ్వరా!

ముమ్మొనకైదువంటిన వియూథత మోవృతజాడ్యభూతకా
యమ్మున భానుచంద్రదహనార్చులు నిర్గతమైన, వారి రూ
పమ్మున విశ్వధాత్రివిభవంబు నవంబుగ విస్ఫురింప, నం
దిమ్ముగ మృణ్మయోర్వి తలయెత్తదె నీమహిమన్ మహేశ్వరా!

అక్షరమూర్తి వౌటఁ బ్రథమాక్షరశిక్షు భవన్మనస్సు లాం
ఛ్రక్షితి నక్షయంబు లగు, ధర్మము నీవృషవాహనంబు దు
ర్భిక్ష మెఱుంగనీయక సమృద్ధిగఁ బంటయుఁ బాడి గూర్పఁ బా
పక్షయధుర్య*గంగ బహువ్యాహినులం బ్రవహింప నీశ్వరా.

తమము నడంచు శీతరుచి, తాపము బాపును గంగ, మంగళం
బమరుచు గౌరి, హారివిభవాదిక మిచ్చు విభూతి, ధర్మమా
ర్గము గమనించు వాహనము, గమ్యముసేయు స్థిరం బహార్యగే
హము, భవదీయసేవ భవదైక్యముగా విరచింతు నీశ్వరా.

కంటి మహాగ్ని, దుర్విషము కంఠమునన్, గయిసుట్టు చిల్వ, పై
నంటిన భస్మ, మూదల మహాటవి నేఱులు వంకలైన ని

న్వంటి విచిత్రపూరుషుని వల్లభుగాఁ బడయం దపించు వా
గ్గొంటియ నిన్నెఱుంగఁగ వలంతి, యలంతు లెఱుంగ రీశ్వరా.

పుట్టు వెఱుంగరాక, మొయిఁ బుట్టము లేక, బికారిపోక, నా
చట్టున వట్టిశూన్యమున సంభవమందిన యిక్వరాంద్ర ని
ల్చట్టునఁ బెట్టఁగానక యవశ్యము నిత్యము నొంట నొదటన్
బట్టిన బేసికంటిదొర, భైక్ష్యము సేకొనవయ్య యీశ్వరా.

యోగివొ, జాయఁ బాయ మనసొప్పక మైసవరించు కామివో,
త్యాగివొ, కూడఁబెట్టి రజతంబ చలంబుగఁ బేర్చు లోభివో,
భోగివరేణ్యభూషణవిభూషివొ, గాక దిగంబరుండవో,
యాగకరుండవో, ప్రథితయాగవిఘాతివొ, యేమొ, యీశ్వరా!

ఇల్లా లా యచలాత్మజాతకుఁ బ్రియం బేపారఁగాఁ దాల్చినా
వుల్లాసంబుగ స్థావరాకృతినన్నా, నుల్లంబు నీరంబుగాఁ
గల్లోలంబుగఁ బక్వలెత్తి సనుగంగాదేవినాగంగ సి
ముల్లోకంబుల జంగమంబయిన రూపుం దాల్చితే యీశ్వరా!

పలిమల జేసి కూఁతు నెనకట్టునఁ గాఁక జనింపఁ జేయుటో
సలిలమహాప్రవాహము నవశ్యము చూడిముడిక గ్రహించుటో
చిలువ సుధాంశురేఖ నొకచెంత నిరంతర ముంచుటో, భవ
ల్లలిత విచిత్రవైశికవిలాసము లందమగాధ లీశ్వరా!

కాముని బూదిసేసిన యకామి యటే సగ మయ్యె నాలికై
కామితముల్ ఫలించునటె గ్రక్కునఁ దన్నయనాంతకాంతిసం
క్రామముచే, నకాములకుఁ గామ్య, మకామ్యము కామికోటికి
స్వామి యొసంగు నట్టె యని ప్రాజ్ఞులు నివ్వెఱవోదు రీశ్వరా!

చక్కదనంబు గన్గొనిన సంభ్రమముల్, సిరిసంపదల్ గనం
జొక్క, వయోవిలాసములఁ జూచినఁ జాపలముల్, వికల్పముల్
పెక్కులువుట్టు నిజ్జగతి పేర్మి ప్రతిక్షణ మీక్ష్యమాణమై
స్వక్కృత దుర్వికల్పము సనాతన మీవ శరణ్య మీశ్వరా!

ఈక్షణతీక్ష్ణానలహుతేక్షుశరాసన, పార్వతీకటా
క్షేక్షణశిక్షితాక్ష, యసకృత్ప్రళయోద్ధురదుర్మదాంధర
క్షోక్షుభితామరావనవిశుద్ధపరాక్రమభాస్వదోదయా,
అక్షయపుణ్యలోకనిలయా, కరుణామయ, కావు మీశ్వరా.

# వాల్మీకములో కొన్ని మీమాంసలు

## తత్సమాధానములు

•

= శ్రీ బులుసు వేంకటేశ్వర్లు =

ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన రంగనాథ రామాయణమునందలి పీఠికా ప్రబంధమున నీతదుపాధ్యక్షులగు శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డిగారు "వాల్మీకమునందలి కొన్ని మీమాంసలు" అను శీర్షికక్రిందఁ దమకుఁ గలిగిన కొన్ని సంశయములను వివరించియున్నారు. ఈ సంశయములనే వారు ౧౯౧౯-వ సంవత్సరమున మైసూరులోని కొందఱు గొప్ప పండితులకు విన్నవించియు నలబ్ధసమాధానులైరఁట. ఆకారణమున వీని నాంధ్రలోకమున కర్పించి తత్సమాధానముల నభ్యర్థించియున్నారు.

శ్రీ రెడ్డిగారు చక్కని ప్రతిభావంతులగు నాంగ్లవిద్యాధికులు. వీరి సునిశిత విమర్శనివేకము వీరు రచించిన 'కవిత్వ తత్త్వ విచారము' మూలమున నాంధ్రులకు సుపరిచితము. అట్టి వీరి సంశయముల నొకపట్టునఁద్రోసిపుచ్చరాదు. మఱియు మైసూరునందలి కొందఱు గొప్ప పండితులును సమాధానము చెప్పలేకపోయిరనుటచే నీభార మాంధ్ర పండితులపైఁ బడినది. ఈ కారణముచేఁ బైయుభయులకన్నను గొప్పవాఁడ ననునుద్దేశముతో కాక సత్యాన్వేషణ బుద్ధితో శ్రీ రెడ్డిగారి సంశయములకు నాకుఁ దోఁచిన సమాధానముల నీయ సాహసించితిని.

౧ "శ్రీరామ పట్టాభిషేకము:—భరతశత్రుఘ్నులూరిలో లేనప్పుడీ ప్రయత్న మేల పెట్టుకొనిరి? బహుశః భరతునికి విశేషించిన హక్కు ఏమైన నుండెనా? భ్రాతృవత్సలుఁడైన రాముఁడు 'భరతుని పిలిపింపు' మని తండ్రి కొక్క మాటయైన నేల చెప్పలేదు? తమ్ముఁడు లేకుండినను బట్టము కట్టుకొనుటకు సంసిద్ధుఁడైయుండెనా? లేదా, యిందును బితృవాక్య పరిపాలన సూత్ర మవలంబించెనా?"— ఇది శ్రీ రెడ్డిగారి మొదటి సంశయము.

దశరథునకు పొడసూపిన దుర్నిమిత్తములకు భయపడియే యాతఁడు త్వరలో రామపట్టాభిషేకము చేయ నిశ్చయించినట్లు వాల్మీకమున స్పష్టముగా నున్నది.

"దివ్యంతరిక్షే భూమౌచ
ఘోర ముత్పాతజం భయమ్,
సంచచక్షేచ మేధావీ
శరీరే చాత్మనో జరామ్" (అయో. ౧-౪౩)

అని దశరథుఁడు మంత్రులతోఁ జెప్పుటేకాక శ్రీరాముని బిలువనంపి యాతనితో సంతత్వరలోఁ బట్టాభిషేకము గావింపవలసిన కారణములను స్పష్టముగా వక్కాణించినాఁడు:

"అపిచాద్యాశుభాన్ రామ
నక్షత్రం దారుణైర్గ్రహైః,
సనిర్ఘాతా దివోల్కాచ
పతతీహ మహాస్వనా.
అవష్టబ్ధంచ మే రామ
నక్షత్రం దారుణైర్గ్రహైః,
ఆవేదయంతి దైవజ్ఞా
స్సూర్యాంగారక రాహుభిః.
ప్రాయేణహి నిమిత్తానా
మీదృశానాం సముద్భవే,
రాజాహి మృత్యు మాప్నోతి
ఘోరాం వాపద ముచ్ఛతే"
(అయో. ౪-౧౭,౧౮,౧౯)

పైకారణములచేత నెంతలో నెంత విపత్తు వచ్చునోయని భయపడి తన జ్యేష్ఠపుత్రుని పట్టాభిషేక

మును గన్నులారఁ గాంచుభాగ్యము కలుగునో కలుగదో యని యంత త్వరలో శ్రీరామపట్టాభిషేకము నిశ్చయించినాఁడు. అనఁగా, నాఁడు కలిగిన ప్రబలోత్పాతములు, వానివలన దశరథునకుఁ గలిగిన భయమే రామపట్టాభిషేకము త్వరలో నిశ్చయించుటకుఁ గల కారణములు కాని భరతశత్రుఘ్నులు వారిలో లేకపోవుట కాదు.

భరతునికి విశేషించిన హక్కేమైన నున్నదేమో యని శ్రీ రెడ్డిగారి సంశయము. శ్రీరాముఁడు జ్యేష్ఠపుత్రుఁ డగుట భరతునకంతకంటె మించిన హక్కు గలుగుట కవకాశము లేదు. కాని, యొకటి రెండు చోట్ల మాత్రము దశరథుఁడు కైకను పెండ్లియాడునపు డామెకుఁ బుట్టిన పుత్రునకే రాజ్యము నొసంగెద నని వాగ్దానము చేసియున్నట్లున్నది. వాల్మీకమునకుఁ బూర్వానువాదమగు గోపినాథ రామాయణమున నీవిషయము కలదు. వాల్మీకిరామాయణ వ్యాఖ్యాతలలో నొకరీవిషయ మూహించినట్లును వ్రాయఁబడినది. కాని, దీనికిఁ దగిన యాధారములు లేవు. వాల్మీకమున నెచ్చట నీవిషయప్రసక్తి లేదు. అట్టి వాగ్దానమే దశరథుఁడు చేసియున్నచోఁ గైక కది తెలియకుండునా? తెలిసియున్నపు డామె యావిషయమునే దశరథునకు జ్ఞప్తికి తేక మఱియొకవిషయమునఁ గోరవలసిన యగత్యమేమి? ఇంతకును సత్యవాక్పరిపాలనాధురీణుఁడగు దశరథుఁ డొకవేళఁ గేకయరాజున కట్టి వాగ్దానమే చేసియున్నచోఁ జెల్లింపకుండ నుండునా? కేకయరాజు విషయమునఁ జేసిన వాగ్దానమును జెల్లింపక యసత్యమార్గమును ద్రొక్కిన దశరథుఁడు కైక విషయమున నట్లు చేయ వెఱచునా? కావున, భరతునకు శ్రీరామునకు మించిన రాజ్యార్హత గలదనుట నిరాధారము.

ఇఁక, శ్రీరామపట్టాభిషేకమునకు భరతశత్రుఘ్నుల నేల పిలువఁబంపలే దను ప్రశ్నమునకును జక్కని సమాధానము వాల్మీకమునందే కలదు. అయోధ్యానగరమునకును, కేకయరాజనగరమునకును గల మార్గ మధికము. అత్యంతత్వరితముగాఁ బ్రయాణము చేయుచో నేడు దినములు పోకకు, నేడు దినములు రాకకును బట్టును. ఈ విషయము దశరథుఁడు మరణించినపిదప భరతుఁడు వచ్చినప్పుడు తన ప్రయాణకాలము తల్లితో చెప్పిన సందర్భమునఁ దెలియును. అనఁగా భరత శత్రుఘ్నులు రావలె నన్న పదునాల్గు దినములు పట్టాభిషేక మాపియుంచ వలె నన్నమాట. దశరథునికిఁ గలిగిన దుర్నిమిత్తముల ఫలమంతకాలము నిలిచియుండ దను కారణమున, నెంత ప్రయత్నించినను లగ్నకాలమునకు భరతశత్రుఘ్నులు రా నవకాశ మేమియు లేనికారణమునను వారికి వార్త పంపలేదు. కేకయరాజునకే కాదు- సుమారు సమానదూరమున నున్న జనకమహారాజునకు నీ వార్త పంపుట యసాధ్యమే యైనది. మఱియు కేకయరాజు, జనకుఁడును గూడ తరువాత నీ శుభవార్త విని యానందింతు రని దశరథుఁ డెంచెను. (అయో. ౧-౪౭) ఈ విషయమే భాస్కర రామాయణమున విపులముగాఁ జెప్పఁబడినది.

ఈ పరిస్థితు లన్నియుఁ దెలిసిన శ్రీరాముఁడు భరతునికి వార్తఁ బంపుమని తండ్రితోఁ జెప్పుట యసందర్భమే యగును. మఱియు తమ్ముఁడగు భరతుని విషయమున శ్రీరామునకుఁ బరిపూర్ణ విశ్వాసమున్నది. దశరథుఁడును,

" జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా
సానుక్రోశో జితేంద్రియః."
(అయో. ౪-౨౬.)

అని భరతునిగురించి రామునితోఁ జెప్పియున్నాఁడు. ఈ కారణములచే, భరతుని విషయమున దశరథునకుఁగాని, శ్రీరామునకుఁగాని యావంతయైన నవిశ్వాసము లేదని తెలియవచ్చుచున్నది. జనకునాజ్ఞ యవల్లంఘనీయ మగుటచేతను, భరత శత్రుఘ్నులు సమీపమున లేకపోవుట లోపమే యైనను వారిని రప్పించు నుపాయము లేని కారణమునను శ్రీరాముఁడు తమ్ములు చెంత లేకున్నను బట్టాభిషేకమున కంగీకరింపవలసినవాఁ డాయెను.

౨. " ఆకాలమున ౨౦ వేలు, ౩౦ వేలు ఏండ్లు జీవించియుండెడివారు రాజులు.—రాజులు మాత్రము. కైకేయి భరతునికై రాజ్యము కోరినది పదునాలుగేండ్లేకదా! అనఁగా నొక్క వారమురోజు లనుట

ఆనాఁటి గణనరీతిని స్పష్టముగదా. ఆమె, తనకుఁ జేసిన యవమతికి సూచకాకారప్రతీకారము కోరిన దనియు, నిజముగా శ్రీరామునకుఁ గీడెంచలే” దనియు శ్రీ రెడ్డిగారి యభిప్రాయము.

మంథరదురాలోచనము తలకెక్కిన కైక శ్రీరామునకుఁ గీడెంచలే దను శ్రీ రెడ్డిగారి సిద్ధాంత మశ్రుతపూర్వము. కైక శ్రీరామునకుఁ గీడెంచినదా యని యడుగుట రామాయణమంతయుఁ జదివి రాము నకు సీత యేమగునని యడుగుటవంటిదే యని నాయభి ప్రాయము. వాల్మీకమునందలి కైకమంథరల సంభాష ణము గాంచినవారి కెల్ల మంథరకైకల దుష్టబుద్ధులు విశదమగును.

“చతుర్దశహి వర్షాణి
రామే ప్రవ్రాజితే వనమ్,
రూఢశ్చ కృతమూలశ్చ
శేషం స్థాస్యతి తే సుతః”
(అయో. ౯-3౧)

“ఏవం ప్రవ్రాజితశ్చైవ
రామోఽ రామో భవిష్యతి,
భరతశ్చ హతాఽమిత్ర
స్తవ రాజా భవిష్యతి.
యేన కాలేన రామశ్చ
వనా త్ప్రత్యాగమిష్యతి,
తేన కాలేన పుత్ర స్తే
కృతమూలో భవిష్యతి”
(అయో. ౯-33,3౪)

ఈవిధముగా బోధించిన మంథరవాక్యముల కానందించి—

“నకించి దిచ్ఛామి నచేహ జీవితం
నచే దితో గచ్ఛతి రాఘవో వనమ్” (౯-౬౪)

అని నిశ్చయించుకొన్న కైకేయి శ్రీరామునకు క్షేమమే యెంచినదా! వయోవృద్ధుఁడై, దుర్నిమిత్త భయవిహ్వలుఁడై మతిదక్కియున్న దశరథుఁడు—శ్రీరామునిమీఁదనే పంచప్రాణములు పెట్టుకొని యున్న దశరథుఁడు —

“కౌసల్యాంవా సుమిత్రాంవా
త్యజేయ మపివా శ్రియమ్,
జీవితంవా ఽత్మనో రామం
నత్వేవ పితృవత్సలమ్.”

అని చెప్పి, పదునాలుగువత్సరములు కాదుగదా పదునాలుగు క్షణములైనను రాముని వీడియుండలేనన్న దశరథుని స్థితి నెఱింగియుఁ గైక తనకోరిక నుపసంహ రించుకొనదాయెను. ఇంతకును గైక కవమతియొనర్చిన వా రెవరు? దశరథుఁడా, శ్రీరాముఁడా? శ్రీరాము నకుఁ గీడెంచనిపక్షమున భరతునికిఁ బట్టాభిషేకమే కావలె నని కోరుకొనునుగాని కైక రాము నరణ్యము నకుఁ బొమ్మని యేల కోరుకొనును? కాన, విచారించి చూడఁ గైక పొందిన యవమతి మృగ్యమగుట నామె శ్రీరాము నరణ్యమునకుఁ బంపఁగోరుకొనుట జగన్నిం ద్యము, నసమర్థనీయమును.

3. “రావణుఁడు నిర్నామఁడు కాఁడు. శ్రీరా మునికిఁ బూర్వుఁడైన యనరణ్యునిఁ జంపినవాఁడు. వాని విషయ మయోధ్యలో నంద ఱెఱిఁగినదే. లంకకు రాజనుట రహస్యము కాదు. సీత నపహరించినవాఁడు రావణుఁ డని జటాయువు మూలమున శ్రీరామునికిఁ దెలియును. సంపాతివలన వానరు లెఱిఁగిరి. ఇఁక సీత నెక్కడ నుంచినాఁ డని అన్వేషించుట యేల? లంక లోనా, మఱి వాని రాజ్యాలలో నింకొకయెడ పెట్టి నాఁడా యని నిశ్చయముగాఁ దెలియుటకొఱకా? తెలిసి యేమి లాభము? ఎట్లైనను రావణుని జయింప వలసినది ప్రథమకర్తవ్యము. దొంగతనముగా సీతను దెచ్చుకొను తలంపు శ్రీరామునకు లేదు. క్షత్రమార్గ మతని వ్రతము. దండెత్తుసరికి రావణుఁ డింకొకతావునకు మార్చలేఁడా? కాఁబట్టి సీతాన్వేషణ మెందులకు? సుందరకాండ మనివార్యమైన ఘట్టమా కాదా? అది యద్భుతమైనను గథాకల్పనకుఁ బ్రధానమా? సహేతు కమా!” అని శ్రీ రెడ్డిగారి తుదిసందేహము.

సీతాదేవి మహాసాధ్వి. క్షణమైన శ్రీరాముని విడిచియుండని సీత పరపురుషుని హస్తమునఁ జిక్కి బ్రతికియున్నదో లేదో యని శ్రీరామునకు సందేహము కలదు. ఈవిషయమునే శ్రీరాముఁడు సుగ్రీవునితో—

"జ్ఞాయతాం మమ వై దేహీ
యది జీవతి వా నవా !
సచ దేశో మహాప్రాజ్ఞ
యస్మిన్ వసతి రావణః.

అధిగమ్యతు వై దేహీం
నిలయం రావణస్యచ,
ప్రాప్తకాలం విధాస్యామి
తస్మిన్ కాలే సహాత్వయా."

(కిష్కిం. ౪౦-౧౦, ౧౧.)

అని చెప్పియున్నాఁడు. ఒకవేళ సీత పరపురుషుని హస్తమునఁ బడి జీవించియుండని పక్షమునఁగాని, రావణునితోఁ గలసి యాతని నంగీకరించియున్నపుడు కాని శ్రీరాముని రావణవధోద్యోగ మనవసరము, శ్రమావహమే యగును కాని ఫలితముండదు. ఈపరిస్థితులు తెలిసికొనుటకును, మఱియు నొకవేళ సీత జీవించి రామునే నమ్ముకొని ప్రాణములతో నుండియున్నదా శ్రీరాముని క్షేమవార్త, యాతని రావణవధోద్యమముఁ దెలిసికొని మఱింత ధైర్యోత్సాహములతో నుండఁగల దను కారణములచేతను సీతాన్వేషణ మత్యంతావశ్యక మయినది. సీత నివసించుచోటు, రావణుని యునికియుఁ దెలిసినఁగాని యీ విషయము లన్నియు తేటతెల్లము కావు. కనుకనే ఒక్క లంకలోనికే కాక అన్ని దిక్కులకును వానరులను సీతాన్వేషణార్థము పంపవలసి వచ్చినది. కావున, సీతాన్వేషణ మనగతికము కాదు కదా యత్యంతావశ్యకము కూడను.

ఇఁక సుందరకాండ మనివార్యమైన ఘట్టమా కాదా? సహేతుకమా? అను ప్రశ్నములకుఁ దావు లేదు. ఏలయన, రామాయణ మొక కల్పితకావ్యము కాదు. యథార్థచరిత్రము; వాల్మీకి మహర్షి విరచితము. అగుటచేత, సందిగ్ధ విషయముల నొక్కపరి పరిశీలించుచో నన్నియు సత్యాన్వేషులకు సహేతుకములుగాఁ గన్పట్టకమానవు. సీతాన్వేషణమునందు శ్రీరామునకుఁ గల ప్రధానోద్దేశము లన్నియు నీసుందరకాండమున సిద్ధించినవి. సీతావిషయముఁ దెలిసికొనుటచేతనే ముందుకార్యక్రమమునకు శ్రీరాముఁడు పూనుకొనుట యైనది; సీతామహాసాధ్వియు శ్రీరామునాగమము నాప్యాయముగా నర్థించుచుఁ బ్రాణములు నిలిపియుంచుకొన్నది. అగుటచేఁ గథాగమనమున కెంతయో యాఘట్టము తోడ్పడినది. సుందరకాండమే లేనినాఁడు సీతావిషయము తెలియఁగని శ్రీరాముఁడు కింకర్తవ్యతా మూఢుఁడై యూరకుండవలసి వచ్చును. అప్పుడు కథాగమనమునకే యాటంకము వచ్చును. కావున, సుందరకాండ మనివార్యమగు ఘట్టము, సహేతుకమును.

సత్యాన్వేషణబుద్ధితోఁ దెలియఁజేసిన యీసమాధానములు శ్రీ రామలింగారెడ్డిగారి సందేహనివృత్తికే మాత్రము దోడ్పడినను నేను ధన్యుఁడను.

---

వలె అపరాహ్ణమునసే తినవలె నన్నారు. శాస్త్రిగారో-అపరాహ్ణమునగాని, ఆమపక్వకోశశుద్ధి చెందిగాని అని కొంచె మనుగ్రహించారు.............శుద్ధకోష్ఠత అనగా పరగడుపు అని భావము. షాడబాదులు ప్రొద్దు నసే పరగడుపునను, మధ్యాహ్న భోజనానంతరమును తీసికొనుట మంచిది......"

అని వ్రాశారు.

తినడానికి సమృద్ధిగా వున్న రాజులకు ఏక భుక్తం చెప్పడంవల్ల శాస్త్రిలుగారికి కోపం వచ్చింది. ఒక్క రాజులకే కాదు. తక్కినవాళ్లకూడా ఏక భుక్తమే మన గ్రంథాల్లో కనబడుతుంది. నవకాయ పిండివంటలతో సుప్రసోషితంగా రెండుఝాములు దాటిన తరవాత ఆకలిగొన్న కడుపుతో భోజనం చేసే వారికి రాత్రి భోజనాపేక్ష వుంటుందని నే ననుకోను. అంతగా వుస్తు కలవాళ్లు రాత్రిళ్లు పాలో, పళ్లో తీసు కునేవారు. మనుచరిత్ర మూపనానికి పోయి రాజపురోహి తుని యింట్లో బసచేసిన పరదేశిబ్రాహ్మణునికి ఆ పురోహితుడు ఫలహార మిచ్చే గౌరవించినట్లు ఆముక్త మాల్యదలోనే వుంది.

మనచరిత్రలోని ప్రవరుడు కురుపకాలమునందు తన యింటికి వచ్చిన దౌపాసికునికి పూజచేసి, ఆహా రం పెట్టేసరికి ఎంతవేళ అయినో గమనించండి.

మన తెలుగుప్రబంధాలన్నింటిలోనూ యిలాగే కనబడుతుంది.

ఆకాలపు విలాసుల దినచర్య తెలిసికోడానికి ముఖ్యాధారమైన క్రీడాభిరామంలో కథానాయకులైన మంచనశర్మ, అతని మిత్రుడు టిట్టిభసెట్టి రెండు ఝాములు తిరిగే ఒకవ్యభిచారిణి యింట్లో (పూటకూ టిల్లు) తలా ఒక రూపాయి యిచ్చి శిష్టకృతిగా భోంచేసినట్లున్నూ, రాత్రి మరేమీ తీసుకోనట్లున్నూ శ్రీనాథుడు వర్ణించాడు. భోజనాత్పూర్వంగాని, తర్వాతగాని వా ళ్లేమీ అల్పాహారం తీసుకోలేదు.

రెండు జాములు తిరిగేదాకా తిండి లేకుండా వారు ఉండగలరా అని ప్రశ్న రావొచ్చు.

తెల్లవారేసరికి కడుపులో కాఫీ పడకపోతే కాళ్లూ, చేతులూ స్వాధీనపేలిక్కా లోటులోటు లాడి పోతూ, అడుగుతీసి అడుగు పెట్టలేని యీకాలపు మనవంటివాళ్లు మధ్యాహ్నం తిరిగేదాకా తిండిలేక వుండాలేరు; తర్వాత పెడితే తినాలేరు.

ఆకాలపువాళ్ల సంగతే వేరు. వాళ్లు తిండి కోసం బ్రతికేవారు. తిని జీర్ణం చేసుకునేవారు. మన మో, బతకడానికి యింత తింటున్నాము.

రాజులకు ఒంటిపూట భోజనం చెప్పకూడ దనే అభిప్రాయంతో శ్రీ శాస్త్రిగారు 'స్వపాహారా'న్ని 'ఉపాహారం'గా మార్చారు. కాని ఆముక్తమాల్యద లోని ఆ సందర్భాన్నిబట్టి చూస్తే (అది రాజులకు హితవు బోధించే ఘట్టం కాన) పాఠాన్ని మార్చడం పాసగదని తెలియకపోదు.

సారాంశ మేమిటంటే—

షాడబం అంటే భోజనసమయంలో వడ్డింప బడే ద్రవరూపవ్యంజన మనీ, అదే పులుసనీ, అది ఎంతమాత్రమూ ఉపాహారము (అల్పాహారము) కాద నిన్నీ, ఆకాలపువారు రెండుజాములు తిరిగాక (అప రాహ్ణమంటే రెండు మూడుగంటలని నియమం లేదు) భోజనం చేసేవారనీ, సాధారణంగా వారిది ఒంటిపూట భోజనమే అనీ గ్రహించవలసి వున్నది.

చూద్దాములే! ఇలాటివాళ్ళకే పెద్దవుతున్నకొద్దీ విరగబాటూ, పెడసరమూ జాస్తీ' అని మేనమామ ధాటీగా అనడమూ ఆమె కప్పుడేమీ అర్థమయేవి కావు. పాపం! ఆమె తానేమో చాలా తప్పపని చేసినట్లు హడిలిపోయి తల్లి ఒళ్లో కూర్చొని ఏడవడం మొదలు పెట్టింది. 'కాదమ్మా. నీమంచికోసమే మామయ్య అలాగ పెంకితనం నేర్చుకోగూడ దన్నాడు' అన్న తల్లి నరసమ్మ ఓదార్పుకూడా ఆమెను సంతోషపరచ లేకపోయింది. పోనీ, యీమారు పరీక్షలో మామయ్య కూతురు మహాలక్ష్మికంటె పాడుగా రాస్తే? అసలు చదువే మానేస్తే? ఏమో, పంతులమ్మ ఏమనుకుంటుందో?—యివే ఆమెఆలోచనలు.

ఆ పదమూడేళ్ల వచ్చీరాని జ్ఞానంలో ఆమెకు తన పెళ్లి విషయంలో తల్లి పడుతున్న ఆందోళనకి అట్టే కారణం కనిపించేది కాదు. అయినా మామయ్యకి మాత్రం తెలిదా? అతనికి పదేపదే చెప్పడ మెందుకు? ఇంతకూ తనకంటె చిన్నయితేమాత్రం మామయ్య కూతురు మహాలక్ష్మికే ఎందుకు ముందు పెళ్లికాకూడదు? మరి అమ్మ కెందు కీగాభరా? పెళ్లిలో ఉండే మంచిచెబ్బరలు సంపూర్ణంగా తెలియక పోయినా ఆమెకీ ఏవో కొన్ని ఉద్దేశా లుండేవి. ఎవరో నలభైఆయిదేళ్ల వెంకన్న పంతులుగారిని పెళ్లిచూపులకి తీసుకొచ్చి ఎదుటికి రమ్మన్న మామయ్య మీదా, నెల్లమరి వెనకనుంచి నెట్టిన అత్తమీదా ఎందు కంత కోపం వచ్చిందో తనకే తెలీదు. ఇన్నాళ్లుగా మామయ్య లక్ష్మిపెళ్లికోసం తంటాలుపడుతున్నాడుకదా—తన కంత నచ్చితే లక్ష్మినే ఎందుకాయన కిచ్చి పెళ్లిచెయ్యకూడదూ? తల్లి నరసమ్మ గట్టిగా, ఆ వెంకన్నపంతులకి వినబడేలాగే 'ఒకే అన్నయ్యా! తాపీగా ఆలోచించి రాస్తామని చెప్పు' మన్నప్పుడు ఆమెమీద కలిగిన గౌరవభావమూ, మామయ్యకు తల్లిమీద వచ్చిన ఆగ్రహమూ, తల్లి నిరాహారవ్రతమూ ఆమెహృదయఫలకంమీద నిశ్చలమైన శిలాక్షరాలైనాయి.

మరొక ఏడాదిలో తల్లి చచ్చిపోవడంతో వుం'మెలో ఉండే ఆనందమూ, ఆలోచనాశక్తికూడా ప్ళయనే అనవచ్చు.

తల్లి నరసమ్మగాని బ్రతికిఉంటే యీ నలభైఐదేళ్ల సదాశివరావుగారికి తనను ఇచ్చి మేనమామ పెళ్లి చెయ్యగలిగేవాడేనా? తనకు అంత త్వరగా పెళ్లి చెయ్యడం తనమీది అభిమానంచేత మాత్రం కాదని ఆమెకు నిశ్చయంగా తెలుసు. కాని పెళ్లి కాకుండా తాను ప్రక్కను ఉండగా మామయ్య కూతురు లక్ష్మికి సరియైన సంబంధం వచ్చే అవకాశాలు లేకపోవడమే మామయ్య అకారణౌద్ధత్యానికి కారణమని ఆమెకు చూచాయగా తెలియకపోలేదు. నిరోధించినా లాభం లేదన్న నిరుత్సాహమూ, తా నుండడంవల్లనే ఎంతో శ్రమపడుతున్నా ననే అత్తనుండి సాధ్యమైనంత త్వరలో విముక్తి పొందవచ్చు ననే ఆశాలేశమూ ఆమెలో వివాహభయాన్ని కొంత తగ్గించేయి.

మేనమామతో వివాదంఏదైనావచ్చినప్పుడు తల్లి "మాకేం ధర్మంగాపెట్టక్కర్లేదు. అంతే తిండికూడా గతి కడుక్కుపోలేదు." అన్నమాటలూ, తనతోకూడా ప్రత్యేకంగా తమ ఆస్తి ఏదోకొంత ఉన్నట్లూ, దాని మీద వచ్చే వడ్డీమాత్రమే తాము అనుభవిస్తూ ఉండటం వల్ల తన వివాహానికి డబ్బులో పెన్నడూ రాదనడం ఆమెకు మరుపురాలేదు. కాని మేనమామతో అపూ సెత్తడ మెలాగు? ఇంతకూ డబ్బు ఉండి తన కేం ప్రయోజనం లేదు కదా? ఈ సదాశివరావుగారి చేతులో పోస్తేమాత్రం తనకు వచ్చే ఫలిత మేమిటి? ఆయనకు తను భార్యేకమా కావలసినది— ఆయన ఎలాగూ ధనికుడే! పాపం, మామయ్యే పిల్లలవాడు! ఇంతకూ ఆవిషయంలో తాను చేయగలిగింది గాని, మాట్లాడగలిగింది గాని ఏముంది?

* * *

తన భర్త జీవించి ఉన్నప్పుడు సెలవులకిమాత్రం అప్పుడప్పుడు వచ్చేవాడు ప్రకాశం. కాని అన్నాళ్లు తాతగారింట్లో ఉండి చదువుకుంటూవచ్చిన ప్రకాశం మీద ప్రేమచేత అతనికి కావలసిన సర్వమూ అత్తగారే చూసుకునేది. అతనుగూడా తప్పనిసరి అయినప్పుడు ఏదో గాలిలో కోరుకుంటున్నట్టు "మంచినీళ్లు కావాలి—నాయనమ్మ లేదు కాబోలు. నేను వేగిరం భోంచేసి వెళ్లాలి"అన్న మాటలూ, వెళ్లేటప్పుడు "వెళ్లొస్తాను పిన్నీ!" అన్నమాటా తప్పిస్తే తనతో మరేమీ

మాట్లాడక పోవడం ఆమెకు మొదట్లో చాలా ఆశ్చర్యంగానే ఉండేది.

అసలు తను వొడ్డిస్తేనే సరిగా తినేటట్టుండే వాడు కాడు ప్రకాశం. ఇంట్లో ఉన్నంత సేపూ అతనేమీ మాట్లాడకుండా కూర్చోవడం, ఉబుసుపోక ఏమేనా మాట్లాడితే ఎందుకీ బాధ అన్నట్టు ఏవో సమాధానా లిచ్చి వెళ్లిపోవడం ఆమె కేమీ అర్థమయేవి కావు మొదట్లో. అయితే తాను వినలే దనుకొని ఇరుగు పొరుగువారితో అత్తగారు "అఁ! మనవడిసంగతా? మరొక్క పెళ్లాం లిక్కడుంటే మా బాగున్నట్టే. ఇంతకీ నేను కాలం మళ్లినదాన్ని. సవితితల్లి సవితి తల్లే కదా?" అన్న మాటలవల్ల అతని ప్రవర్తన కొంత వరకూ ఆమెకు అర్థమయింది. కాని వా ళ్లనుకుంటున్నట్టు అతన్నిచూస్తే అసహ్యమూ, ఆగ్రహమూ మొదలైన వేవీ తనకు కలగకపోవడమే కాకుండా ఏవో చెప్పలేని అభిమానమూ, ఆత్మీయు డనే నమ్మకమూ మాత్రమే ఆమెలో కుదిరేయి. తను అతన్ని ఎంతమాత్రమూ ద్వేషించలే దన్న సంగతి అతనికి తెలియజేయా లని ఆమెకు చాలా ఆసక్తి ఉండేది. కాని సందర్భాసందర్భాలు లేకుండా కూడా సవతితల్లి ప్రేమను గూర్చీ, తల్లి లేని పిల్లల అవస్థలను గురించీ అత్తగారు మనవడితో చేసే ప్రసంగాలు అతనిలో ఎట్టి మార్పునూ కలుగనిచ్చేవి కావు.

* * *

సుందరికి తన పెళ్లినాడు ఎంత ఆనందం కలిగిందో సదాశివరావు గారు పోయిన నాడు కూడా అంతే దుఃఖం కలిగింది. ఎవరో బంధువులు చచ్చి పోయినప్పటికంటె అధికంగా ఆమెను విషాదచ్ఛాయలు ఏవీ ఆక్రమించుకోలేదు. ఇంతకూ ఆయన పరిచయమే ఆమెకు తక్కువగా ఉండేది. ఎన్నో వ్యాపకా లున్న మనిషవడంచేత రోజులో ఎక్కువభాగం ఇంటివద్ద ఉండేవాడు కాడు. ఉన్న కాస్తసేపూ ఏవో వేళ్లమడిచి లెక్కలుపెట్టుకుంటూనో, నిద్రపోతూనో కాలం గడిపేవాడు. ఎక్కువ మాటలాడడమే ఆయనస్వభావం కానట్టుగా తోచిం దామెకు. అందువల్లనే సుందరి ప్రకాశంతోనైనా ఏదో మాట్లాడడానికి ఆత్రత చూపేది.

అయితే భర్తవల్ల ఆమెకు ఎట్టి సౌఖ్యమూ దొరకలే దనడానికి వీల్లేదు. సాధింపులకి లోటు లేకుండా అత్తగారున్నా, మామయ్యగారింటిలోనే తానుంటే తిండికీ బట్టకూకూడా పడవలసిన కష్టమేమీ ఇక్కడ లేదు. అంతే కాకుండా తన వుపయోగం కోసం సెంట్లూ, వాసననూనెలూ, పువ్వులూ అప్పుడప్పుడు తెస్తూ తన సరదాలను స్వావకాశంలో కొంత వరకూ గుర్తించిన ఆయనప్రవర్తన ఆమెలో ఆయనపట్ల ఒకవిధమైన గౌరవభావాన్ని కలిగించడంమాత్రం వాస్తవం.

నెత్తీ నోరూ బాదుకొని ఏడవకపోవడం సరి కదా లాంఛనంగాకూడా సరీగా ఆమె ఏడవకపోవడం చాలారకాల విమర్శనలకు ఆధారభూత మయింది. అయితే ఆవిమర్శనాంకూరాలు స్వయంభూతములైతే ఆమె విచారించేదేమోగాని, అత్తగారి అసమానమైన కృషే వాటికి మూలకారణ మని గ్రహించడంచేత ఆమె అణుమాత్రమేనా జంకినట్టు కనిపించలేదు. కాని తాను నిత్యమూ ఏడవకపోవడ మనేది చనిపోయిన తన కొడుకు సదాశివరావు కేకో తీరని అవమాన మని అత్తగా రనుకోవడం ఆమెకు చాలా వింతగానే ఉండేది. "ఒకవేళ తా నిప్పు డహోరజాను లాక్రందిస్తేమాత్రం గతించిన తన భర్త కేమేనా లాభ ముంటుందా? పోనీ ఆయనకు కాకపోయినా అంతగా ఆరాటపడుతున్న తన అత్తగారి కేమైనా లాభిస్తుందా?" అని చాలా నిశితంగా ఆలోచించడంమాత్రమే ఆమె చేయగలిగింది.

సుబ్బమ్మగారికి కొడుకుచావుకు యీ కొత్తగా వచ్చిన కోడలు యిల్లుతొక్కిన వేళలోని దోషమే కారణ మని ఉన్న నమ్మకాన్ని ఆమె యిరుగుపొరుగు వారితో వెల్లడించకుండా ఉండలేకపోయేది. కాని తనకు వచ్చిన యీ ఆగ్రహాన్ని గ్రహించికూడా కోడలు తనతో వివాదపడకపోవడము ఆమెకు మరీ దుర్భరమైపోయింది. ఆమెకా గ్రామంలోని ఒకటిరెండు బ్రాహ్మణకుటుంబాలతో పరిచయం అతిత్వరలో అవడానికి కోడలిమీది ఆగ్రహం చాలా సాయపడిం దనవచ్చు. మొదటివారంలోనే పూర్వపు తమకుటుంబ పరిస్థితులూ, భర్తపాండిత్యప్రతిభా, తన తండ్రిధర్మబుద్ధీ, తల్లి ఆచారాధిక్యమూ మొదలైన విషయా లన్నీ సమ

గ్రంగా విశదీకరించడం ఒక దృఢమైన పరిచయ బంధాన్ని సృష్టించింది. రెండవ వారంలో ఆ యింటి వారు పరస్పరవైమనస్యాలను తనతో ప్రత్యేకంగా చెప్పుకోవలసినంత సన్నిహితురాలవడం సంభవించింది. దాంతో తన చిన్ననాడు అత్తగారు పెట్టే అతిలోకమైన ఖాయిదా, భర్త తనమీద వ్యర్థంగా పడిన అనుమానాలు, తత్ఫలితంగా తాను పడిన కష్టాలూ, తన మహత్తరసహనశక్తి మొదలయిన విషయాలతో ఆరంభించిన తన మొదటికోడలి సుగుణవర్ణనక్రమంలో ఔన్నత్యనిరూపణకి ఉదాహరించిన రెండవకోడలు సుందరిలోని లోపాలే ఆపయిని వారి నిరంతర ప్రాసంగిక విషయాలుగా పరిణమించేయి.

* * *

సుందరికి అక్కడి స్త్రీలతో పరిచయం కలుగజేసుకోవడం అంత అవసరంగా కనిపించలేదు. అంతే కాదు, యీషదసహ్యంకూడా కలిగిందనే అనాలి. అందుకు కారణం అత్తగారికీ వారికీ గల అతిపరిచయమే కాకుండా వారి సంభాషణావైఖరికూడా. తాను అతిసామాన్యంగా ఉన్న సంగతి గమనించినా ఏదో ఓదార్చుతున్నట్టు “అత్తే విచారించకమ్మా. ఇంతకీ నువ్వుమాత్రం అతనేం చచ్చిపోవాలని కోరేవా? అయినా ఆ భగవత్సంకల్పానికి మన మేం చేస్తాం? పాపం, హాయిగా ఉన్న ఒక్కకొడుకుచేతిమీదా పోయే అదృష్టం లేదు.” అని కష్టం చూపిస్తూ సుబ్బమ్మకే వచ్చినట్టూ, అందుకు కారణం ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగానైనా తానే అన్నట్టూ, అన్న మాటలు ఆమెకు ఉత్తరమియ్యవలసినంత యోగ్యములుగా తోచేవి కావు. వాటిలో తనలోని దోషాలు సంపూర్ణంగా అర్థమయినాకూడా అభిమానం కొద్దీ సర్దుకున్నట్టు “పాపం, నాకోడలుమొహం చూస్తేనే నాకడుపు తరుక్కుపోతుంది. వాడు పోయినదగ్గిర్నించి యిదే వరస. మూడేళ్లయినా ఒక్కమాటాడదు; వీధి గుమ్మంలోకేనా రాదు; ఇంత తిని శుభ్రమైన బట్ట కట్టుగోదు. నేను మొత్తపెడితే యిప్పుడింకా కొంత నయం. ఎప్పుడూ ఏపురాణమో-అవేవో ఆ పేర్లు నాకు తెలీవు-అవి చదువుతూ కూర్చుంటుంది. ఏదో జరపోయినా పుట్టెడు దుఃఖంలో ఉన్నదాన్నెందుకు శ్రమపెట్టాలని నేనే రెండుపూట్లా వార్చేస్తాను.” అని అనడంకంటె తన్ను బాహాటంగా తిడితే ఎంతో బాగుండుననిపించింది సుందరికి. సరే, వారి ఆనందానికి నేనెందుకు భంగం కలిగించాలి? వారలా అనుకున్నంతమాత్రాన నాకు వచ్చే నష్టమేమీ లేదుకదా అని తన్ను తానే సమాధానపరుచుకుంది సుందరి.

ఆమె ఏవో తప్పనిసరి అయిన గృహకృత్యాలు నిర్వహించేకొద్దికాలం మినహా, ఎల్లప్పుడూ సదాశివరావుగారి సంపాదనలో మిగిలిన రెండు బీరువాల పుస్తకాలూ చదివినవే మళ్లీమళ్లీ చదవటంతోనే కాలక్షేపం చేసేది. చిన్ననాటి చదువు అట్టే లేకపోయినా సడలని పట్టుదలతో చదివి చదివి మొదట్లో దురవగాహములుగా ఉండిన గ్రంథాలను సైతం క్రమేణ అర్థంచేసుకోడానికి ప్రయత్నం చేసి చాలావరకు సాఫల్యము పొందిందనే అనవచ్చు. మొదట్లో ఆమెకు విషాదాంత గ్రంథాలను చదవడమంటే ఒకవిధమయిన భయం వేసేది. అందుచేత ప్రతీపుస్తకమూ తుదిమొదలు చదివి సుఖాంతమయితేనే గాని చదివేది కాదు. చదివినవే చర్విత చర్వణంగా చదవడం చికాకు వేసి, ఆమె అదివరకు చదవని విషాదాంతములైన గ్రంథాలనుకూడా చదవడం మొదలుపెట్టింది. మొదటిమారు ‘టాగూరుగారి ‘ప్రాయశ్చిత్తము’ చదివినప్పుడు సగంచదివేసరికే ఆమెకన్నీళ్లతో పుస్తకంతడిసిపోయింది. ఒక మహత్తరమైన గ్రంథంలో అంతర్ప్రతిభ ఉన్నట్టు ఆమె గ్రహించడానికి అదే మొదలు. కథలో ఇకపైన ఏమవుతుందో అన్న విషయాన్ని పూర్వంవలె ఆలోచించడానికి ఆమెలో ఉత్సాహమే లేదిప్పుడు. తనకూ, ఆయా పాత్రలకూ ఏదో ఒక సన్నిహితమయిన సంబంధం ఉన్నట్లుగా ఆమె భావించగలదిప్పుడు. తానుకూడా పుస్తకంలోని వ్యక్తులతో సమంగా సుఖదుఃఖాలు అనుభవిస్తున్నట్టే— కాదు, తననూ వారినీ వేరుచేసే పదార్థం ఏమీ లేదనే ఆమె అనుకోగలిగేది. సగంలో చదవడం నిలిపి మళ్లీ మొదటినుండీ చదవడం ఆరంభించింది. ఇదివరకు తాను ఏపుస్తకంకూడా మొదలుపెట్టిన ఒకటి రెండు రోజులకంటె ఎక్కువ చదువలేదు. కానియీపుస్తకంచదవడం సరీగా నెల్లాళ్లయిందన్న సంగతి ఆమెకే ఒకవిధమయిన

ఆనందాన్నీ, ఆశ్చర్యాన్నీ కూడా కలిగించింది. ఒక పేరా చదివి అందులో ఉన్న విషయాన్ని గురించి ఆలోచన మొదలెడితే ఆపూటంతా తనకు తెలియకుండానే గడిచిపోవడం పునర్విమర్శనా దృష్టిలో ఆమెకొక నూతనోత్సాహాన్ని ప్రసాదించింది. ఇదివరకువలె యీ వున్న కొంచెము పుస్తకాలూ చదివేసేక ఏమిటి చెయ్యడం— ఎలాగు ఊసుపోతుంది అన్న ఆలోచనే ఆమెలో లే దిప్పుడు. తాను చదివిన పుస్తకాల్లోని ప్రతివ్యక్తీ, తన ఎదుట నిలిచి మాటాడుతున్నట్టే, తన కష్టసుఖాలు వారుకూడా పంచుకుంటున్నట్టే ఆమె ఊహాపథంలో నిత్యమూ ద్యోతమానమయేది.

* * *

ప్రకాశానికి ఆవూర్లో పనిఅయేసరికి అతని (సవతి) తమ్ముడు రాముకు నాలుగో ఏడు వచ్చింది. రామువిషయంలోమాత్రం సుబ్బమ్మగారికి సుందరి మీద వున్న దుర్భావము లేకపోవడమేకాక ప్రకాశం మీద ఉన్నకంటే ఎక్కువ అభిమానం ఉండడానికి కారణం లేకపోలేదు. ప్రకాశం పుట్టిన ఆర్నెల్లకే తనకు వైధవ్యము ప్రాప్తించడంలోని అతని జన్మ నక్షత్రదోషము తన మొదటికోడలు జానకియొక్క మనఃపూర్వకయత్నఫలితమే ననీ, అందువల్ల ప్రకాశాన్ని తాను ఆదృతితో చూడడం చాలా దోషమనిన్నీ ఆమెకు దృఢమైన విశ్వాసం ఉండేది. కాని జానకి చావుతో ఆమెమీదా, ప్రకాశంమీదా ఆమెకు గల వైషమ్యం యావత్తూ అంతరించిపోయిందికాని తల్లి లేని పిల్లవడడంవల్ల, చదువుకుకూడా సదుపాయంగా ఉంటుందని తాతగారు తమ యింట్లోనే ప్రకాశాన్ని ఎక్కువ వుంచుగోడంచేత సుబ్బమ్మగారికి ప్రకాశం యెడల తన నవీనాసమానాదృతిని చూపించడానికి అట్టే అవకాశం కలిగేది కాదు. అయితే ఆ కారణం చేత తాను ఎంతగా పరితపిస్తున్నదో ఇరుగుపొరుగు వారితో విశదీకరించడంతో ఆమె కొంతవరకు తన్ను తాను ఓదార్చుకోగలిగేది. కాని రాము అంటే మొదట్నించీ ఆమెకున్న అభిమానం అనుపమానం. దానికితోడు కోడలు వట్టి నిర్లక్ష్యంమనిషని తనకు మొదటినుండీ వున్న నమ్మకంతో తానైనా సరిగా చూడకపోతే తన కొడుకుకొడుకు ఎందుకూ కొఱగానివాడైపోతాడేమో అన్న భయంతో సర్వదా తన శక్తికి అతిగా కూడా శ్రమపడేది. రామునిగురించి, అందులో తల్లిదగ్గర పాలు తాగడంకొంచెం ఎడపెట్టినదగ్గరనుంచీ ఆమె తన సర్వస్వమూ వాడేననీ, వాడు పెద్దయేక రేపే కలెక్టరన్నా అవుతాడనీ ఆమె నిస్సందేహంగా నమ్మగలిగేది. ఆమెనమ్మకంలోని నిశితత్వం ఎంతవరకూ వెళ్లిందంటే ఒకమారు బొత్తాఖానీలో "ఏమండీ, మీమనవడికి ఎంత కట్నమిస్తే మాపార్వతిని చేసుగుంటా"రని పొరుగింటి బుచ్చెమ్మగారడిగితే "అబ్బో, వాడెక్కడా! ముందు కలెక్టరీ ప్యాసు కాందే పెళ్లే చేసుగోడు. అప్పుడేనా వాడికి ఏ జమీందారుగారి కూతురోగాని నచ్చుతుందా?" అని ఆమె అన్నమాటలు విన్నవారికి హాస్యానికి అంటున్నట్టు తోచినా ఆమెమాత్రం హృదయపూర్వకంగా అన్నవే!

సుందరికి తన కొడుకుమీద తనకంటే ఎక్కువ అభిమానం ఉన్నట్లు అత్తగారు ప్రవర్తించడం మొదట్లో కొంత కంటకంగానే ఉండేది. తా నంత ప్రపంచజ్ఞానం లేని చిన్నపిల్ల కాదే - మాటిమాటికీ "నూనె రాసేవా? ఒళ్లు తుడిచేవా? పాలిచ్చేవా" అనో, "ఎంతాకాలం పెద్దవాళ్లవే ఉడికిపోతున్నాం, కొంచెంసేపు మంచంమీద దొర్లు; ఉయ్యాల్లో పడుకోబెడితే నేనైనా ఊచుతాను" అనో ఏమీ తెలీనివాళ్లకి చెప్పినట్టు చెప్పడమే కాకుండా ఇరుగు పొరుగువారితో "పాపం, మాకోడలు కేమీ తెలీదు. పిల్లడేడిస్తే నేనచెప్పేదాకా పాలివ్వాలనికూడా తెలీదు. అయినా యీకాలంవాళ్లంతా యింతే గాబోలు!" అని ఆమె పదేపదే అనడం సుందరికి చాలా సిగ్గుగా ఉండేది. అయినా అత్తగారి మాటకు తానేమాత్రం మారాడినా ప్రశాంతమయంగా వున్న గృహసీమ ఎంత భయానకసంగ్రామరంగంగా మారుతుందో ఆమెకు పూర్తిగా అవగతమవడంవల్ల ప్రత్యుత్తరం ఇయ్యకుండా, వ్యతిరేకంగా ప్రవర్తించకుండానే రామాన్ని మూడేళ్లు పెంచింది. రాముకి కొంచెం మాటలు వస్తున్న సమయంలోనే భర్త గతించడంతో ఆమెకు తననీ, కొడుకునీ సన్నిహితుల్ని చేసే బంధం ఏదో సడలిపోయినట్టనిపించింది. అంతేకాదు.

సదాశివరావుగారు తన మంచిచెడ్డలూ ఆస్తీ అప్పూ మొదలయినవి తనలో తీసుకొనిపోకుండా ఎలా అయితే ఒదిలేసేడో అలాగే రామునికూడా ఒదిలేసేడని ఆమె నమ్మకం. అప్పటినుండీ అత్తగారు రామునిగురించి తీసుకొనే శ్రద్ధ సుందరికి కొంతవరకు ముదావహంగానే పరిణమించింది. వాడుకూడా పెద్దవుతున్న కొద్దీ నాయనమ్మవద్దనే ఎక్కువ చనువుగా ఉండేవాడు. తనకు ఏది కావలసివచ్చినా నాయనమ్మనే అడిగే వాడు. ఇవ్వనప్పుడు సామాన్యంగా చిన్నపిల్లలు చేసే పెంకితనం అంతా క్రమం తప్పకుండా చేసేవాడు. కొంచెంవినిపించాలనే "అలాపుస్తకం పట్టుకూర్చోక పోతే వాణ్ణోమారు తియ్యకూడదూ ? ముసలిముండని ఎంతని చస్తాను" అన్న మాటలు వినిపించేవే కావు సుందరికి. కాని మనవడు తన్నలా చికాకుపరచడమే ఆవిడఅభిమతం. రెండురోజులు కొంచెం జ్వరం తగిల్తే "అయ్యో! రోజల్లా బంతిలా ఆడుకొనేవా డమ్మా! 'నానమ్మా,ముట్టుకొనేదా పంచదా రిస్తావా' అనేవాడమ్మా!" అని బహుధా వాపోయేది.

సుందరి ఏదో నిర్దేశితకృత్యంలాగే రాముకి తలదువ్వడం, మాసిన బట్టలు మార్చి కొత్త బట్టలు తొడగడం మొదలయిన పనులు చేసేది. రాముకూడా ఏమీ మాటాడకుండా తల్లిదగ్గ రున్నంతసేపూ చాలా గంభీరంగానే ఉండేవాడు. అయితే ఆగాంభీర్యం ఒక్క తల్లిదగ్గ రున్నప్పుడే. మిగతావారందరివద్దా- అందులోనూ నాయనమ్మవద్ద చాలా చలాకీగానే ఉండేవాడు. కాని అగాధవిషాదావృతమయిన తల్లి ముఖం చూసేసరికల్లా ఏదో ఒక చెప్పలేని భయగౌరవ సమ్మిళితభావం కలిగేది ఆ నాలుగేళ్ల అమాయక హృదయంలో. అందువల్లనే ఆమె పిలిచేసరికి తల దువ్వించుకుందికి వచ్చేవాడు. అంతేకాదు. నాయ నమ్మవద్ద మారాం చేస్తూన్నప్పుడు "ఏమిటి రామం! ఆపెంకితనం ? ఇలా నాదగ్గరకు రా!" అని పక్కగదిలోనుండి ఆజ్ఞాసూచకమైన స్వరం వినిపించ డంతో అంత పెంకితనం చేస్తున్నవాడూ మం త్రముగ్ధుల్లాగు ఊరుకొని దగ్గరకు మెల్లి గా వెళ్లి "ఏమీ లేదమ్మా. నాకేమీ అక్కరలేదు" అని, చిరునవ్వు నవ్వే తల్లిముఖం చూసి తన కాంక్షాప్రాప్తి అయినప్ప టికంటె అధికమైన ఆనందంతో ఆడుకుందికి వెళ్లిపో యేవాడు. కాని యీవిషయంలోమాత్రం సుబ్బమ్మ గారికి మనవడిమీద అమితమైన కోపం వచ్చినా మళ్లీ ఒక్కగంటలో "నాయనమ్మా, బెల్లంముక్కియ్యవూ" అంటూ దగ్గరకు వచ్చిన మనమణ్ణి చూస్తేఆకోపమంతా అదృశ్యమైపోయేది. కాని తప్పనిసరిగా "చూడమ్మా! నీకొడు కిక్కడ ఇల్లుతీసి పందిరివేసేస్తున్నా"డని కోడలుతో ఫిర్యాదు చేయవలిసిరావడం చాలా చిన్న తనంగానే తోచేది.

సుందరి తన రామమీద సహజంగా ఉండవల సినంత ప్రేమ చూపించలేని మాట వాస్తవమే. అసలు ఆమె సదాశివరావుగారిని మనస్ఫూర్తిగా ప్రేమించ లేకపోడమే రాముని చాలా సామాన్యంగా చూడడా నికి కారణమేమో?సదాశివరావుగారివలనఆమెకుకలిగిన ఆనందం దెబ్బతగిలితే కలిగే నొప్పిలాగే అయాచితం గానూ, అతిసాధారణంగానూ కాకుండా అనవస రంగా అసమయంలో వచ్చిన ఆనందంవలె ఉండేది. తన తిండికి గుడ్డకూ ఏవిధమైన లోపం రానీకుండా, మిగతావిషయాల్లోకూడా అట్టే నీరసంగా చూడని సదాశివరావుగారి ఔదార్యానికి ప్రతిఫలంగా తాను చేయగలిగినదల్లా అతని ఆనందాన్ని తాను నిరోధించ కపోవడమే అని ఆమె మనసా విశ్వసించగలిగేది. అంతేకాని ఆమె అవివాహితగా ఉన్నప్పుడు తన తల్లి కంటెకూడా సన్నిహితుడూ, తన హృదయగ్రంథం లోని ప్రతిపత్రమూవినడానికి యోగ్యుడూ ఐన మిత్రు డు దొరుకుతాడని ఆమె కన్న పత్రికలలోని ఆమె భర్తకూ సదాశివరావుగారికీ ఏ అంశములోనూ సాదృ శ్యము లేదు. ఆమెకు తనకు కాబోయే భర్త అంటే తనకంటే ఏ అయిదారేళ్లో వయసులో పెద్దవున్న యువకుడే మానసికంగా గోచరించేవాడుగాని బ్రతికి వుంటే తన తండ్రితో సమానమైన యీడు గల సదా శివరావుగారివంటి మనిషిప్రక్కను తాను పెండ్లిపీటల మీద కూర్చోవలసివస్తుం దని అంత నైరాశ్యంలోనూ ఆమె ఊహించలేకపోయేది. అందువల్లనే మొదట్లో ఆమెకు సదాశివరావుగారు తన ద్వారా నెరవేర్చు కున్న కృషికి ఫలితంగామాత్రమే రాముతోచడమూ,

అతనిని 'నావాడు' అన్న దృష్టితో చూడలేకపోడమూ సంభవించేయి.

* * *

తన పెళ్లిలో ప్రకాశాన్ని చూచిన దగ్గరనుండీ కూడా సుందరికి అతనంటే ఒక అసామాన్యమైన అనురాగం కలిగింది. తనకంటె కొంచెం (ఒకయేడాది) పెద్దయినా అత నామెకు తనకంటె చాలా చిన్నవాడుగా కనిపించేడు. అందుకు కారణం మామయ్యగారింట్లో అత్తఅదుపుఆజ్ఞలకూ, ఆమెపిల్లల యీసడింపులకూ లోబడి ఉండడంవల్ల ఆచిన్నతనంలోనే తనచుట్టూ ఉండే మనఃప్రవృత్తులను అర్థంచేసుకొని వాటికి తగినట్టు మెలగడానికి చేసిన ప్రయత్నానికి ఫలితంగా తనవయస్సు తానే మరిచిపోయే స్థితిలోకి రావడమే. తనకేగాని ఒక తమ్ముడుంటే అలాగే ఉండేవాడేమోనని ఆమె అనుమానం. అందుచేతనే తను అత్తవారింటికి వచ్చిన కొత్తలో శలవులకు ప్రకాశం వస్తాడంటే ఏమో తనకే తెలియని ఆనందం కలిగి నెల్లాళ్లకు ముందునుండీ రోజులు లెక్కబెట్టడం మొదలుపెట్టింది. తన ఉత్సాహాన్ని బైటపెట్టే అవకాశం మరేమీ లేకపోడంవల్ల రుసరుసలాడుతున్నా అత్తగారినే మళ్లీమళ్లీ "అత్తా, ఇంకా ఎన్నాళ్లకు ప్రకాశం వస్తాడండీ" అని మాటిమాటికీ అడిగేది. గాని ఆమెమాత్రం "ఏదో ఒస్తాడు. ఒస్తే చూసి సంతోషించడానికి తల్లి లేదుకదా!" అని నిరుత్సాహంగా అన్న మాటలు ఆమె సహజధోరణిగానే సుందరికి తోచేవి; కాని తాను అతనికి సవతితల్లి అవడంచేత సహజంగా అతనిమీద తనకి యీర్ష్యగా ఉంటుందనీ, అందువల్లనే అమ్మో! ప్రకాశం వచ్చి తన భర్త సొమ్ము తినిపోతాడే అన్న భయంతో అడుగుతున్నాననీ ఆమెవాక్యాల్లో ఉన్న అంతరార్థం తరువాత ఎన్నాళ్లకోగాని ఆమెకు అర్థంకాలేదు. అతనేదో పెద్ద కాలేజీలో చదువుతున్నవాడుకదా, తానేదో అమాయికంగా తన స్నేహితురాయళ్లతో మాట్లాడినట్టు మాట్లాడితే అత నేమనుకుంటాడో? ఇంతకీ అతను మాట్లాడే విషయాలు తనకు పూర్తిగా బోధపడవేమో? ఒకవేళ అతను తనతో సరీగా మాట్లాడతాడో మాట్లాడో? యివే ఆమె ఆలోచనలు.

తీరా ప్రకాశం వచ్చాక ఆమెవుత్సాహం చాలా చప్పబడిపోయింది. కాస్త చలాకీగా మాట్లాడ్డమన్న విషయంలో కొడుకుకంటె తండ్రే చాలా నయం అని ఆమె సులువుగా గ్రహించగలిగింది. అదీ కాదు. ప్రకాశానికి తనతోనేకాదు ఎవ్వరితోనూ సరీగా మాట్లాడడం చేతకాదు అన్న విషయంకూడా త్వరలోనే ఆమెకు అవగాహన అయింది. పోనీ అతనికి ఆటలూ మొదలైనవి ఏమైనాసరదా ఏమో అంటే అలాగా కనిపించలేదు. ఏదో తీవ్రమైన విషయం ఆలోచిస్తున్నవాడిలాగు ఎల్లప్పుడూ కూర్చొనేవాడు. లేకపోతే నాయనమ్మవద్ద కూర్చొని అక్కడ తాతగారి యింటి విషయాలు కేవలం ఆడపిల్లలాగ వర్ణించే అతని వర్ణనలుచూస్తే సుందరికి అక్కడకూడా ఒక్క అమ్మమ్మ దగ్గర తప్పించి మిగతావాళ్ల దగ్గర అతనికి తగినంత చనువు లేదనీ, తక్కిన పిల్లలందరూ ఒకటే, తానొక్కడూ ఒకటే అన్నట్టుగానే ఉండేవాడనీ తోచేది. తాను మంచి పుస్తకాలు చదువుకోగలిగికూడా అతను అతి అమాయికంగా ఆదివరకు తాను డెబ్బైమార్లు విన్నవే అయినా నాయనమ్మ చెప్పే రాజు కథ, అన్నదానమాహాత్మ్యం కథ చెప్పమని అడగడమూ, సుబ్బమ్మగారు "ఒరే! బుచ్చిబాబూ! ఒక్క నీకు తప్పించి యీ కాలంవాళ్లకి నా కథలు నచ్చే నచ్చ"వని తన అరసికతను సూచిస్తూ ఆమె కథ చెప్పడమూ, అతను ఓపిగ్గా వినడమూ సుందరికి చాలా వింతగానూ, విసుగ్గానూ ఉండేది. మేడమీద ఉండవలసిన స్థితిలో దిగుడుబావిలో ఉన్నట్టుగా కనిపించేది అతని వైఖరి ఆమెకు. ఆమె సందేహం ఏమిటంటే అతను చిన్నప్పటినుండీ యిలాగే అన్ని విషయాల్లోనూ ముభావంగా వుండేవాడా, లేక తల్లి లేకపోవడంవల్లా, తాతగారింటిలో తగిన ఆదరణ చూపించేవా రెవరూ లేకపోవడంచేతా అని. తన ప్రవర్తనలోకూడా మాతృమృతి అనివార్యంగా కొంత మార్పు తెచ్చిపెట్టినా అందువలన తనమీద ఇతరులు చేసే ఒత్తిడి తగ్గినా నిరుత్సాహంగా ఉండడం ఆమెకు ఎంతమాత్రమూ యిష్టం లేదు. కాబట్టే అత్తవారింటికి వచ్చిన కొద్దిరోజుల్లోనే ఆమె నిశ్చింతగా యిరుగుపొరుగువారితో ఏవో ప్రసంగాలు చేస్తూ, అల్లికపనులతోనూ, పుస్తక

పఠనంతోనూ కాలక్షేపం చేయగలిగేది. కాని ప్రకాశాన్ని మరికొంచెం పరిశీలించిన తరువాత కేవలం మాతృసూర్యాస్తమయమే అతను అంత నిశ్శబ్దంగా వుండడానికి కారణం కాదని తాను గ్రహించింది. సరియయిన స్నేహితులు దొరకకపోవడంవల్ల అతనిలో సహజంగా వుండే మాంద్యము చాలా విపరీతమయిన స్థితిలోకి వచ్చిం దని ఆమె విశ్వాసం.

ఆమెకు అతని అప్పటి ప్రవర్తన నచ్చకపోయినా అతన్ని మొదట చూచినప్పుడు కలిగిన భాతృభావం మాత్రం ఆమెహృదయంలో చిరస్థాయి అయిపోయింది. అందువల్లనే అలాంటి పరిస్థితుల్లోకూడా ఆమె అతనితో ఎక్కువగా కలిసిమెలిసి ఉండడానికి బహుధా ప్రయత్నించేది. కాని అతనుమాత్రం తన ప్రయత్నాలకు చాలా అతీతుడుగా ఉండడము ఆమెకు ఒకవిధమైన పట్టుదల నిచ్చింది. ఆమెకు ప్రకాశాన్ని తనని అర్థం చేసుకొనే స్థితిలోకి తీసుకురావాలని ఉన్న ఆశయం నెరవేరేవరకూ మరేమీ చేయాలనిపించేదే కాదు. తనతో ఎంత మాట్లాడకపోయినా తానే అవకాశం కల్పించుకొని చాలా చనువుగా "ప్రకాశం, చూసేవా మన పెరట్లో పూచిన మల్లెపువ్వులు. అక్కడ మీవాళ్లింట (తాతగారి ఊళ్లో) ఏమైనా పువ్వులమొక్క లున్నాయా" అనో, "మీకు బళ్లో డ్రాయింగు నేర్పుతారు కదూ? నాకు నాలుగు పువ్వులూ లతలూ రాసిద్దూ. నువ్వు మళ్లీ వచ్చేసరికి గుడ్డమీద కుడతాను" అనో, "మీకాలేజీలో ఆడపిల్లలుకూడా చదువుకున్నారు కదూ! వాళ్లూ మీరూ కలిసే కూర్చుంటారా, వేరువేరుగా కూర్చుంటారా" అనో ఆమె అడిగే ప్రశ్నలకి జవాబు చెప్పడమంటే విరిగిపోయిన ఆటవస్తువు గురించి తల్లితో చెప్పలేకా, మానలేకా పసిపిల్లడు పడే అవస్థంతా పడి, క్రాస్‌ఎగ్జామినేషన్ చేస్తున్న వకీలుకు ఎదురుగా నిలబడి నీళ్లునములుతూ ముద్దాయి చెప్పే జవాబుల్లాగమాత్రమే అతని ప్రత్యుత్తరాలుండేవి. కాని అలాగైనా అతనితో మాట్లాడ్డం అంటే ఆమెకు సరదాగానే ఉండేది. అయితే మధ్యలో పూచీ యావత్తూ నాదే అన్నట్టు అత్తగారు వచ్చి "ఆ! వాడికేం తెలుస్తుంది? అయినా ఆసాదంతా వాడి కెందుకు (చంటినాగమ్మకి)" అని అతనేమీ తనకంటె చాలా చిన్నలాగూ, తాను ప్రశ్నించే విషయా లతనికి తెలియకపోవడమే సహజ మన్నట్టూ ధాటీగా అనడమూ, "అవును. అదే యథార్థం" అన్నట్టు ప్రకాశం మౌనం వహించడమూ ఆమెప్రయత్నానికి చాలావరకూ భంగకారులుగానే ఉండేవి.

* * * *

ఆతరువాత సంవత్సరం వచ్చేసరికి ప్రకాశంలో కలిగిన మార్పు ఆమెకు ఎంతో ఆనందా న్నిచ్చింది. అసలు అతని వేషంలోనే చాలా నవీనత గోచరించింది ఆమెకు. పూర్వంవలె ఉందా లేదా అన్నంత చిన్న క్రాఫుకాక ఉంగరాలుతిరిగిన పెద్దక్రాపింగు అతని మొగాని కొక కొత్త అందం తెచ్చింది. వస్త్రధారణ విషయంలో సైతము అతనిలో వచ్చిన మార్పు ఏదో మహత్తరపరిణామంగా తోచింది సుందరికి. అతనిలో వచ్చిన మార్పు బాహ్యవేషంతో ఆగిపోలేదు. తాను స్నేహితులిళ్లకు అప్పుడప్పుడు వెళ్లడమూ, తనతో మాట్లాడ్డానికి స్నేహితులు ఇంటికి వచ్చేపాటి ప్రాపంచికజ్ఞానం సంపాదించగలిగేడు.

పూర్వంవలె పిన్ని ఏదేనా తనను ప్రశ్నిస్తే, ఎక్కువ కంగారుపడకుండా జవాబివ్వడమేకాకుండా ఇంకా ఏప్రశ్న లడిగినాసరే సమాధానాలు చెప్పడానికి సిద్ధంగా ఉన్నానన్నట్టు, నోట్సు క్షుణ్ణంగా వల్లెవేసిన విద్యార్థి ప్రశ్నపత్రం పుచ్చుకొనేముందు చూపించే ధీమా యావత్తూ మొగంలో చూపించడము ఆమెకు ఎంతో సంతోషదాయక మయింది.

ఇప్పు డతన్ని మాట్లాడించడానికి పూర్వమంత శ్రమ అక్కరలేకపోవడంవల్ల ఆమె అతనితో ఎన్నో విషయాలు ముచ్చటించడానికి అవకాశం కలిగింది. కాని అతను ప్రశ్న లేకపోతే మాట్లాడలేకపోవడం చేత, చెప్పే జవాబులుకూడా అవుననో కాదనో చాలా సామాన్యంగా ఉండడంవల్లా అతని దగ్గరనుండి గ్రహింపవలసిన విషయా లట్టే కనపడలే దామెకు. అతనితో మాట్లాడ్డమంటే ఒక విషయంలో వుండే మంచీ చెడ్డాకూడా, ప్రశ్నా జవాబూకూడా చాలా వరకు తానే చెప్పుతూ, జమీందార్ల పిల్లలకి ప్రైవేటుచెప్పే ఉపాధ్యాయుడులాగ తను చెప్పే

విషయం అంత యిష్టంగా వినలేదన్న సంగతి తెలిసీ కూడా ఆమె అతనితో గంటలతరబడిని మాట్లాడేది.

*  *  *  *

అతనికి కథలంటే సరదా అన్న విషయం అదివరకే (అంతకుముందు పర్యాయము వచ్చినప్పుడే) గ్రహించడంచేత అతన్ని ఏమయినా కథలు చెప్పమని కోరేది. కాని ప్రకాశం బడిపుస్తకాల్లో అట్టే కథ లుండవనీ, ఉన్నా ఏమీ బాగుండవనీ చాలా నిరుత్సాహంగా అని, పోనీ అంతగా కావలసివస్తే నాయనమ్మ చెప్పిన నాలుగు కథలే చెప్తా నన్నప్పుడు సుందరి నవ్విన చిరునవ్వు అతనికి అర్థము కాలేదు. ఆమెను ఏవైనా కథలు చెప్పమనడానికి ధైర్యం చాలక తటపటాయిస్తున్న సమయంలో సుందరి "అయితేంలే. నే నేవేనా కథలు చెప్పేదా"అని, అతని సమాధానంకోసం అట్టే నిరీక్షించకుండానే కథ చెప్పడం మొదలుపెట్టింది. అదే వారిద్దరి స్నేహలతా వనలెత్తడానికి మొదలు. సౌరభసంపద ననుభవించ డంలో మాత్రం వారిద్దరిలో సామరస్యం చాలా తక్కువే అనాలి. ప్రకాశానికి పరిమళప్రభమీద వున్న ఆసక్తి ప్రసూన పాళిమీద లేదు; సుందరికి వల్లీమతల్లిని కుసుమిల్ల జేయడంలో వున్న తన్మయా నందము సుమరామణీయకతలో గాని, వాసనాబంధుర తలో గాని లేదు.

మొదట్లో ఆమె అరేబియన్ నైట్సులో కథలూ, కాశీమజిలీలలో కథలూ చెప్పి క్రమంగా తాను చది విన నవలలూ, నాటకాలూకూడా చిన్న కథలుగా మార్చి చెప్పేది. ప్రకాశానికి కథ వింటున్నంతసేపూ బాహ్యప్రపంచం సర్వమూ అంతర్థానంకాగా, కథలో ఉన్న వ్యక్తులతో ఊహాలోక మొకటి నిర్మించుకొనే వాడు. మధ్యలో సుందరి తన వుద్దేశాలూ విమర్శ నలూ విశదీకరిస్తూ ఉంటే కొంతసేపు అయిష్టంగా విని, "అయితే ఆ రాజకుమారు డాఖయిదులోంచి ఎల్లా తప్పించుకున్నాడు"అని పేలవంగా ప్రశ్నించే వాడు. ఆమెకూడా సాధ్యమైనంతవరకూ తన విమర్శ నలు తగ్గించి, అతని అభిరుచికి అనుకూలంగా ఆకర్ష ణీయంగా కథ చెప్పేది.

సుబ్బమ్మగారికి మాత్రం కోడలూ మనుమడూ ఇంత కలిసిమెలిసి కథలు చెప్పుకోడం అట్టే యిష్ట ముండేది కాదు. కాని ప్రకాశంసంతోషానికి భంగం కలుగుతుందని ఎల్లాటి అడ్డంకులూ పెయ్యకుండా ఊరుకొనేది. అంతేకాదు. సుందరి చెప్పే కథలు తనకుకూడా ఎంతో బాగుండడంచేత ఎందు కీకథలు, పుణ్యమా పురుషార్థమా అని మొదట్లో అన్నా చాలా సంతోషంతో వినేది; కాని కొంచెంసేపట్లోనే ఆమె కుతూహలలేశం నిద్రావేశంలో అంతర్లీనమై పోవ డంతో ఆమె ఏకథా సంపూర్తిగా వినక, మర్నాడు 'అయితే ఆదొంగవెధవ ఆరాజుకూతుర్ని పెళ్లాడేసే డన్నమాట' అని ప్రకాశంతో అనేది.

'అమ్మో నాయనమ్మా! నువ్వక్కడే నిద్రపో యేవా? ఇంకా ఎంతకథుం దనుకున్నావు? చెప్పను న్నావా ఇప్పుడు?' అని మధ్యమధ్య మరిచిపోయిన దగ్గర పిన్ని నడుగుతూ కథ పూర్తిచేసేవాడు. సుబ్బ మ్మగారికి కోడలు కథచెపితే ఉన్న సొగసు మను మడు చెప్పినప్పుడు లేదని స్పష్టంగా కనిపిస్తున్నా కాదనుకుందికే ప్రయత్నం చేసేది.

*  *  *  *

ప్రకాశానికి ఆవూర్లో పని అయినదగ్గరనుంచి తనకు సరిఅయిన సహవాసం దొరికినట్టనిపించింది. భోజనం చేయడానికి తప్పిస్తే ఇంటికి వచ్చేవాడే కాదు. అదీ నాలుగైదు కబుర్లు వెళ్లిన తరవాతే. రాత్రికూడా పండ్రెండుగంటలు దాటినతరవాతగాని పడుక్కుందికివచ్చేవాడు కాడు. తన బడిలోనే పని చేస్తున్న మరియిద్దరు మేష్టర్లూ, రెండవ ఫారంతో చదువు సమాప్తిచేసిన ఆవూరి కరణంగారి తమ్ముడూ, మునసబుగారి ఇల్లరికపు అల్లుడొకడూ కలిసి పేకాట వేసేవారు. మొదట్లో పందుసుదినాల్లోమాత్రం డబ్బు వేసి మిగతా రోజుల్లో ఊరికే ఆడుకొనేవారు. కాని డబ్బులేని ఆటలో ఏమీ మజా కనిపించక పోవడంతో అనుదినమూ డబ్బువేసే ఆడుకొనేవారు. వారి తృప్తి ఏమిటంటే తమ డబ్బు తమ మధ్యనే ఉంటుందికాని పైకి ఎక్కడకూ పోలేదుకదా అని. ఇదివరకు ఎల్లాటి అలవాట్లూ సరదాలూ లేక ఏదో యంత్రంలో సంచలించే ప్రకాశానికి ఇక్కడికి రాక

డం ఏదో మహాసంతోషప్రవంతిని చేరుకున్నట్టనిపించింది. ఏది ముందో ఏది వెనకో చెప్పలేముగాని అతనికి కారాకిల్లీ, పొగచుట్టాకూడా అలవాటయినాయి. అయితే యీరెండూకూడా పేకాట బాగా అభ్యాసమయినతరవాత వచ్చినవే.

చిన్నతనంనుండీ యీఆటలో బాగా ఆరితేరినవారితో మధ్యలో ఆరంభించిన తనకు ఆడడం చాలా కష్టంగానే ఉండేది. అయితే నిరంతరమూ అదేపనిగా ఆడడంవల్ల అతనికీ బాగానే పట్టుబడింది. కాని ఎంత లేదనుకున్నా యింతో అంతో నష్టమేగాని లాభమన్నది ముచ్చటకేనా లేకపోయేది ప్రకాశానికి. మొదటి రెండుసంవత్సరాలలోనూ, ఉద్యోగం అయిననాటికి మిగిలిన ౩౭౦ రూపాయిలలోనూ బట్టలూ మొదలయినవాటి కయిన ఏయాభయ్యో తప్ప మిగిలినవి యావత్తూ పేకాటలో పోయినట్టే. 'ప్రకాశం! ఈ కాస్తా నీవివాహవ్యయానికి పనికివస్తుంది. ఎంత అవసరం వచ్చినా వాడకు' అని చెప్పిన సుందరికి ఈ విషయం తెలియనేతెలియదు. కొన్నాళ్లు తనకు వచ్చే (పేకాటలో) లాభంతో యీనష్టం భర్తీచేద్దా మనుకున్నాడుగాని క్రమంగా ఆరకపు ఆశ అంతరించడంతో ఒకవేళ పిన్ని తనను ప్రశ్నిస్తే ఏమని జవాబివ్వడం అని తనలో తానే చాలా ఆందోళన పడేవాడు. పెట్టెలో మిగిలిన ఆఖరి అయిదురూపాయల కాగితాన్ని తీస్తున్నప్పుడు అతనిని ఏదో కొత్త సిగ్గు ఆక్రమించుకొంది. ఇకముందు ఆడకూడదు అని నిశ్చయించుకున్నాడు. మంచం వీధి అరుగుమీద మాని లోపలవేసుకొని పడుక్కున్నాడు. అందరికంటే గంట ముందుగా వచ్చే ప్రకాశం నాడు వేళ అతిక్రమిస్తున్నా రాకపోడం మిత్రమండలిలో పెద్దఅలజడికి కారణమయింది. ఒక అరగంట చూసేరు.

"ఒరే, బ్రదర్! మన ప్రకాశిగా డింకా రాలే దేమిట్రా? మనం గాని డబ్బా కడుతున్నట్టు వీ డేమేనా కనిపెట్టే డంటావా?"

"అబ్బే! వాడి మొఖం! అంత కనిపెట్టికూడా మాట్లాడకుండా ఊరుకొనేపాటి తెలివి తేటలు కూడానా?"

"కాని, ఒరే, వాడింత సనవకదా! అసలు అక్కడి మాత్రం వాడికి తగిన చోర వేడిసిందా అని."

"నో! నో! వీడు అమాయకు డైతే ఏమి? అదే అవతలివాళ్లకి మంచి అవకాశం. ఆడు తిమ్మా అంటే ఆడడానికీ, పాడు తిమ్మా అంటే పాడడానికీ-"

"అసలు వీడికి పెళ్లి కాకపోడానికి యిదో ముఖ్య కారణ మట."

"అది కాదోయ్. వీళ్ల మేనమామదగ్గర ఎదిగిన కూతు రుందట. ఈ పాతిక రూపాయల ఖర్మ మేమి, రైల్వేలో మంచి ఉద్యోగం వేయిస్తాను రమ్మన్నాట్ట. అయితే మనవాడికి కాపిల్ల సుతలామూ నచ్చలేదట. అంటే నచ్చకపోడం వీళ్ల పిన్నికి- దాంతో వీడికీ నచ్చలే దన్న మాటే కదూ,"

"ఇంతకీ నచ్చడానికీ నచ్చకపోవడానికీ వాడికి మరి పెళ్లి అవుసర మే కనిపించలేదు."

"ఏమో మనకి బాగా తెలియని సంగతినిగూర్చి యిల్లా అనుకోటం మంచిపద్ధతి కాదు."

"తెలియకపోడం ఏమిటి లే- వాళ్ల నాయనమ్మ స్వయంగా వచ్చి మాదొడ్డమ్మతో మధ్యాహ్నం అల్లా యిదే గోల."

"సరే యీ హస్కు కేం గాని- అప్పుడే ఎనిమిదిన్నర అయింది. ఎవణ్ణేనా గుంటణ్ణి పంపిద్దామేమిటి రమ్మని. అందాకా మనం అయిదుగురి మీదా వేసుకుందామా?"

ప్రకాశాన్ని పిలవడానికి వెళ్లిన కుఱ్ఱవాడు ఆయనకు తలనొప్పిగా ఉండడంచేత రాలే నన్నారని కబురు తెచ్చేడు.

*　　*　　*　　*

"చిన్నప్పుడేమో జబ్బంటేమాత్రం ఏం? దగ్గర సంబంధం. ఉభయఖర్చులూ పెట్టుకొని పెళ్లి చేస్తానన్నాడు. మొన్న వాళ్ల నూరీడు చూసిందట. సళాకుల్లా బంగారచ్చులాగుందిట. కడిగేసిన స్ఫటికం గాని పిల్ల కాదుట. ఏమయితేనేం, నీపెళ్లి అవగా చూసి సంతోషించే భాగ్యం నాకు లే"దని నాయనమ్మ సంతతమూ వాపోవడంతో ప్రకాశానికి తన

యిష్టాయిష్టాలు ఎలా వున్నా యీగోల వదిలించుకోడానికేనా ఏదో పిల్లని చేసుకుంటే బాగున్ననిపించేది. కాని అంతలోనే మెఱుపుమెఱిసినట్టు "చూడు ప్రకాశం, నే నాపిల్లని చిన్నప్పుడు చూసేను. బాగానే ఉంది కాని కొంచెం చీకికళ్లు. అంతేకాక వీళ్లు చెప్పిన మాటలనే కొంచెం లోతుగా తరిచిచూస్తే ఆపిల్లకి అప్పుడే క్షయ అంకురించిందేమో అని నాకు భయంగా ఉంది. అల్లాటి పిల్లను చేసుకోడం ఎప్పటికేనా ప్రమాదమే. వెయ్యి అబద్ధా లాడైనా ఒక యిల్లు నిలబెట్టాలనే లౌక్యులు తాము నిలబెట్టదలచుకొన్న యింటిని తమ అబద్ధాలమూలంగానే పునాదుల్లోంచీ పడదోస్తున్నామని గ్రహించకపోడంచేత పెళ్లిమాటలు మాట్లాడ్డమంటే, నిజంలాగే కనిపించే అబద్ధాలను నేర్పుగా ఆడడమని అర్థం తేలింది. సరే దానికేం. మాటకి నువ్వాపిల్లను చేసుకున్నా వనుకో. నిరంతరమూ దగ్గుతూ నీరసమని స్త్రీ మూలుగుతున్న ఆపిల్లవల్ల నీ కేం సౌఖ్యం ఉంటుంది? ఒకవేళ ఆపిల్లకు పిల్లలు పుడితేమాత్రం మొదటినుండి రోగగ్రస్తులవడం నిశ్చయం. అప్పుడు నీజీవితం ఎంత దుఃఖభాజన మవుతుందో చూసుకో" అన్న పిన్నిమాటలు వెంటనే ఆలోచనాపథంలోకి రావడంతో యథాస్థితికి వచ్చేవాడు ప్రకాశం.

* * * *

పేకాటకు పోకుండా రెండుమూడురోజులుండడమే ప్రకాశానికి బ్రహ్మాండమయింది. తిరిగీ పూర్వపు టుత్సాహంతోనే ఆట సాగించడం మొదలుపెట్టేడుగాని పూర్వంలాగ పెట్టెలోంచి డబ్బు తీసుకొని వెళ్లి ఖర్చుపెట్టడానికి లేకపోడంతో నెలజీతంలోదికూడా కొంత ఖర్చుపెట్టవలసివచ్చేది. ఇంటికి కావలసిన వస్తువులు చాలావరకూ అరువుగా తేవలసి రావడం చాలా చిన్నతనంగానూ, భయంగానూ తోచినప్పటికీ వేళ అయేసరికి తనకు తెలియకుండానే మిత్రమండలివద్దకు కాళ్లీడ్చుకొనిపోయేవి.

ప్రకాశంలోని ముఖ్యమయిన ఒక గుణం ఏమిటంటే, యితరులు వాగ్రూపకంగా తన్నేమనుకున్నా లెక్కచేయకపోడమే. అందులోనూ పేకాటలో ఉన్న సమయంలో అతనికి తక్కిన ప్రపంచమే స్మృతిదూర మవుతుంది. స్నేహితులు ఎగతాళికి వేసే ప్రశ్నలకు సయితమూ సరియయిన సమాధానాలనే యిస్తూ, మధ్యమధ్యను వారిని ఆట మరిచిపోవద్దని హెచ్చరిస్తూఉండేవాడు. ఎవడేనా మిత్రుడు "ఒరేయ్! ప్రకాశ్! మొన్న నీ కిస్తామన్న పిల్ల నచ్చకపోడం మాయింట్లో ఎవరికి? నీకా మాపిన్నికా" అని అడిగినప్పుడు ప్రకాశం "అసలు నే నాపిల్లని చూడనే లేదు. మాపిన్నే చూసిందట. ఏదో జబ్బుకూడా ఉన్నట్టనుమానమట. ఊఁ, నరసింహం! నీదీ చేతివరస — ఏమిటి ? ఒకటేనా—"

* * *

సుందరి కొంతకాలం మేనమామగారింట ఉండి వస్తానన్నప్పుడు ప్రకాశానికి ఎంతమాత్రమూ యిష్టం లేదుగాని ఆమెను ఆమెనిశ్చయంనుండీ వేరుపరచడానికి తగిన స్థైర్యమూ, శక్తీకూడా తనలో లేవని తెలియడంచేత మాట్లాడకుండా ఆమెను స్టేషనువరకూ దిగబెట్టి ఇంటికి వచ్చేడు.

ఏదైనా వస్తువును పోగొట్టుకున్న కుఱ్ఱవాడు ఆవస్తువు అక్కడ ఉండదని తెలిసినా వెతికినచోటే మళ్లీమళ్లీ వెతుకుతాడు. ప్రకాశానికి పెట్టెలో మరి డబ్బు లేదని తెలిసికూడా మరొక్క మారు వెతకాలని బుద్ధిపుట్టింది. కొంచెం చిల్లర తప్పిస్తే మరేమీ కనిపించలేదు. తిరిగి వేసేముందు చిల్లరడబ్బుల ప్రక్కనే ఉన్న పాతకాగితం ఒకటి అతని దృష్టిని ఆకర్షించింది. సామాన్యంగా ప్రకాశాని కిలాటివి చూడడమభ్యాసము లేదుగాని ఆనాడు చేతులో పనేమీ లేకపోడంచేత విప్పిచూడాలనిపించింది. అందులో—

"ప్రకాశం! నే నిక్కడ ఉండడం లౌకికదృష్టిలో కొంతవరకూ నీ శ్రేయోభివృద్ధికి భంగకారిగా ఉన్నట్టే ఉంది. నీ అవివాహితస్థితిలో నా వునికి నిష్కారణంగా అనేకదుష్ప్రవాదాలకు ఆధారభూతమవుతున్నట్లు యిటీవల నాకు చూచాయగా తెలియడమే నా యీ ప్రయాణానికి కారణం. నా మంచిచెడ్డలనుగురించి ఆలోచించి, పరితపించే పరిస్థితిని నేను చాలాకాలం క్రిందటే దాటిపోయేను. గాని నా

మూలంగా నీకు అన్యాయం జరగడం నేను సహించలేను.

—రాముని నీవద్దనే ఉంచిపోతున్నాను. వాడిని అవకాశం ఉన్నంతవరకూ చదివించు. వాడిపట్ల నాకు ఉన్నంత బాధ్యత నీకూ ఉంది.

—నీవు నీఉద్యోగం అయిననాటికి మిగిలిన సొమ్మంతా పేకాటలో పోగొట్టుకున్న సంగతి నేనీమధ్యనే గ్రహించాను. ఇంతకాలం ఊరుకోడం నాదే పొరబాటు. ప్రస్తుతం నానగలన్నీ విడిచిపోతున్నాను. వీటిలో నీపెళ్లిఖర్చులకు కావలసినంతమాత్రమే అమ్మి తక్కినవి నీవు చేసుకోబోయే పిల్లకు యథాతథంగా పెట్టు. (వీటిలో రాముకోసం ఏమీ మిగల్చనక్కరలేదు.) కాని మరొక సంగతి. పెళ్లిచేసుకొనేముందు అందమయిన, ఆరోగ్యమయిన పిల్లను స్వయంగా చూసి చేసుకో. కాస్త ఎదిగిన పిల్ల అయితే మీనాయనమ్మకు గృహకృత్యాల్లో చేదోడుగా ఉంటుంది.

—మంచిచెడ్డలు రెండూ సమానంగానే ఉన్న నేను నాగురించి మిమ్మల్ని విడిచిపెట్టి వెళ్ల లేదు. అనవసరంగా నాగురించి ఆందోళన పడవద్దు. మీనాయనమ్మగాని గ్రామస్థులుగాని నన్నేమన్నా సరే వివాదపడవనే నా ఆశా, నా ప్రార్థనాకూడా.

—నువ్వేమీ రాయనక్కరలేదు; రాయవలసి ఉంటే నేనే రాస్తాను. పిన్ని”

ప్రకాశానికి ఏంచేయాలో తోచలేదు. (కాని ఒట్టుపెట్టినట్లు ఆనాటినుండీ పేకాటకుమాత్రం పోలేదు.)

ఒక అర్నెల్లలో అతనికి పెళ్లిఅయి భార్య యింటికి రావడంతో కలిగిన ఆనందం సుబ్బమ్మగారికి ఒక వారంరోజులకంటే ఎక్కువగా నిలవలేదు. జానకిది (ప్రకాశంభార్య) ఒకరు అనవసరంగా అంటే పడి ఊరుకొనే స్వభావం కాదు. ప్రకాశం యింటికి వచ్చేసరికల్లా ప్రతిదినమూ వంటయింటినుంచి, పడం గదినుంచి సమానస్థాయిలో మూలుగులూ, ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ ఎన్నుకొనే నేరాలూ వినిపిస్తూఉండేవి. ప్రకాశానికి ఏమనాలో, ఏం చేయాలో తెలిసేదికాదు. ఒంటరిగా ఏటిగట్టున కూర్చొని ఎప్పటికేనా పిన్ని మళ్లీ వస్తుందనీ, అప్పుడీకంగాళీమీ ఉండవనీ మనసా విశ్వసించగలిగిన పరమ సత్యాన్ని అప్పుడప్పుడు రాముతోమాత్రం చెల్లడి చేస్తూ ఉండేవాడు. పిన్ని ఎవరితోనో లేచివెళ్లిపోయిందనీ, అతనికీ ఆమెకూ ఏమో వివాదం వచ్చి తాను వేరే ఆడపిల్లలకు చదువూ సంగీతమూ ట్యూషన్లు చెప్పుకుంటున్నదనీ, ఆమెవంటివాళ్లవల్లనే దేశం యిలా అథోగతిపాలయిందనీ వాళ్లూ వీళ్లూ అన్న మాటలు కేవలం యీర్ష్యాకల్పితాలుగామాత్రమే తనకు తోచినా ఇతరులను నమ్మించలేకపోయేదనే అతని మనోవ్యథ. అయితే అతని మనఃపరిస్థితిని సాదరభావంతో గుర్తించి అతని వుద్దేశాలను సావధానంగా విశ్వసించే వ్యక్తి యీఅనంతవిశ్వంలోకల్లా ఒక్క రాముమాత్రమే అని గ్రహించడానికి అతనికి అట్టేకాలం పట్టలేదు. అయితే పిన్నిగురించి మాట్లాడుతున్నంతసేపూ తమ యిద్దరి మధ్యా పదునిమిది దీర్ఘవత్సరాల భేదం ఉందన్న విషయమే అతని యోచనాపథంలోకి రాదు.

---

# కాలము మారినది!

**1754**






థామస్ మడ్జి అనువానిచే నిర్మింపబడిన ఈ ఆంకర్ ఎస్కేప్‌మెంటు మొట్టమొదటగా 19-వ శతాబ్దారంభమున గడియారముల కుపయోగింపబడినది.

**1944**

దాదాపు 200 సంవత్సరముల వెనుక మొదట నిర్మించిన ఆ ఎస్కేప్‌మెంటే నేడును గడియారములలో ఉపయోగింపబడుచున్నది. ఇక ఏ ఇతర సాధనములున్న ఈ ఒక్కదాని మీదనే సరియైనకాలము చూపుట మాధారపడియుంటుంది. 'వెస్టెండు' వాచీలు ఇట్టి ముఖ్యసాధనములన్నిటిని, ఇంకను నూతనముగా వచ్చిన అనేక మెరుగులను కలిగియుండును.



సెకండస్ స్క్వేర్

రోల్డుగోల్డు, 10 సం. ల రకము .... రు. 53



సెకండస్ ఆక్టగన్

రోల్డుగోల్డు, 10 సం.ల రకము .... రు. 53

సకాలమున రాకుండుటచే, ప్రకటించిన రకము లన్నియు సప్లయి చెయ్య సాధ్యపడకపోవచ్చును కాని మావద్ద సరకుండి నంతవరకు ఆర్డరులను సరఫరాచేయుటకు సర్వశక్తుల వినియోగించెదము.

వెస్టెండ్ వాచ్ కంపెనీ, బొంబాయి, కలకత్తా.

**WEST END WATCH Co.**

*Bombay & Calcutta*



# ఈ రెండింటిలో మీకేది కావాలి?



సుఖంలేని ప్రయాణమా?



లేక కట్టెలు,



బట్టలు,



ఆహారమా

రైళ్ళు యిప్పుడు తమశక్తిని మించి పనిచేస్తున్నాయి. అవి దేశమంతా ఆహారధాన్యాలను రవాణా చేస్తూ, సమంగా అన్ని ప్రాంతాలకూ పంపిణీ చేస్తూ, ఇటు ప్రయాణీకులకు యుద్ధానికి పూర్వము వున్న సౌకర్యాల నన్నింటిని సమకూర్చాలంటే రైళ్ళకు సాధ్యపడదు. ప్రజలు ఏదో ఒకటి సమకూరుతుంటే గాని, రెండూ కావాలంటే సాధ్యపడదు. వీటికి జీవితావసరము లైన తిండి, బట్ట, వస్తువులు మొదలైనవి ప్రయాణాలు చెయ్యడం కంటె ముఖ్యమైనవి. ఆహారధాన్యాలకు కొరతగావున్న ప్రాంతంలో మీరు ఎక్కడయినా వుండివుంటే, అన్నమో రామచంద్రా అనే అభాగ్యులు ధాన్యాదులను మోసుకు వెళ్ళే ఈ రైళ్ళకోసం ఎంత ఆతృతగా చూస్తూవుంటారో మీకు తెలిసేవుంటుంది.

అవును. ప్రయాణాలు అంతగా ముఖ్యమైనవి కావు. అందుచేత, ప్రయాణపు రైళ్ళస్థానే ఆహారధాన్యాలను మోసుకు వెళ్ళే రైళ్ళు వచ్చాయి. అందుచేతనే ఈ రోజులలో రైళ్ళలో జనం క్రిక్కిరిసి వుండి యిబ్బందిపడడానికి కారణం. కాబట్టి, రైళ్ళు తమ ముఖ్యమైన పనిని నెరవేర్చాలని మీరు కోరినట్లయితే, మీరు ఇళ్ళదగ్గరనే వుండిపోవాలి.

## ప్రయాణాలు తగ్గించండి

AAA 692. T. G.

# కర్ణ - కుంతీ సంవాదము*

= కీ. శే. శ్రీ రవీంద్రనాథటాగూరు

అనువాదకుడు:
శ్రీ బెజవాడ గోపాలరెడ్డి



కర్ణుడు

పుణ్యజాహ్నవీతీరమున సంధ్యాసవితృని మ్రొక్కుటయందు నిరతుడను, రాధాగర్భమున జన్మించినవాడను, అతిరథసూతుని పుత్రుడను. కర్ణుడను నేను. మాతా! చెప్పుము, నీ వెవ్వతెవు?

కుంతి

వత్సా! నీ జీవితప్రథమప్రభాతమున విశ్వముతోటి పరిచయము కలుగజేసినదానను నేనే. సకలలజ్జల విడనాడి, నేడు నా పరిచయము నీకు నివ్వవచ్చియున్నాను.

కర్ణుడు

దేవీ! సూర్యకరస్పర్శచే శైలతుషారమువలె, నీ నతనేత్రములనుండి ప్రసరించు కిరణములచే నా చిత్తము కరగిపోవుచున్నది. నీ కంఠస్వరము పూర్వజన్మములనుండి కొనితేబడిన అపూర్వవేదనను నా కర్ణముల కలుగజేయుచున్నట్లున్నది.

అపరిచితమగు మాతా! నాజననము ఏ రహస్యసూత్రములచే నీతోటి బంధింపబడియున్నదో నాకు తెలియజెప్పుము.

కుంతి

వత్సా! క్షణకాలము శాంతించుము. సూర్యభగవానుడు తొలుత అస్త్రాద్రిని చేరనిమ్ము. సంధ్యాతిమిరములు దట్టములై పరచుకొననిమ్ము.—వీరుడా, ఇదో చెప్పుచున్నాను. కుంతిని నేను.

కర్ణుడు

కుంతివా నీవు? అర్జునజననివా?

కుంతి

అవును, అర్జునజననినే, బిడ్డా! ఆ కారణమును మదినెంచి నన్ను ద్వేషింపకుము.

హస్తినానగరమున జరిగిన అస్త్రపరీక్షా దినము నేడును జ్ఞప్తియున్నది. నక్షత్రఖచితమగు పూర్వదిశాప్రాంతమున నవోదితుడగు అరుణునిమాడ్కి, తరుణకుమారుడవగు నీవు రంగస్థలమున మెల్లగ ప్రవేశించితివి.

తెరచాటున కూర్చుండియుండిన స్త్రీల మధ్య, తృప్తినొందని ప్రేమక్షుధ యనెడు సహస్రనాగములు పీడితవక్షమున నాట్యమాడుచుండ, ఏ అభాగ్యరాలు నోట మాటలేకయుండినది? ఎవరి నయనములు నీ సర్వాంగములపై ఆశిసచుంబనముల క్రుమ్మరించెను?

ఆమె అర్జునజననియే.

కృపాచార్యులు వచ్చి నవ్వుచు, నీ తండ్రిపేరు అడిగి, రాజకులమున జన్మించనివారికి అర్జునునితో యుద్ధముసల్పుటకు అధికారము లేదని చెప్పినపుడు, కందిన ముఖమును వంచి, మారుపలుకక, నిలువబడియుంటివి. ఆ నీ లజ్జాచ్ఛాయ ఎవరి వక్షమును అగ్నిసమతేజముతో దహించెను? ఎవరు ఆ అభాగ్యురాలు?

* 'విశ్వభారతి'చే ఆమోదింపబడిన అనువాదము.

ఆమె అర్జునజననియే.

అప్పుడే నిన్ను అంగరాజ్యాధిపతిగ అభిషేకించిన పుత్రదుర్యోధనుడు ధన్యుడు. అభిషేకజలములతోటి నా నేత్రద్వయము నుండి అశ్రువారిరాశి నీశిరము నుద్దేశించి పైకి పొంగి ప్రవహించెను.

ఇంతలో దారిచేసికొని, ఆనందవిహ్వలుడై సూతఅధిరథుడు రంగమధ్యమున ప్రవేశించెను. కుతూహలురగు ప్రజలు నాలుగు వైపులనుండి చూచుచుండ, రాజాలంకారములతోనే అభిషేకమున తడిసిన శిరమును అతని చరణముల చేర్చి, తండ్రికి తగు ఆదరాభిమానములతో సూతవృద్ధునికి ప్రణమిల్లితివి. పాండవుల స్నేహితు లందరును నిన్ను చూచి క్రూరహాస్యమున అపహసించుచుండిరి.

అప్పుడు అత్యంతగర్వమున వీరుడ వని యెంచి, యోధశ్రేష్ఠుడా! ఎవరు నిన్ను మానమున ఆశీర్వదించినది!

—నేను, ఆ అర్జునజననినే.

కర్ణుడు

దేవీ! ప్రణామములు. రాజమాతవు నీవు. ఒంటరిగ ఇచ్చటి కేల విచ్చేసితివి? ఇది రణభూమి. నేను కురుసేనాపతిని.

కుంతి

పుత్రా! భిక్ష యొకటి గలదు-విఫలనై నేను పోకూడదుసుమా!

కర్ణుడు

భిక్షయా, నావద్దనా! నా పౌరుషము, నా ధర్మము తప్ప ఏది ఆజ్ఞాపించినను నీ చరణములకు అర్పణకావించగలను.

కుంతి

నిన్ను తీసికొనిపోవుటకు వచ్చితిని.

కర్ణుడు

నన్నా? ఎచ్చటికి?

కుంతి

నీకై తపించుచున్న వక్షమునకు — మాతృక్రోడమునకు.

కర్ణుడు

పంచపుత్రులచే నీవు ధన్యురాలవు. అదృష్టురాలవు. నేను కులశీలరహితుడను; క్షుద్రనరపతిని. నాకెచ్చట స్థానమొసగెదవు?

కుంతి

అందరికన్న ఉన్నతస్థానమున, నాసకల పుత్రులముందు నిన్ను కూర్చుండ బెట్టెదను. నీవు జ్యేష్ఠపుత్రుడవు.

కర్ణుడు

ఏ అధికారమదమున నేను అచ్చో ప్రవేశింపగలను? సామ్రాజ్యసంపదనుండి వంచితులైనవారికి, మాతృప్రేమ ధనమున గూడ పూర్ణాంశమును దక్కనీయక, దాని నెటుల విభజింపగలనో చెప్పుము.

ద్యూతపణమున విక్రయింపబడునది, బాహుబలమున హరింపబడునది కాదుగదా మాతృహృదయము — అది విధాతృని పరమోత్కృష్టమగు ప్రసాదము.

కుంతి

బిడ్డా, ఒకనాడు విధాతృని అధికారమును గైకొనియే నా అంకమునకు నీవు చేరుకొంటివి. ఆ అధికారముననే సగౌరవముగ, నిర్విచారముగ తిరిగిరమ్ము. సకలభ్రాతల మధ్య నీ మాతృక్రోడమున నీ స్థానమును నీవు వహింపుము.

కర్ణుడు

స్వప్నమునవలె, దేవీ, నీ వాణిని నేను

వినుచున్నాను. అదో చూడుము, తిమిర పుంజములు దశదిశల వ్యాపించుచున్నవి. నల్గడల నున్న వస్తుజాలము అస్పష్టమై అదృశ్య మగుచున్నది. భాగీరథియు నిశ్శబ్ద ముగ ప్రవించుచున్నది.

ఏ మాయాచ్ఛన్నలోకమునకు, ఏ విస్మృతాలయమునకు, ఏ చేతనాప్రత్యూష మునకు కొనిపోవుచున్నావో తెలియకున్నది. పురాతనసత్యమువలె నీవాణి నాముగ్ధచిత్తము ను స్పర్శించుచున్నది.

నాజననిగర్భకోశపు అంధకారమో, లేక నా అస్ఫుటశైశవకాలమో నేడు నన్ను పరివేష్టించుచున్నట్లున్నది.

రాజమాతా! ఇది సత్యమగుగాక, స్వప్నమగుగాక.

ప్రేమంపుతల్లి, రమ్ము, నీదక్షిణహస్త మును నా లలాటముపై క్షణకాల ముం చుము.

నేను జననిచే పరిత్యక్తుడ నని లోకుల ముఖమున వినియుంటిని. నిశీథస్వప్నముల ఎన్నోసారులు నాతల్లి నన్ను చూచుటకు మెల్లమెల్లగ వచ్చుచుండుట చూచియుంటిని. "జననీ, నీ మేలిముసుగును సడలించుము, నీ ముఖబింబమును చూడనిమ్ము" అని శోక వ్యథచే విలపించుచు, నేను పలుకగనే, నా ఔత్సుక్యజనితమగు తీవ్రవాంఛను తీర్చకనే, స్వప్నభంగ మొనర్చి ఆమె అదృశ్య మయ్యె డిది.

ఆ స్వప్నమే నేడు పాండవజననీరూప మున, ఈసంధ్యాసమయమున, రణక్షేత్ర మునకు, భాగీరథీతీరమునకు వచ్చెనాయేమి?

చూడుము తల్లీ! ఆవలిగట్టున పాండవ శిబిరముల దీపకాంతి వెలుగుచున్నది. ఈవలి ఒడ్డున, సమీపమున కౌరవుల అశ్వశాలల యందు లక్షలకొలది గుఱ్ఱముల గిట్టల చప్పు డులు చెలరేగుచున్నవి. రేపటిప్రొద్దున నే మహాసమరము ప్రారంభము కానున్నది.

నేటిరాత్రి అర్జునజననీకంఠమున, నాతల్లి యొక్క ప్రేమపూరితమగు స్వరము యేల వింటిని? నా నామము ఆమెముఖమున యేల యిట్టి మధురసంగీతమునకు ఆస్పదమగు చున్నది? తటాలున నాచిత్తము యేల పంచ పాండవులవైపు సోదరభావమున పర్విడు చున్నది?

కుంతి

వత్సా, అటులైన రమ్ము. నాతోటి రమ్ము.

కర్ణుడు

మాతా, అటులనే వచ్చెదను. నేనేమి యు ప్రశ్నింపను. ఎట్టి సంశయమును, ఎట్టి భావనయు చేయకనే వచ్చెదను. దేవీ, నీవు నామాతవు. నీ ఆహ్వానమున నా అంత రాత్మ మేల్కొనినది. రణభేరి, జయశంఖా నినాదములు నాచెవులకు సోకుట లేదు. సమరహింసలు, వీరకీర్తులు, జయపరాజయ ములు అన్నియు మిథ్యలుగ తోచ్పించు చున్నవి. ఎచ్చటికి పోవలయునో తీసికొని పొమ్ము.

కుంతి

ఆవలిగట్టునకు, అదో దీపములు వెలు గుచున్న స్థలమునకు, తెల్లని యిసుకతిన్నెల పై అమర్చబడియున్న విడిదిప్రదేశమునకు వెడలెదము.

కర్ణుడు

అహో, తల్లిని పోగొట్టుకొన్నతను తల్లిని శాశ్వతముగ పొందగలుగునా? అచ్చట సుందరములును, విశాలములునైన నీనయనములయందు ధ్రువతార సదా ప్రకాశించుచుండునా?

దేవీ, నేను నీ పుత్రుడ నని మరల నొకసారి పలికి వినిపింపుము.

కుంతి

హా, నా కుమారా!

కర్ణుడు

అటులగుచో, ఏల నీవు నన్ను దూరముగ అగౌరవమున త్రోసివైచితివి? కులశీలమానములనుండి నన్ను కడచేసి, మాతృనేత్ర సంపదను నాకు దక్కనీయక ఏల ఈ అపరిచిత అంధప్రపంచమునకు నన్ను దాన మొనగితివి? అలక్ష్యంపు ప్రవాహమున నన్ను తేల్చి, సోదరప్రేమ రాజ్యమునుండి చిరనిర్వాసనదండన నాకేల విధించితివి? అర్జునుని, నన్ను వేరుచేసియుంచినందుననే బాల్యకాలమునుండియు నిగూఢ అదృశ్య పాశములు రణసంహారమునై పులకు ఆపరాని ఆకర్షణతో మమ్ముల నిద్దరిని లాగుచున్నవి.

తల్లీ! నా ప్రశ్నలకు ప్రత్యుత్తరము లేదా? నీలజ్జ తిమిరరాసుల చీల్చుకొనివచ్చి, నా సర్వాంగములను నిశ్శబ్దముగ నంటుచున్నది—కన్నుల మూయుచున్నది.

సరి, సరి, నన్నేల విడనాడితివో చెప్పకపోయిన పోమెదవుగాక. ఈప్రపంచమున పరమేశ్వరుని ప్రథమదానము మాతృప్రేమ గదా! నీకొమారుని దగునట్టి విధిదత్తమగు ధనమును నీ వేల హరించితివో, దాని సమాధానమును నీవు యియ్యనక్కరలేదు.

కాని, నేడు నీ అంకమునకు నన్నేల మరల్పనెంచి వచ్చితివో నాకు తెలియపరుచుము.

కుంతి

హా, వత్సా! నీదూషణ శతవజ్రాయుధనముగ నాహృదయమును సహస్రఖండములుగ బ్రద్దలు చేయనిమ్ము. నిన్ను వదలిపెట్టినందున కలిగిన శాపముచే పంచపుత్రుల పక్షమున వహించియు, పుత్రహీనమైనటులనే చిత్తము సదా క్షోభిల్లుచు, నాహస్తములు నీకొరకై వెతకులాడుచు ప్రపంచమంతయు త్రిమ్మరుచుందును.

ఏపుత్రుని నేను వంచించితినో, అతనికై నా హృదయము నిష్కపటదీపమును వెలిగించి, దాని పోషణార్థమై తన్ను దగ్ధమొనర్చుకొని, విశ్వదేవతకు నారతి నొసగుచున్నది.

నేను నిన్ను చూడగలుగుటచే భాగ్యవతిని. నీనోట ఒక పలుకైనను చిగిర్పనికాలమున, నీకు కఠోర అపరాధము నొనర్చితిని; బిడ్డా, ఆనోటితోనే నీ దుష్టమాతను క్షమింపుము. ఆ నీ ఉదారక్షమాపణయే నీ దూషణలకన్న అధిక తేజమున అనలమును నావక్షమున వెలిగింపగలదు; నాపాపముల దగ్ధమొనర్చి నన్ను నిర్మలము గావింపగలదు.

కర్ణుడు

తల్లీ, నీపదధూళిని ప్రసాదింపుము. నా అశ్రువారిని అనుగ్రహింపుము.

కుంతి

నిన్ను తిరిగి నావక్షమునకు చేర్చుకొనవలెననెడి సుఖప్రదమైన ఆశతోనే నేను

నీకడకు రాలేదు. నీన్వంత అధికారమునకు నిన్ను మరల్చి కైకొనిపోవుటకే వచ్చితిని. సూతపుత్రుడవు కావు నీవు; నీవు రాజకుమారుడవు.

వత్సా, సర్వావమానముల దూరమొనర్చి, నీ పంచభ్రాత లున్నచోటికి రమ్ము.

కర్ణుడు

దేవీ, నేను సూతపుత్త్రుడనే. రాధ నా తల్లి. దానికన్న అధికగౌరవము నా కేమి కావలయును? పాండవులు పాండవులుగనే, కౌరవులు కౌరవులుగనే ఉండనిమ్ము. నేను ఎవ్వరిని ద్వేషించుట లేదు.

కుంతి

నిజబాహుబలమున రాజ్యము నుద్ధరించి తీసికొనుము. వత్సా, యుధిష్ఠిరుడు ధవళవ్యజనమును వీవగలడు. భీముడు ఛత్రమును వహింపగలడు. వీరధనంజయుడు నీ రథసారథి కాగలడు. ధౌమ్యపురోహితుడు వేదమంత్రముల పఠింపగలడు. నీవు శత్రుజేతవై అఖండ ప్రతాపమున ఎదురు లేని రాజ్యమున రత్నసింహాసనమున రాజిల్లగలవు.

కర్ణుడు

సింహాసనమా! మాతృప్రేమపాశముల నొల్లక పెడమొగము పెట్టినతనికి, తల్లీ, రాజ్యాశ్వాసముల నొసగుచున్నావే! ఒకనాడు ఏసంపదను పొందనీక అడ్డగించితివో దానిని మరల్చిఇచ్చుటకు నీకు సాధ్యమగు కార్యము కాదు.

మాతా, నాజన్మక్షణముననే నాజనని నుండి, నాసోదరులనుండి, నా రాచకులము నుండి గెంటివైచి, ఒక్క ముహూర్తమున నిర్మూలమొనర్చితివే! సూతమాతను మోసగించి, రాజమాతను తల్లియని, దుర్యోధనునితో బద్ధుడనై యున్న బంధనములను ఛిన్నమొనర్చి రాజసింహాసనమువైపు నేను నేను పరుగులిడిన-ఛీ, ఛీ! అది ఎంతటి నీచకార్యమగును!

కుంతి

కుమారా, వీరుడవు, ధన్యుడవు నీవు. అల్పమును, అసహాయమునైన శిశువును జన్మమాత్రమున నేను వదలివేసినదినము, ఆశిశువు బలపరాక్రమముల గడించి, ఎచ్చటినుండియో అంధకారపథమున మరలివచ్చి ఒకదినము నిజజననియొక్క అనుంగుబిడ్డలను మమతారహితములగు తన కరములతో అస్త్రశస్త్రముల సంహరింప ఉద్యుక్తమగునని ఎవరు తలంచిరి?

అయ్యో, ఎట్టి భీషణశాప మిది? విధీ, ఎట్టి కఠోరదండన నీది?

కర్ణుడు

తల్లీ, భయపడకుము. పాండవులకే విజయము చేకూరగలదని వక్కాణించుచున్నాను. నేటి ఈ రజనీతిమిరఫలకమున, నక్షత్రదీప్తియందు ఘోరయుద్ధఫలమును నేను ప్రత్యక్షముగ పఠింపగలుగుచున్నాను.

ఈ శాంత స్తబ్ధక్షణమున, అనంతఆకాశమునుండి విశ్వాసశూన్యమగు పరమవ్యర్థతయందు,జయహీనయత్నపు సంగీతము లీనమై వచ్చి నామనమున ప్రవేశించుచున్నది.

ఆశారహితకర్మముయొక్క ఆయత్తమును, దాని ననుసరించియున్న శాంతిమయశూన్యపరిణామమును నేను కాంచుచున్నాను.

పరాజయము కాబోవు పక్షమును వదలి రమ్మని నన్ను ఆహ్వానించకుము. పాండుపుత్త్రులు జయమొంది, రాజ్యాభిషిక్తులయ్యెదరుగాక. నేను నిష్ఫలుల, హతాశుల దళముననే యుండెదను.

జన్మదినమున పేరుపెట్టక, ఇల్లుచేర్చక నన్ను నీటిపై నెట్టివేతివి. నేడును అదేరీతి కాంతినడగిన, కీర్తితరిగిన పరాభవప్రవాహమున మమతనెరుగని చిత్తముతో నన్ను వదలివెళ్లుము.

జయలోభమున, యశోలోభమున, రాజ్యలోభమున వీరుల సద్గతినుండి భ్రష్టుడను కాకుందునటుల నన్ను ఆశీర్వదించి మాత్రము పొమ్ము, తల్లీ !

నాత్ఫ్రై 'కాహిని' నుండి [ఫిబ్రవరి, ౧౯౦౦]





# వసంతకోకిల

= శ్రీ మోషేకవి =

౧

కలఁగకుమీ, పికంబ! తొలికారుపొలంతుక పండుటాకు వ
ల్వాల సడలించియున్ దినములన్ జడిమంచునఁ దానమాడి అ
గ్గలపుఁ జివుళ్ళ పుట్టమును గట్టియు నీకుతిఁ దీర్చుఁగాన, కన్
గులుకులు, కూనరాగములకున్ జరతాళుమ, వేళఁ గాచియున్.

౨

కాకి మారుదల్లి కాన నీ కంఠనా - దంబు నోర్వలేక తన్నుచుండె
జలదరింపుతో వసంతలక్ష్మియుఁ గారు-టాకు మేన మొండె మై తనర్చె.

౩

వాసనలంటి మోసికొనువాని సిఫారసుమీఁద తమ్మి సా
వాసపుకాఁ డొగిన్ వడతుపానుల నామని మీఁదఁ జిమ్మి స
న్యాసిని జేసివైచుననియా తలపోతువు? ముందు పల్లవ
గ్రాసము నీకునున్ గలవు గాదుకదా పికమా! క్షమించుమా!

౪

ఋతుపరివర్తనక్రమ మెఱింగియు నామని వచ్చువేళకున్
గుతుక మెలర్చి, డొక్క-సొదకున్ దపియింతువు; నీస్వరానకున్

శ్రుతులను బాదుకొల్పి చిగురుంజెలి కుంకుమ రంగరించు ; సు
న్నితము నలంకరించుకొననీ; భుజియింతువు, తొందరేటికిన్ ?

౫

నవనవలాడు మొగ్గలను నంజినపై లయగొన్న నీ గళా
రవము రవంతయుం బడయరాని వరానఁ దపించుచున్న మా
నవుఁడు; న దే, వరం బమరెనా ? నలినప్రభవప్రసాద గౌ
రవమని నీ మెడన్ రవసరంబు బిరాన నలంకరించెదన్ .

౬

కంచుకంఠంబు వాయించుచు నిగురాకుకూటికి జోగిత్తుకొందు వీవు
కొమ్మల సిగఁ బట్టుకొని యాచి గంధంబు దోపిడిసేయు దుండుముకు గాలి
మధువు త్రాగుడు పిచ్చి మైకాన ఝుంకారమృదుగీతిఁ బాడు తుమ్మెదమగండు
నాముక్కుచాయఁ గొన్నావ పంజా యని మధురవాక్కులఁ దిన మరగెఁ జిలుక
చాలినది మంచి గుణవంతురాలు గాన-మీ రొనర్చెడు పనుల నోర్మి క్షమించి
యుదరమును జీల్చి పెంచుచున్నది పికంబు! - పాడుకొమ్ము వసంతమ్ముపైఁ బదంబు.



# ‘వాకిటికావలి’ తిమ్మన

## కృష్ణదేవరాయలవారి సన్నిహితభృత్యులు

= శ్రీ దిగవల్లి వేంకటశివరావు =

"ప్రాకృత సంస్కృత ఘూర్జర
మూకీకృత కుకవికుంగ ముస్తాతతికిన్,
వాకిటి కావలి తిమ్మన
వాకిటకవికోటిమాధవాకిటికోలే !"

అని ఒక చాటుపద్యమున్నూ, దీనిని గురించిన ఒక గాథయున్నూ మన తెలుగుదేశంలో చిరకాలం నుంచి ప్రచారంలో వున్నవి.

శ్రీ కృష్ణదేవరాయలవారి అనుగ్రహానికి పాత్రుడైన ఒక భట్టు రాయలవారి ఆస్థానంలోని అష్టదిగ్గజాలనే కవులమీద యీర్ష్య వహించి వారి నెలాగనైనా అవమానించాలని ఒక కుట్ర పన్నాడు. ఒక్క రోజున తాను చెప్పినట్లు చేస్తానని రాయలవారిచేత వాగ్దానం చేయించుకొని, ఆ మరునాడు రాజసభలో అందరూ కూర్చుని వుండగా తాను లేచి కొందరు కవుల పేర్లను చదివి "వీరు రాయలవారి సెలవు అయ్యే వరకూ రాజసభలోనికి రాకూడదని రాయలవారి యాజ్ఞయైన" దని ప్రకటించాడు. ఈ విపరీతపు ప్రకటనను విని అక్కడివా రందరూ ఒకరి మొగము లొకరు చూచుకొని తెల్లబోయారు. రాయలవారున్నూ ఏమి జరుగుతుందో తమాషా చూద్దామని గంభీరంగా ఉన్నారు. అలాగ సభలోకి రాకూడ దని నిషేధింపబడినవారిలో అల్లసాని పెద్దన మొదలైన హేమాహేమీ లంతా వున్నారు. భట్టు ఇలాగ అన్నతరువాత వీరు రాయలవారి వైపునకు చూశారు గాని వారి ముఖంలో ప్రసన్న భావం కనుపించనందువల్ల చేయునది యేమీ లేక రాయలవారు సభ చాలించిన తరువాత ఖిన్నులై బయటికి వెళ్లి, భట్టు ఏదో కుట్ర పన్ని ఇలాగ తమ్ము పరాభవించినాడని ఊహించి, దీనిని గురించి విచారించి తరువాత చేయవలసిన కర్తవ్యాన్ని గురించి ఆలోచించుకోవడానికని వీరు వాకిటికావలి తిమ్మన్న యనే రాయలవారి ఆంతరంగిక భృత్యుని యింటి ముందర చేరి అక్కడ కూర్చుని ఏదో ఆలోచిస్తూ వున్నారు. ఆ సమయానికే వీరిని అవమానించిన భట్టు అందలం ఎక్కి ఆ దారిని వస్తూ వీరిని చూచి "ఈ తిమ్మన్న వాకిట గుమిగూడిన వీ రొక పందుల సమూహములాగ నున్నారు చూశావా" అని తన సేవకుడైన మాధవుని సంబోధిస్తూ పైన చెప్పిన చాటుపద్యములోని ఉత్తరభాగమును చదివాడు. ఈ ఎద్దేవమాట వినేటప్పటికి అక్కడ నున్నవారికి పట్టలేనంత రోషం వచ్చింది. ఈ నీచునికి తగినట్టుగా బుద్ధి చెప్పాలని పెద్దన్నగా రా పద్యంయొక్క పూర్వభాగాన్ని పైన చెప్పినలాగ భావగర్భితంగా పూరించి జవాబు చెప్పారు. విద్వత్కవుల సంస్కృత ప్రాకృతములను అర్థము చేసికొనలేక మూకులు ఈ భట్టువంటి కుకవులు పందుల కాహారముగా నుండే తుంగగడ్డలవంటివా రనిన్నీ, అలాంటివారికి కవిబృందము తుంగలకుంపుగా కనబడటంలో ఆశ్చర్యం లేదనిన్నీ దాని భావం. మేము నీవంటి అల్పులను మ్రింగగల వరాహములము సుమీ యని ధ్వని. భట్టు ఇదివిని తలవంచుకొని వెళ్లిపోయి, మర్నాడు రాయలవారితో జరిగిన సంగతి చెప్పగా "నీవు జరిగించిన అపచారానికి తగిన పరాభవం జరిగిం" దని అతనిని మందలించి పెద్దనాదికవులను మళ్లీ సభకు రావించి గారవించారట. ఈ గాథను పెద్దనకవి జీవిత చరిత్రలో వుదాహరిస్తూ శ్రీ గురజాడ శ్రీరామమూర్తి గారు ఆపద్యంలో వాకిటి కావలి తిమ్మన యని పేర్కొనబడినయతడు ముక్కు తిమ్మన యని పొరబాటుగా వ్రాశారు. అయితే వారే తెనాలి రామకృష్ణకవి జీవి

తంలో ఈ తిమ్మన్నను గురించిన ఇంకొక చాటుపద్యాన్ని ఉదాహరించి దాని గాథను వ్రాస్తూ అతడు కృష్ణదేవరాయలవారి వాకిటి కావలిగా నుండిన తిమ్మన్న యనే దండనాయకుడని సరిగానే వ్రాశారు. ఆ రెండవ గాథ యిది: ఒక మాటు కృష్ణరాయలవారు తమ వాకిటి కావలిగా నుండే తిమ్మన్న యనే దండనాధుడి శౌర్య విశేషానికి సంతోషించి అతని కొక అమూల్యమైన పచ్చడము ( నేలువు ) ను బహుమతి యిచ్చారట. అత డా పచ్చడము బుజాన వేసుకుని తన యింటికి వచ్చి అరుగుమీద కూర్చుని వుండగా అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన, భట్టుమూర్తి, తెనాలి రామలింగకవి ఆదారినిపోతూ తిమ్మన్నగారిని చూసి ఆయనను అభినందిస్తూ నలుగురూ కలిసి ఒక కంద పద్యంలో నాలుగు పాదాలు వరసగా ఇలాగ పూర్తి చేశారట:

"వాకిటి కావలి తిమ్మా (అల్లసాని పెద్దన)
ప్రాకటముగ సుకవివరుల పాలిటి సొమ్మా (ముక్కు తిమ్మన)
నీకీ పద్దెమె కొమ్మా (భట్టుమూర్తి)
వా కా పచ్చడమె చాలు నయముగ నిమ్మా—
(తెనాలి రామలింగ కవి )"

అంతట పద్యంచివర భావప్రకటనను చేసిన రామలింగకవికి తిమ్మన్నగారు తన పచ్చడం యిచ్చివేసి తక్కినవారికి ఇతరబహుమానము లిచ్చి పంపించినాడట.

— తిమ్మన్న చరిత్రకు ఆధారాలు —

ఈ రెండు గాథలూ సమన్వయం చేసి చూస్తే ఈపద్యాలలో చెప్పబడిన వాకిటికావలి తిమ్మన్న యనే యతడు సామాన్యుడైన కాపలావానివంటి ద్వారపాలకుడు కాడనిన్నీ, రాయలవారిదగ్గర గొప్ప అధికారమూ, పలుకుబడీ కలిగిన వుద్యోగి యనిన్నీ, విద్యావంతుడు రసికుడు అనిన్నీ ఊహించడానికి సావకాశం కనపడుతూవుంది. ఈ తిమ్మన్ననుగూర్చిన విశేషాలను తెలుపగల చరిత్రాధారాలేమైనా వున్నవేమో చూద్దాము.

తిరుపతి దేవస్థానం విచారణకర్తలైన శ్రీ మహంతు ప్రయాగదాసువారు తిరుపతిక్షేత్రంలో రాజాధిరాజులూ, శ్రీమంతులూ చెక్కించిన శిలాశాసనాలయొక్క విలువను గ్రహించి వాటిని ప్రకటించడానికి నిశ్చయించి వాటిని గురించి ఒక నివేదికను తయారుచేయడానికి బ్రహ్మశ్రీ సాధు సుబ్రహ్మణ్యం బి. ఏ. గారిని నియోగించారు. శాసనసంపుటాలతోపాటు వారి నివేదికకూడా ఒక పెద్ద గ్రంథముగా ౧౯౩౦ లో అచ్చువేయించారు. దీనివల్ల పల్లవులు, చోళులు మొదలైన రాజుల కాలంనాటినుంచి విజయనగరసామ్రాజ్యము నేలిన చక్రవర్తులవరకూ గల చరిత్రాంశాలు, విశేషాలు తెలుస్తున్నవి. అందులో తిమ్మన్నచరిత్రకూడా వున్నది.

— "అవసరం" తిమ్మయ్య —

తిరుపతి దేవస్థానంలోవున్న శాసనాలవల్ల కృష్ణదేవరాయలవారి కొలువులో 'అవసరం తిమ్మయ్య' యనే దండనాయకు డొకడు రాయలవారి 'వాకిటికావలి' ద్వారపాలకుల పై యధికారియై యున్నట్లున్నూ, అతడు వేయిమంది సైనికుల కధికారి యనిన్నీ, చిన్న సంస్థానము నేలే సామంతమండలేశ్వరు డనిన్నీ, అతనిని అమరం తిమ్మరసయ్య, తిమ్మప్ప నాయకుడు అనికూడా పిలిచేవారనిన్నీ, ఆయనకు రాయలవారిదగ్గర చాలా చనవు వున్నట్లున్నూ, చాలా మందికి ఆయన రాయలవారి దర్శనం చేయించి అనేక సందర్భాలలో చాలా ఉపకారాలు చేసినట్లున్నూ తెలుస్తున్నది. తిరుపతిలో వున్న దానశాసనాలలో "అవసరం" నరసయ్య, తిమ్మయ్య, నరసయ్య యనే ముగ్గురు అన్నదమ్ముల పేర్లున్నూ, వారితల్లి బసవమ్మగారి పేరున్నూకూడా కనపడుతూవున్నవి. శా. శ. ౧౪౩౪ కు సరియైన ఆంగీరసనామ సంవత్సరం (క్రీ. శ. ౭-౮-౧౫౧౨) నాటి శాసనంలో ఈ కుటుంబంవారికి తిరువెంగళనాధుడు ఇలువేల్పు అయినట్లున్నూ, అవసరం నరసయ్య తిమ్మయ్యగార్లు "రాయర బాగిల అవసరద"- అనగా కృష్ణదేవరాయలవారి తలుపులదగ్గర వుండే ద్వారపాలకులైనట్లున్నూ వివరింపబడింది. ఈ

అన్నదమ్ములలో తిమ్మయ్యయే మన 'వాకిటికావలి' తిమ్మన యని నిస్సందేహంగా చెప్పవచ్చును.

## —"లార్డు చేంబర్లేన్" వంటి రాజసేవకుడు—

ద్వారపాలకుడంటే మన 'గేటుకీపరు' వంటి జవాను అనుకోకూడదు. రాయలవారి దర్శనంనిమిత్తం పోవలసినవారందరూ ఆయనఅనుజ్ఞ పొందాలి. అతడు రాయలవారికి మనవిచేసి దర్శన మిప్పిస్తాడు. అందువల్ల ఆయనకు దివాణంలో గొప్ప అధికారము, పలుకుబడీ వుంటాయి. ఇలాగే చక్రవర్తిగారికి ఇతర విధాలైన సేవలు చేసే గొప్ప ప్రభువులు, దండనాయకులు అనేకు లుండినట్లు శాసనాలవల్ల కనబడుతూ వుంది. రాయలవారి సన్నిహితభృత్యులలో కొందరు గొప్ప వంశాలలో జన్మించినవారు కొందరు రాజబంధువులుగా వుండేవారు. వారిలో కొందరు మహామండలేశ్వరులుకూడా వున్నారు. శా. శ. ౧౪౮౧ ప్రమాదినామ సంవత్సరం (క్రీ. శ. ౧౫౫౯-౬౦)నాటి శాసనంలో పేర్కొనబడిన కృష్ణదేవరాయలవారి ద్వారపాలకుడైన 'తిమ్మభూపతి' యీ వాకిటి కావలి తిమ్మన్నగారే. ఈ శాసనంలో 'భూప' అనే పదము వాడినందువల్ల ఇతడు కొంత రాజ్యభాగమును పరిపాలించే సామంతమండలేశ్వరు డని తెలుస్తున్నది. ఈ శాసనంలో మధుర జిల్లాలో అన్నామల పేర్కొనబడినందువల్ల అతని రాజ్యభాగం ఆప్రాంతాలలో వుండివుండాలి.

మన దేశాన్ని పూర్వం ఏలిన చక్రవర్తులదగ్గర నుండే రాజసేవకుల లాగనే ఇంగ్లీషు రాజుగారి దగ్గర నుండే సన్నిహిత భృత్యులుకూడా సత్కులసంజాతులైన ప్రభువులుగానే వుంటూవున్న సంగతి ఇంగ్లీషు రాజ్యాంగచరిత్రను చదివినవారందరికీ తెలుసును. ఇలాంటి రాజసేవకులలో 'లార్డుచేంబర్లేన్' అనే హోదా గల ప్రభువుఅధికారమునుబట్టీ, గౌరవమునుబట్టీ, పలుకుబడినిబట్టీ చాలా గొప్పవాడు. ఇతడు ఒకముఖ్యమైన ప్రభువుగావుంటాడు ప్రీవీకవున్సిల్ అనే రాజుగారి ఆంతరంగిక కార్యాలోచనసభలో సభ్యుడుగా వుంటాడు. రాజుగారి కుటుంబములో తటస్థించే శుభాశుభాల కన్నింటికీ ఇతడు తగిన ఏర్పాట్లు చేస్తాడు. రాజుగారి దర్శనము చేయదలచినవారందరూ ఇతనిని ఆశ్రయించాలి. రాజుగారి దర్శనము చేయతగినవా రని తనకు తోచినవారి కతడు ఆహ్వానాలు పంపి దర్శనం చేయిస్తాడు. ఎల్లప్పుడూ రాజుగారి ప్రక్కనే నిలిచియుంటాడు. రాజుగారు రాజభవనంలోనుంచి బయటికి వెళ్ళునప్పుడు బండిదగ్గరదాకా సాగనంపుతాడు. మళ్లీ వచ్చినప్పుడు బండిదగ్గరనుంచి లోపలిదాకా మార్గం చూపుతూ తీసుకునివస్తాడు. రాజదర్శనంకోసం వచ్చినవారిని రాజుగారికి ఎరుకపరుస్తాడు. రాజుగారి ఆలోచనమందిరము, శయనమందిరము ఈ చేంబర్లేన్ గారి తనిఖీకిందనే వుంటాయి ఈయనకింద వైస్‌చేంబర్లేన్ అనే సహోద్యోగియొకడు వుంటాడు. ఇతనికింద మాస్టర్, మార్షల్ ఆఫ్ సెరిమొనీస్ మొదలైన ఇతర రాజసేవకులు పనిచేస్తారు. రాజుగారికి సాలుపొడుగునా సేవచేయడానికి Lords and grooms in waiting అనే హోదాగల ఆరుగురు ప్రభువులను నియమిస్తారు. వారొక్కొక్కరు పదిహేనురోజులుగాని, ౨౧ రోజులుగాని వంతులవొప్పున రాజసేవ చేస్తారు. ఇంకా ఇలాంటి సన్నిహితభృత్యులు, గౌరవహోదాలవారు చాలామంది వున్నారు. ఇంగ్లీషు రాణీగారి అంతఃపురముకూడా లార్డుచేంబర్లేన్ గారి అధికారంకిందనే వుంటుంది. రాణీగారి సేవకోసం ఇంగ్లాండుదేశంలో చాలా గొప్ప వంశాలలో జన్మించిన ప్రభువుల భార్యలు, వారి కొమార్తెలు, కోడళ్లు, మనుమరాండ్రు Ladies of the bed chamber, Women of the bed-chamber, Maids of honour అనే హోదాలతో నియమింపబడతారు. వీరు మన దేశములో పూర్వము రాణులకు చెలికత్తెలు, పరిచారికలు మొదలైనవారు చేసే సేవలే చేస్తారు. అందువల్ల మన వాకిటికావలితిమ్మనగారు లార్డుచేంబర్లేన్ వంటి గొప్ప రాజోద్యోగి అనడానికి సందేహంలేదు

## — అమరం తిమ్మరసయ్య —

సేలంజిల్లా అరగలూరు గ్రామదేవాలయం యొక్క దేవాదాయాన్ని వసూలుచేసి గుడిపనులు జరిగించే స్థానికు లనే గుడిపారుపత్తెగాళ్లు ముగ్గురికి కొన్ని యిబ్బందులు కలిగి వాటినిగురించి కృష్ణదేవ

రాయలవారికి స్వయంగా చెప్పుకుందామని వారు రాజధానీనగరమైన విద్యానగరానికి వెళ్లారు. అక్కడ రాయలవారి ద్వారమువద్ద నుండే ప్రధానోద్యోగియైన అమరం తిమ్మరసయ్యగారు వీరిని రాయలవారిదగ్గరకి తీసికొనివెళ్లి దర్శనం చేయించి వారి యిబ్బందులను తొలగింపజేయడమేగాక వారి కొక హారము, తల పాగ, సుట్టము, నోడుగున్నూ బహుమతిచేయించారట. ఈసంగతి శా. శ. వర్షములు ౧౪౪౧ సరియైన ప్రమాది. సంవత్సర (క్రీ. శ. ౧౦-౬-౧౫౧౯) నాటి శాసనంలో ఉదాహరింపబడివున్నది.

ఈ 'అమరం' తిమ్మరసయ్యగారు మన వాకిటి కావలితిమ్మన్నగారే యనడానికి సందేహం లేదు. 'అమర' మనగా పాళెపట్టుదొరల కియ్యబడు కొలది సీమ యని శబ్దరత్నాకరకారులు అర్థం చెప్పి కుమార ధూర్జటివిరచితమైన కృష్ణరాజవిజయంలోని ఈ కింది పద్యాన్ని వుదాహరించారు:

"భటులు వేయిటి కెన్న నిర్వదియు నాల్గు
వేలుగా లక్షయిర్వదివేల్ప్రజకుఁ
జెల్లు నల్వదిలక్షలు జీత మనఘ
యమర మేలెడు దొరల కీక్రమమె సుమ్మి"

ఈ పద్యంవల్ల 'అమరం' అనేది కొంత జీతము, బత్తెము, సైనికబలము, జమీను గల ఒక గొప్ప హోదా అని రూఢి అవుతూవుంది. 'అమరం' అనే పదము అమరనాయకర మనేదాని రూపాంతరము. విజయ నగరసామ్రాజ్యంలోని వివిధప్రాంతాలలో గల కోట లకు అధ్యక్షులై దేశాన్ని పరిపాలించేప్రభువులను అమర నాయకు లనేవారు. వీరు రాజోద్యోగులై, దండనాయకు లై, దేశపరిపాలకులైన నాయకులు. రాజకీయోద్యోగులలో దొరలు, పారుపత్యగార్లు, రాయసంవారు, అవసరం వారు, రాచకరణాలు అనే వివిధహోదాలవారు కన బడుతున్నారు. వీరు చేసే వుద్యోగాలయొక్క వివ రాలు స్పష్టంగా తెలియకపోయినా వీరు ప్రభుత్వో ద్యోగం చేసే రాజసేవకు లనిన్నీ, వీరికి జీతబత్తెములు, రాజమర్యాదలు, గ్రామాలు, జమీనులు వుండేవనీ తెలుస్తూంది. రాయలవారు యుద్ధానికి తర్లి వెడుతూ వున్నప్పుడు వీరుకూడా హాజరుగా వుండేవారనిన్నీ తెలుస్తూవుంది. వీరినిగురించిన కొన్ని విశేషాలు రాయ వాచకములో వివరింపబడియున్నవి.

విజయనగరసామ్రాజ్యకాలంనాటి దేశచరిత్రను, రాజకీయ ఆర్థిక సాంఘిక మతపరిస్థితులను గురించి పరి శోధించి, శాసనములను, స్థానికచరిత్రలను, కవితలను, విదేశీయాత్రికుల సాక్ష్యములను పరిశీలించి ఆకాలంలో మన కవులు రచించిన ప్రబంధములలోని వర్ణనలయందు, చరిత్రాంశములయందు గల నిజమును బయటికి తీసి "Studies in the History of the third Dynasty of Vizayanagar" అనే గొప్ప చరిత్రగ్రంథమును రచించిన డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగా రీసంగతుల నన్నింటినీ చక్కగా చర్చించియున్నారు.*

— తిమ్మప్పనాయకుడు —

గోరంట్లగ్రామంలోని దేవాలయసేవకులకు గల కొన్ని బాధలను సూరపరాజు అనే ఆయన తీర్చినా రనిన్నీ, ఆయన వాకిటి అదెప్పనాయనింవారి కార్య కర్త (ఏజెంటు) అనిన్నీ, ఈ అదెప్పనాయనింవారి తండ్రి పేరు తిమ్మప్పనాయకుడనిన్నీ ౧౯౧౨-వ సంవ త్సరపు మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్టు ౫౫-వ పేరా లోను, ౧౯౧౨-వ సంవత్సరం ౧౧-వ సంఖ్య శాసనం లోను ఉదాహరింపబడినది.

అవసరం తిమ్మయ్య యనీ, అమరం తిమ్మయ్య యనిన్నీ, వాకిటి తిమ్మయ్య యనిన్నీ పైన చెప్పిన శాసనాలలో పేర్కొనబడిన తిమ్మన్నగారే ఈ తిమ్మప్ప యని చెప్పడానికి సందేహం లేదు.

— ఇతర రాజసేవకులు —

కృష్ణదేవరాయలవారి కొలువులో వుండి ఆయ నకు సేవచేసే సద్వంశసంజాతులైన ఇతరనాయకు లకేవుల పేర్లు తిరుపతిశాసనాలలో కనబడుతున్నవి.

— 'ఊడియం' ఎల్లప్పనాయకుడు —

ఊడియం ఎల్లప్పనాయకు డనే రాజోద్యోగి కృష్ణదేవరాయలవారికీ, ఆయనతరవాత రాజ్యంచేసిన

* చూ: ౫-వ ప్రకరణము, పుటలు ౧౭౦-౧, ౧౭౯-౧౮౧.

అచ్యుతదేవరాయలవారికీ సన్నిహితభృత్యుడుగా వుండే వాడు. ఊడిగము మనే పదము ఊడిగ మనే మాటకు రూపాంతరము. ఇతడు 'కల్ తేరు', అనగా రాతిరథం దగ్గిర సత్రం నిర్మించినట్లున్నూ, తిరుపతిలో గోవింద రాజస్వామివారికి దానంచేసినట్లున్నూ క్రీ. శ. ౧౫౨౭ నాటి ఒకశాసనంవల్ల కనబడుతూవుంది.

— 'అడపం' బయ్యప్పనాయకుడు —

అడప మంటే వక్కలు, ఆకులు మొదలైన తాంబూలపు ద్రవ్యము లుంచే సంచి. దీనిని సంచెళ మనికూడా అంటారు. ఆకాలంలో సామాన్యులుకూడా ఎక్కడికి వెళ్లినా ఒక అడపను పట్టుకుని వెళ్లేవారు. కృష్ణదేవరాయలవారు రచించిన ఆముక్తమాల్యద ౬-వ ఆశ్వాసంలో ౬-వ పద్యంలో దీని వర్ణన కనబడుతూ వుంది. ఇది శ్రీమంతు లనుభవించే భోగాలలో ఒకటి. అందువల్ల రాజాధిరాజులైన విజయనగరచక్రవర్తులకు తాంబూలద్రవ్యముల యుద్యోగి యొకడుండడంలో ఆశ్చర్యమేమున్నది? కాశ్యపగోత్రుడైన తిమ్మప్పనాయకుడి కుమారుడైన ఈ బయ్యప్ప కృష్ణదేవరాయలవారి కాలంలోను, అచ్యుతదేవరాయలవారి కాలంలోనూ కూడా ఈయుద్యోగం చేసినట్లు అతడు తిరుపతివెంకటేశ్వరులకు ౫౫,౩౨౦ నార్పణములు సమర్పించి క్రీ. శ. ౬-౯-౧౫౩౭ సం.లో చెక్కించిన శాసనంవల్ల తెలుస్తూవుంది. ఇతడింకా కొన్నిగ్రామాల ఆదాయంవల్ల వచ్చే సొమ్మునుకూడా దేవుడికి సమర్పించాడు. అందువల్ల ఇతడొక శ్రీమంతుడైయుంటాడనడానికి సందేహం లేదు.

— కట్టికతిమ్మన —

జిల్లేళ్ల బసవనాయకరు కొమారుడైన తిమ్మనాయకరు అనే యతడు కృష్ణదేవరాయలవారి కట్టిక, అనగా వెండిబెత్తమును పట్టుకునివుండే వేత్రధరుడు. ఇది యొక రాజలాంఛనము. అతడొక దళవాయి అనిన్నీ, ఈయనకు 'దాడిసేని' అనే బిరుదుకూడా వుండేదనిన్నీ అతడు తిరుపతివెంకటేశ్వరస్వామివారికి నిత్యనైవేద్యమునిమిత్తము ౧౨౦౦ నార్పణములు సమర్పించినప్పుడు క్రీ. శ. ౧౫౪౩ సంవత్సరములో చెక్కించిన శాసనములో వ్రాయబడివున్నది. ఈశాసనమే తెలుగులోకూడా క్లుప్తంగా వ్రాయబడివుంది. అందులో ఈ కట్టికతిమ్మన్న అనుసంధానం రామానుజయ్యగారి శిష్యుడనిన్నీ, అతని పేరు కట్టిక దాడిసేని దళవాయి తిమ్మయ్య యనిన్నీ వుదాహరింపబడివున్నది. శత్రువుల మీదికి దాడివెడలి జయించినందువల్లనే 'దాడిసేని' అనే బిరుదు ఇతనికి వచ్చివుంటుంది.

— 'విద్వత్సభారాయరంజక' శ్రీరంగరాజు —

కృష్ణదేవరాయలవారి పూర్వుల కాలంనుంచీ విజయనగరరాజభవనంలో ఒక నాటకశాల వుండేది. కృష్ణదేవరాయలవారి కాలంలో ఒక నాట్యశాల, ఒక నృత్యశాలకూడా వుండేవి. రాయలవారు తన ఆస్థానంలో సంగీతసాహిత్యవిద్వాంసులను పోషిస్తూ సదా విద్యాగోష్ఠిలో కాలక్షేపం చేస్తూ 'విద్వత్ సభారాయ'లనే బిరుదువహించాడు. నృత్యముచేసి సంగీతము పాడి ఆయనను రంజించే ఆటపాటకుల మేళ మొకటి యుండేది. ఈ మేళానికి నాయకుడు తిరుమలనాథుని కుమారుడైన శ్రీరంగరాజు. అతనికి 'విద్వత్ సభారాయరంజక' అనే బిరుదు వుండేది. రాయలవా రాయనకు గొప్ప జాగీరు లిచ్చారు. అందులో ఎర్లంపూడి అనే గ్రామాన్ని ఈ శ్రీరంగరాజు క్రీ. శ. ౧౫౧౮ లో వెంకటేశ్వరులవారికి సమర్పించాడు. ఈ శ్రీరంగరాజుకొమార్తెయైన రంజకం కుప్పాయి అనే కుప్పసాని క్రీ. శ. ౧౫౧౨ లో చేసిన దానం ఒకటి కనబడుతూవుంది.

ఈకుప్పాయికి తిరుమలమ్మ, ముద్దుకుప్పాయి అనే ఇద్దరు కుమార్తె లుండేవారు. తిరుమలమ్మ స్వామివారికి శా. శ. ౧౪౩౯ ఈశ్వరసం. (క్రీ.శ. ౧౫౧౭)లో 3000 నార్పణములు సమర్పించినట్లు వ్రాయబడిన శాసనం తెలుగు ప్రతిలో ఆవిడ శ్రీరంగరాజు మనుమరాల నని౯్నీ, కుప్పమ్మకుమార్తె నని౯్నీ వ్రాయించింది.

కుప్పాయి రెండవ కొమార్తె ముద్దుకుప్పాయి మొదట విజయనగర చక్రవర్తియైన అచ్యుతదేవరాయల అంతఃపురపరిచారికగా వుంటూవుండి ఆయన ఆజ్ఞ

ప్రకారము తిరుపతి వెంకటేశ్వరస్వామివారి సేవ చేయడానికి వచ్చినట్లున్నూ, గోవిందరాజస్వామివారి ఆలయంనుంచి ప్రతిరోజూ ఆవిడకు తినడానికి ప్రసాదం యిస్తూవున్నట్లున్నూ శా. శ. ౧౪౫౩ ఖర సంవత్సరం (క్రీ. శ. ౬-౬-౧౫౩౧) శాసనంలో వివరింపబడివున్నది. ఈ శాసనంలో శ్రీరంగరాజు కొమార్తెయున్నూ, ముద్దుకుప్పాయితల్లిన్నీ అయిన కుప్పసానికికూడా "విద్వత్సభారాయరంజకం" అనే బిరుదు వుండినట్లు చెప్పబడివున్నది.

ఇలాగ విజయనగర చక్రవర్తుల సేవను చేసే స్త్రీ పురుషులలో గొప్ప వంశాలవారూ, శ్రీమంతులూ అనేకు లుండేవా రని తిరుపతి దేవస్థానములో నున్న శాసనాలవల్ల తెలుస్తూవున్నది.*

— తిమ్మశబ్ద విచారము —

మన తెలుగుదేశంలో తిమ్మ, తిమ్మడు, తిమ్మన్న, తిమ్మప్ప, తిమ్మకవి, తిమ్మ నృపతి, తిమ్మ మంత్రి, తిమ్మయ్య, తిమ్మరాజు, తిమ్మాజి, తిమ్మశౌరి, తిమ్మశెట్టి, తిమ్మక్క, తిమ్మాయమ్మ, తిమ్మమ్మ, తిమ్మాంబ, తిమ్మాజమ్మ అనే స్త్రీ పురుషుల పేర్లేగాక తిమ్మాపురం, తిమ్మసముద్రము మొదలైన స్థలవాచకములున్నూ, తిమ్మని బ్రహ్మని చేయడము మొదలైన జాతీయాలున్నూ చిరకాలంనుంచి వాడుకలో నున్నవి. ఆంధ్ర సామ్రాజ్యానికి కన్నడదేశమధ్య నున్న విద్యానగరం రాజధానిగానైనప్పటినుంచీ ఈ తిమ్మ శబ్దానికి కన్నడప్రత్యయాలు చేర్చిన పదాలుకూడా వాడుకలోకి వచ్చినవి. తిమ్మరాజునే కన్నడములో తిమ్మరసు అని వ్యవహరించారు. రాజు అనే శబ్దంలో నుంచి 'అరసు' అనే కన్నడరూపం పుట్టింది. తిమ్మ శబ్దము వైకృత దేశ్య మిశ్రమమైన తిరుమల శబ్దములో నుంచి పుట్టిన దేశీయమైన తెనుగు పదము. దీని వ్యుత్పత్తిని గురించి శబ్దరత్నాకరములో కొన్ని వివరాలున్నవి.

* *Tirupati Devasthanam Epigraphical Report by Sadhu Subrahmanyam. (pp. 199. 207.)*

తిరుమల + డు = తిమ్మడు అయింది (చూ: శబ్దరత్నాకరం). ఇలాగే తిరుమల + అప్పడు = తిమ్మప్పడు అయింది. ఈ తిమ్మప్పడు అనేది సింహాద్రిఅప్పడు లాంటి పదమే. కాకమాని మూర్తికవి తన రాజవాహన విజయములో "కొండమీది తిమ్మప్పనివంటి కావ్యపతి యబ్బుట యబ్బుర" మని వ్రాసిన పద్యం శబ్దరత్నాకరములో ఉదాహరింపబడి వున్నది. తిరుమల అనే పదము వేంకటాచల మనేదానికి పర్యాయపదంగా చిరకాలంనుంచి వాడుకలో వుంది. అళియరామరాయుల మేనల్లుడున్నూ, కొండవీడు పరిపాలకుడున్నూ అయిన సిద్ధిరాజు తిమ్మ భూపాలుడు తన పరమయోగివిలాసములో ౨-వ ఆశ్వాసంలో,

"క. సరగల తిరుపతు లొకకడ,
వరుసకొని ముకుందమూర్తి వర్గము వతి డ
చ్చెరువుగ నుతించె నెడనెడ
దిరుమలదేవరను దిరిగి తిరిగి పొగడుచున్."

అని వ్రాసినాడు. తిరుపతి యనేది విష్ణుక్షేత్రానికి పర్యాయపదము.

గీ. "వినుము తల్లి నూట యెనిమిది తిరుపతు
లందు నెన్న వేంకటాచలంబు,
రంగనాయకుడు గరంబు సన్నుతి గాంచు
గ్రహములందు శశియు రవియుబోలె."

అని ౪-వ ఆశ్వాసంలో వ్రాసినాడు. (చూ: శబ్దరత్నాకరము.) తెలుగులో తిరుపతి తిరుమల లనే పదాలు పర్యాయపదాలుగా చిరకాలంనుంచి వాడుకలో నున్నవి. తెలుగు దేశానికీ, అరవదేశానికీ తిరుపతికొండ సరిహద్దని అంటారు. తిరుపతిలోని ప్రజలందరికీ తెలుగే మాతృభాషగా వుండి తిరుమలలోనుంచి తిమ్మశబ్దం పుట్టడంతోపాటు తిరుపతి కొండమీది కోతులకు తిమ్మ డనే పేరు రూఢమైంది. ఈ తిరుపతి వెంకటేశ్వరుడు తెలుగువారికి ఇలువేల్పుగా వుంటున్నాడు. అయితే ఇటీవల ద్రావిడాభిమానుల యుద్యమ మొకటి బయలుదేరి తిరుపతి వేంకటేశ్వరుని పేరులోని వేంకటశబ్దము వేంగడ మనే అరవ శబ్దంలో నుంచి పుట్టినదనీ, దానితోపాటు తిరుమల తిరుపతులు

కూడా అరవవారి స్వార్జితపు సొత్తులనీ ఒక ప్రచారము జరుగుతూవున్నది.

### "జనని సంస్కృతంబు సకలభాషలకును —దేశభాషలందు తెలుగు లెస్స"—

మన దక్షిణభారతదేశములో పూర్వంనుంచీ ఏరాజవంశాలు ఏలుతూవస్తూవున్నా, వారు పల్లవులైనా, చోళులైనా, చాళుక్యులైనా, లేక కాకతీయులైనా, విజయనగరచక్రవర్తులైనా ఇక్కడి తెలుగువారినీ, అరవవారినీ, కన్నడులనూ కూడగట్టుకుని దేశప్రజల నాగరికతను, మతధర్మాలను కాపాడుతూ ప్రజానురంజకంగా పరిపాలించారే గాని వేరువేరు భాషలు మాట్లాడేవారిని చీలదీసి 'పాకిస్తానాల'ను ఏర్పరచలేదు. అందువల్లనే ఆసేతుహిమాచలపర్యంతము గల పుణ్యక్షేత్రాలను, పుణ్యనదులను దేశప్రజలందరూ ఇప్పటికీ సమానభక్తితోనే పూజిస్తూవుండడం తటస్థించింది. ఏ క్షేత్రమాహాత్మ్యం చదివినా, ఏ పురాణం చదివినా ఆస్థలజలపవిత్రతను గురించీ, ప్రాశస్త్యాన్ని గురించీ వర్ణించడం కనబడుతుందే గాని ఇది అరవలది, అది తెలుగువారిది, ఇది కన్నడులది, అది మహారాష్ట్రులది అనే భేదాన్ని పొరపాటునైనా చెప్పవు. కావేటిరంగని పదాలుగాని, పాండురంగవిఠలుని కీర్తనలుగాని, తుకారాము అభంగములుగాని, కబీరుదాసు కీర్తనలుగాని, తులసీదాసు దోహాలుగాని, గీతగోవిందము గాని, తరంగములుగాని, తత్వాలుగాని ఎక్కడనైనా ఎవరైనా పాడుతూవుంటే ఇది ఏభాష అనే విచక్షణ లేకుండా దేశప్రజలందరూ—స్త్రీలూ, పురుషులూ భక్తిపారవశ్యంతో తన్మయులవుతారు. ఏ క్షేత్రానికి పోయినా ఆ ప్రాంతపు భాషతో నిమిత్తం లేకుండా అక్కడి ప్రజలతోపాటు దేవుణ్ణి సేవించగల్గుతున్నారు. అరవలైన పల్లవులూ, చోళులూ తెలుగుదేశాన్ని ఏలినప్పుడుగాని, చాళుక్యులు తెలుగుకర్ణాటకాలను ఏలినప్పుడుగాని, కర్ణాటకరాజ్యమధ్యలో తెలుగుప్రభుత్వము స్థాపించిన విజయనగరచక్రవర్తులు ద్రావిడ కర్ణాటకాలను పరిపాలించినప్పుడుగాని ఒక జాతిని, ఒక భాషను అధికముగా జేసి తక్కినవారిని అణగద్రొక్క లేదు. అన్ని భాషలనూ ఆదరించారు. "జనని సంస్కృతంబు సకలభాషలకును దేశభాషలందు తెనుగు లెస్స" యనే భావము ఒక్క తెలుగువారిలోనే కాదు అరవంలోనూ, కన్నడంలోనూకూడా వ్యాపించి యున్నది. ఆయాదేశాలలో ఇప్పటికీ ప్రజల నోట వినబడే తెలుగుపదాలు, పద్యాలు, కీర్తనలు, కథలు, గాథలూ ఇందుకు ప్రబలమైన నిదర్శనాలుగా ఉన్నాయి. కృష్ణదేవరాయలంతటివాడు "దేశభాషలందు తెలుగులెస్స" యని యుద్ఘోషించాడు. అంతమాత్రంచేత జాత్యహంకారముగాని, జాతివైరముగాని ప్రబలలేదు.

### —ద్రావిడఉద్యమం—

అరవదేశంలో ఇటీవల కొందరు ప్రబుద్ధులు బయలుదేరి ఒక ద్రావిడాభిమానమును ప్రచారంచేస్తూ తమ దేశంలోనుంచీ, భాషలోనుంచీ, సంగీతసాహిత్యములోనుంచి సంస్కృతాన్ని పారతోలడానికి ప్రయత్నిస్తున్నారు! అరవంలో పాడకుండా తెనుగులో పాడినా డనే కారణంతో త్యాగరాజుయొక్క దివ్యవాణిని తమ సంగీతసభలలోనుంచి వెలిపెట్టడానికి ప్రయత్నిస్తున్నారు!! దేశములోని తెలుగుభాగాలు కూడా తమవే నంటున్నారు. ఇంక ఉమ్మడిప్రదేశాలన్నీ తమ వనడంలో ఆశ్చర్య మేమున్నది? ఈసందర్భంలో దేశచరిత్రనుకూడా తమ కింపుగా ఉండేటట్లు మార్చి వ్రాయడానికి ప్రయత్నిస్తున్నారు. కేవలము ద్రావిడదురభిమానావేశము గలవారుమాత్రమే ఇలాంటి పిచ్చిపనులు చేస్తే చింతలేదు. డాక్టర్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగారివంటి ప్రాజ్ఞులైన చరిత్రకారులు కూడా తమ రచనలలో అరవఅభిమానం చూపిస్తూ సత్యాన్ని మరుగుపరచడము, చరిత్రాంశాలకు అపార్థం కల్పించడం చాలా దుఃఖకరమైన సంగతి. తిరుపతి చరిత్రలో వారు తెలుగుభాషకు, తెలుగువారికి చేసిన అన్యాయము మరీ ఎక్కువగా నున్నది. వెంకటశైలముతోపాటు తిరుమలను, తిరుపతిని అరవవారి స్వంతహక్కు గల సొత్తుగా నిరూపించాలని కృష్ణస్వామయ్యంగారు చాలా తంటాలుపడ్డారు. తిరుపతిదేవస్థానపు శాసనాలను పరిశోధించి నివేదికను తయారుచేసిన సాధుసుబ్రహ్మణ్యంగారి నివేదికను, ఈ తిరుపతి

చరిత్రను పోల్చి చూస్తే కృష్ణస్వామయ్యంగారి పక్షపాతపు వ్రాతలు కొంతవరకూ తెలుసుకోవచ్చును.

మన తెలుగు చరిత్రకారులు, పరిశోధకులు, విశ్వకళా పరిషత్తువారు, తెలుగుప్రజలూ చరిత్రరచనలో మనకు జరుగుతూవున్న ఈ అన్యాయాన్నిగురించి ఎందుకు ఆలోచించరో తెలియడం లేదు. బ్రదికి చెడిన జాతి ఈ యాంధ్రజాతి అనియైనా స్మరించుకుంటే కృతార్థుల మవుతాము.

---

## రైలుబండిలో

# అవతారం

[ నాటకము ]

(గత సంచిక తరువాయి)

= శ్రీ రామగోపాల్ =

## మధ్య

౧. ఈలోకంలో—పిచ్చిపట్టణం వెలుపలి గేటు

[వయసు మళ్లిన పెద్దమనిషి x స్త్రీ తిరుగుతూ వుంటాడు.]

పెద్దమనిషి—పహారా హుషార్...

పహారా హుషార్...

పహారా హుషార్...

పిచ్చాళ్లకోసం,

పిచ్చాళ్ల వేషం,

పిచ్చాళ్ల దేశం...పహారా హుషార్.

వాగుడులది యిష్టం,

పిండాలకే నష్టం,

అంతటా కష్టం...పహారా హుషార్.

బుర్రలో గోడా,

గుండెలో కూడా,

బూజులకి పూజ...పహారా హుషార్.

బాటల్లో గోల,

కోటల్లో లీల,

నాటకం చాల...పహారా హుషార్.

పిచ్చాళ్లకోసం,

పిచ్చాళ్ల వేషం,

పిచ్చాళ్ల దేశం...పహారా హుషార్.

(పాట ఆపి) ఏయ్, ఆగూ! నేనుకూడా నిద్దరోతున్నా ననుకున్నావా?

దేవుడు—నేను నిద్దరోతున్నట్టెల్లా తెలిసిందో అప్పుడే?

పెద్దమనిషి—సైలెన్స్!...యింకా మాట్లాడితే, దాక్కున్న దేవుణ్ణికూడా పట్టేస్తుంది, ఏస్సరే!

దేవుడు—మతి స్థిరం లేనివాడికి పెట్టారేమిటే పహారావుద్యోగం?

పెద్దమనిషి—ఏమనుకున్నావా దేవుడూ రావన్నాడు. చెప్పమన్నావా?—సంవత్సరానికి మూడుసార్లు ఎన్నికలు. "సోదరులారా, మీ బాగుకోసమే యిదంతా" అని ఒక్కసారి అనేసి, మన బాగు మనం చూసుకోడం బహుసింపిల్, ఏమంటావ్? అన్ని పదవులకీ అంతే యిప్పుడు. మొన్ననే కొత్తగా ఓ దేవుణ్ణికూడా ఎన్నుకున్నాం.

దేవుడు—కొత్త దేవుడా!

పెద్దమనిషి—ఏం, పాపం, పాతదేవుడికిచ్చావా నీవోటు?...పేర్లు ఖంగాళీ కాకుండా అతగాణ్ణి దేవుడంటే, ఇతగాణ్ణి దయ్యం అని పిలుస్తున్నాంలే ప్రస్తుతం!

దేవుడు—అబ్బే, చూడు, నాదోవని నన్ను పోనియ్యి. లోపల నాకు చాలా అవసరకార్యం వుంది.

పెద్దమనిషి—అబ్బో, యీపప్పులు నాదగ్గర ఉడకవు! కొత్తవాళ్లకి ప్రవేశం లేదు.

దేవుడు—నేను పాతవాడినేనయ్యా, చాలా పాతవాడిని. కొత్తవాడినని ఎవరు చెప్పారు?

పెద్దమనిషి—నీ మొహమే చెబుతోంది. పైత్యపు కళ బొత్తిగా లేదు.

దేవుడు—పైత్యపు కళ వుండాలా?

పెద్దమనిషి—వుంటేనే మావూరు. పిచ్చిపట్టణం మొత్తానికి కంచుకాగడా వేసి వెతికినా, యిల్లా తెలివితేటగా వున్న మొహం కనిపించదు. ఏ వూరు నీది?

దేవుడు—ఏవూ రనడానికీ వీల్లేదు. ఏవూరు కాదనడానికీ వీల్లేదు.

పెద్దమనిషి—బాగా ఏమరకల శక్తి వుందా నీకు ?

దేవుడు—ఏమున్నే నవ్వు, నవ్వే ఏమున్నూ. అల్లాంటి తేడాలు లేవు నాకు.

పెద్దమనిషి—అయితే యిందాకా నే పాట పాడుతున్నంత సేపూ ఎక్కడ నక్కావు, కనిపించ లేదు ?

దేవుడు — ఇక్కడే వున్నాను ... అంటే ఎక్కడా లేను. కనిపించకుండా కనిపిస్తున్నాను.

పెద్దమనిషి—సరే అయితే, నువ్వు లోపలి కొచ్చు.

దేవుడు—వీల్లేదన్నావుగా యిందాక ?

పెద్దమనిషి—పొరబాటు, పొరబాటు రనుకున్నాను. నీకూ మనుష్యుల్లాగే పొరబాట్లు వచ్చును. నా వూరే నీదిని !

దేవుడు—గేటు తాళంతియ్యి మరి !

పెద్దమనిషి—(గేటుతీస్తూ) తీస్తున్నా గాని, గేటు దాటేటప్పుడుమాత్రం ఒక్కసారి గట్టిగా ఏడు. అదో హైఆనుమాయితీ లే!...యింక వెళ్లు—ఆ, చూడు, యింకోసంగతి. పడమటి పుంత యీమధ్య కొత్త ప్రమాదంగా వుంది. అల్లర్లు జరుగుతున్నాయి...యిక తలరోడ్డే వెళ్లసరాపరి......

౨. నాలుగురోడ్లకూడలి: బస్సుస్టాండుదగ్గిర

[పడమటిగాడ్పుకి పక్కలంటుకుపోతున్న పాంథుల గొణగొణ, బస్సుయంత్రాల పళ్లకొరుకుళ్లూ, కొటికవిరుపుళ్లూ, 'క్రూడాయిలు' పొగపరామర్శలూ, యీ చిల్లరభూకంపాల మధ్యనే విరిగి మరుగుతున్న అఖండకవిప్రణయఘోష.]

అ. కవి—(చేతులో కాగితం దిద్దుకున్నట్టు మధ్యమధ్య వట్టుకూ, మొత్తంమీద బహిరంగసభ ధోరణిలోనే పారాయణం చేస్తుంటాడు.)

నువ్వు నువ్వేనోసి,
నేను నేనేనోసి,
నువ్వు నేనయి పూసి,
నేను నువ్వయి కాసి,
లోకాల రాకాసి,
జూకాలు పికేసి,
నవ్వోసి ప్రేయసీ,
నవ్వోసి, నవ్వోసి!
నవ్వోసి! నవ్వోసి!!

ఒక పాంథుడు—(పైపాట జరుగుతుండగానే) యిప్పుడు పాడుతున్నా డెవరో?

౨-వ పాంథుడు—ఇక్కడె!

౧-వ పాంథుడు—యిల్లాంటిపాట!

౨-వ పాంథుడు— సన్యాసేమో!

౧-వ పాంథుడు—మరి దండకమండలాలూ, బూడిదా?

౨-వ పాంథుడు—అక్కర్లేదు, కొత్త పంథిలే! లేకపోతే, యిన్ని చిమ్నీల మధ్య, యిన్ని మూతల కతీతంగా, యింత పరాకాష్ఠతో పకపకలంటి రహస్యాలు పాతాలుపాడడం—

౧-వ పాంథుడు—ఏమో, ఏ ఖాయిలాపడనిపో పాపం!

అ. కవి—(ఆగీతం ముగించిన ఆవేశంలో, అంత కంటె కొంచెం హెచ్చుస్థాయిలో—)

మరిగిపోయిన చేదు
విరిగిపోయిన పాలు
తేనీటితో కాలు
టీకప్పులో కాలు—
గలగలలు, పలపలలు,
కాలవానుని కలలు—
పాడోసి ప్రేయసీ
పాడోసి, ఆడోసి!

బాటసారి దేవుడు—చూడయ్యా, యిటు చూడు.

అ. కవి—(వులిక్కిపడి, ఖంగారుగా) ఏమిటి, కంబళంబన్నే! గంటనించి ఎంత చూస్తున్నా—(పరిస్థితి పరకాయించి గమ్మున ఆగుతాడు)

బాటసారి దేవుడు—కనిపించని మీ చూపు దాటి ఒక్క కంబళంబన్నేమిటి లోకం, కాలంకూడా పరుగెత్తుకుపోతున్నాయి. చూడయ్యా, చూడు—యిళ్లల్లో మంటలు...పిల్లల ఏడుపులు...అట్టహాసాలు..హాహాకారాలు...ప్రణయాలు..ప్రళయాలు..రణాలు...మరణాలు...మహారణాలు — సంక్షుభిత విశ్వరూపం!

అ. కవి—ఆగు, ఆగు! నాలో లేనిపోని గందరగోళం పుట్టిస్తున్నావ్! ఏమిటిదంతా! వెనకటికి దండకారణ్యాలూ, దండకమండలాలూ లాగే దండకాలంటూ వుండేవిట, ఆ బాపతా యిది!—యింతకీ, నీకివ్వడానికి పైసా లేం లేవు నాదగ్గర. పద్యాలు కావలిస్తే యిస్తాను, పదో పరకో, పట్టుకుపో!

దేవుడు—అపరబ్రహ్మార్థికు, మహాభాగ్యమే గాని—

అ. కవి—(సణుక్కుంటూ) అనే తెమ్మంటాడుగాబోలు ఖర్మ!

దేవుడు—అలకిస్తూనేవున్నానుగా! అయినా, నిత్యభిక్షుకుణ్ణి, యీపద్యాలెక్కడ కట్టికెళ్లను!

అ. కవి—ఇసంటేయిపేనా, ఇంకా వున్నాయి రకాలు-యిత్తడి చెంబుమీద కావ్యం విన్నావ్? 'చేంతాడు' గీతాలు ఎప్పుడేనా అలకించావ్?... యింకా కొత్తరకాలు కావాలంటే పురమాయించు— నాలుగు కప్పుల టీ, దానికి సరిపడా ధూపకాష్టాలూ—నీయిష్టమొచ్చిన అఖండ రచన తయార్! అయితే, యిది వరకు రాసినవే కావాలంటే, మాయింటికెళ్లాలి. మా యిల్లనగా, మాఆవిడ. అంటే, యీపూట వంటకి బియ్యం వగైరా కిరాణాలని అర్థం. అవి నాతో రాని కారణంవల్ల, పేడనీళ్లు, చీపురుకట్టా అని తాత్పర్యం-ఆలోచించుకో, నీయిష్టం! (గమ్మున ఆగి రిచ్చపాటుతో) అయితే అబ్బీ, నీకు మోళీ కట్టే అలవాటేమన్నావుందా?

దేవుడు—ఏమయ్యా, అల్లా అడుగుతున్నారు?

అ. కవి—అహ, మరేం లేదులే. వాళ్లేదో కనికట్టూ అదీ కడతారుటలే! ఎదటివాడిచేత యిష్టమొచ్చినట్టు పల్టీలు కొట్టిస్తారుట!... ఏదో ముష్టికొచ్చిన నీతో యింతదూరం మాట్లాడ్డం, నేనే పొట్టిచవటనో, నువ్వే మోళీవాడవో నాకే అర్థం కావటం లేదు.

దేవుడు (మందహాసంతో)—నేను మోళీవాడిని మాత్రంకాదు! (ఆగి) అఖండకవులివేళ ఆవేశంలో ఉన్నట్టున్నారు—అంతే!

అ. కవి—ఏం కవిత్వమో, ఏంపాడో! ఎన్నిరకాలుగా ఏడిచినా వినేవాళ్లే కరువైపోతున్నారు. యింక నాలుగు డబ్బులు రాల్చేవాళ్లన్నావా, ఆసలే సున్నా! యీమధ్య మరీ ఘోరకలి! కవిత్వం కిట్టక, కాఫీహోట లారంభిద్దామనుకుంటున్నా.

దేవుడు—అయితే, బాబూ, ఆశయాలూ ఆదర్శాలూ—

అ. కవి—అహ ఏనోపకోడీలూ, పెసరట్లూ ఈలాగ చిన్న యెత్తులోనే ప్రారంభం! ఏవేవో తల్లాంటి దినుసులు మనం పెట్టినా అడిగేవాళ్లుండరీ కాలంలో. అసలా పాకాలు తెలిసిన వంటవా డేడీ కర్మం! అంచేత— చూశావ్—

దేవుడు—(గంభీరంగా) చూస్తున్నా- చూస్తున్నా! చూస్తూనే వున్నాను. కడుపులాది విజ్ఞానమూ, కళ్లకొద్ది అజ్ఞాతమూను! నడిబజారు గగనంలో నక్షత్రపు అమ్మకాలు! మండపట్టు బొగ్గుపోగా, సుండెకాయ అయోమయమూ—అమరగీతం నరుకు మరై, కిరకిరమంటున్నాడు—చూస్తున్నా...చూస్తున్నా...చూస్తూనేవున్నాను! (ఆగి, వెళ్లిపోతూ) వెళ్లాలి...యింకా వెదకాలి!

అ. కవి—(సాలోచనగా) 'కడుపులాది విజ్ఞానం ...కళ్లకొద్ది అజ్ఞాతం...నడిబజారుగగనంలో నక్షత్రపు అమ్మకాలు...'—(గమ్మున ఏదో తట్టినట్టు) అరెరే! కవి! పెద్దకవి!— ఏమహాకవి ప్రేతమోకూడా! (కేకలెడుతూ) ఏయ్, కాళిదాస్! షేక్స్పియర్!

గట్టి! నన్నయ్యా! (తప్పులో) వెళ్ళిపోయాడు!
నా మెదడులో మాత్రం ఉరుములూ మెరుపులూ
—ఒక కొత్త ఆకాశం విప్పేశాడు!

(మననం చేసుకుంటున్నట్టు మందస్వరంలో)

చూస్తున్నా, చూస్తున్నా,
చూస్తూనే వున్నాను!
కడుపులాది విజ్ఞానం,
కళ్ళకొద్ది అజ్ఞాతం,
నడిబజారు గగనంలో
నక్షత్రపు అమ్మకాలు!—
చూస్తున్నా, చూస్తున్నా,
చూస్తూనే వున్నాను!...
మంచుపట్టు బొగ్గుపొగా,
గుండెకాయ అయోమయం,
అమరగీత నరుడు మరై
కిరకిరమంటున్నాడు!...
చూస్తున్నా, చూస్తున్నా,
చూస్తూనే వున్నాను!...

ఒక పాంథుడు—స్వామీ, దీని కథ ఏమిటి?

ఆ. కవి—అబ్బే, యిది అనర్థం! (అని మళ్ళీ ఆపాటే మెల్లిగా పాడుకుంటూ వుంటాడు.)

## 3. వీధి సందడి

[కారు సమీపిస్తున్న ధ్వని]

ఒకరు—అయ్యో! అయ్యో! చస్తాడు—పాపం, కారు! (కెవ్వున చస్తాడికేక. గమ్మున కారు ఆగిన చప్పుడు. కోలాహలం. మళ్ళీ కారు బయలుదేరి పోయింది.)

దేవుడు—భయం లేదు. నేను బాగుచేస్తాను... కాస్త గాలి రానివ్వండి! (జనుల సందడి కొంత తగ్గింది. యింతలో యింకో కారు ఆగిన చప్పుడు. "తప్పుకోండి తప్పుకోండి! డాక్టరుగారు" అనే మాటలు)

డాక్టరు—ఏమిటీ గందరగోళం? ... ఇంతా చేస్తే చస్తాడా?

ఒకరు—మీదనించి కారు పోయిందండి! కాలు విరిగింది. పాపం, యీయ నెవరో యిందాకటి నించి పరిచర్య చేస్తున్నాడు!

డాక్టరు—ఎవరు మీరు? యిలా రండి! (మెల్లిగా చెవిలో చెప్పినట్టు) వాడు కేవలం చస్తాడు!

దేవుడు—చూశాను.

డాక్టరు—మరెందుకంత అవస్థ పడుతున్నారు?

దేవుడు—నయం చేస్తామని!

డాక్టరు—సాధ్యం వుండదు—చస్తాడు!

దేవుడు—సాధ్యమా?

డాక్టరు—దెబ్బిచ్చుకోలేదు.

దేవుడు—దెబ్బెందుకు?

డాక్టరు—మరెందుకీ అవస్థ నీకు?

దేవుడు—దయా దాక్షిణ్యానికి.

డాక్టరు—దయా దాక్షిణ్యమా? ఏమిటది? అలాంటి జంతువు లేవో పూర్వం వుండేవని మా ముసలమ్మ చెప్పగా విన్న జ్ఞాపకం. యిప్పుడా జాతుల్లేవు— నశించాయి!

దేవుడు—అయ్యయ్యో! కూటికే గతిలేనివాడు ...బాధపడుతున్నాడని వూరికే—

డాక్టరు—ఏమిటీ, వూరికే వైద్యం చేస్తావూ? ఎవరు నువ్వు? యింకా యీవూరి వైద్యుడివను కున్నాను. చూస్తే నీవ్యాపారం అంతా చాలా అనుమానంగా వుంది. యిలాంటివాళ్ళ నందరినీ పట్టి చెప్పు జెప్పమని మొన్ననే శాసనం ప్రకటించారు. నడు, నడు.

దేవుడు—బాబూ, ఒక్క నిమిషం ఆగు... యీ దిక్కుమాలిన పక్షి చచ్చిపోతాడు చికిత్స చెయ్యకపోతే.

డాక్టరు—నీకెందుకా బాధ? ఎవరికి వారే యమునాతీరే...నడు, నడు!

('తప్పుకోండి, తప్పుకోండి, పెద్దనాయుడుగారు' అని జనుల కోలాహలం)

డాక్టరు—చూడండి బాబూ, వీడు వూరికే చస్తాళ్ళందరికీ వైద్యం చేసి బతికిస్తాడుట!

నాయుడు—ఆ, ఏమిటీ? ఏరా అబ్బీ? యిది పిచ్చిపట్టణం, తెలుసా? యిల్లాంటి వేషాలేస్తే డొక్క చించేస్తాను!

దేవుడు—అయ్యో, భగవంతుడా!

నాయుడు—అదుగో మళ్లీ భగవంతు డంటున్నావూ—?

డాక్టరు—యిందాకా దయాదాక్షిణ్యా లని కూడా అన్నాడండి! జంతువు లనుకున్నాను, అవీ భగవంతుడి పేళ్లేకాబోలు!

నాయుడు—యింకేం? మొత్తాని కెవరో పొరుగూరువా డన్నమాట! మన వూరయితే, అల్లాంటి తప్పుడు పేలాపన వుండదు. ఏయ్, బంట్రోతులూ! మెత్తగా తన్నండి!

బంట్రోతులు—ఎవర్ని బాబూ? యీగడ్డపా యన్నా, ముష్టాడినా?

నాయుడు—యిద్దర్నీని!

(బంట్రోతులు తంతారు. జనుల కోలాహలం... ముష్టాడిగోల..."భయపడకు బాబూ, నేనున్నానింకా" అంటూ మధ్యమధ్య దేవుడు.)

## ౪. వీధి

[బిచ్చగాడి అవతారంలో దేవుడు]

దేవుడు—కడుపుకి తిండి లేదు బాబూ...... కట్ట గుడ్డ లేదు తండ్రీ...

న్యాయవాది—ఛో, ఛో! పనీ పాటా లేదింక!

దేవుడు—చూపించండిబాబూ, చేస్తాను.

న్యాయవాది—అయితే యిల్లారా. యివేళ న్యాయస్థానంలో ఓ చిన్న కేసుంది. వస్తా నన్న సాక్షి ఒకడు రాలేదు. వాడికి బదులు నువ్వు పలుకుతావా? అర్ధరూపా యిస్తాను!

దేవుడు—ఏం పలకాలి బాబూ!

న్యాయవాది—పలకమన్నదల్లానూ! అంతా నువ్వు చూసినట్టు చెప్పాలి!

దేవుడు—చూడందే ఎల్లా చెప్పడం బాబూ?

న్యాయవాది—నే చెబుతాగా అంతా. ఒకటి రెండుసార్లు వల్లించుకో బాగా.

దేవుడు—న్యాయస్థానం అన్నారు బాబూ, అల్లా అబద్ధాలాడితే—

న్యాయవాది—ఆడాల్సినవే అవి! పాఠం అంతా నేనే చెబుతాను. ఊరికే వల్లించినందుకు నీకా అర్ధరూపాయీని!

దేవుడు—అర్ధరూపాయికోసం అబద్ధ మాడతారా?

న్యాయవాది—అణాకానీ యిస్తే నేనాడటం లేదూ, లక్షాతొంభై అబద్ధాలు? ఏదో తిండికి లేదంటున్నావని అర్ధరూపాయన్నాను.

దేవుడు—హరహరా!

న్యాయవాది—అదేవిటి? తిట్టుకూడా మొదలెట్టావ్? అందుకే మీలాంటి వాళ్లకి మెతుకు లుండకపోడం...ఛో, ఛో!

(కారు ఆగిపోయిన ధ్వని)

దేవుడు—(గొణుక్కుంటూ) దయాదాక్షిణ్యాలు జంతువులు! హరహరా అంటే తిట్టు! ఇదంతా పిచ్చిపట్టణం! వెళ్లాలి...యింకా వెదకాలి...

## ౫. ప్రయోగశాల

[గొట్టాల్లో రసాయనాల బుసబుసలు, గాజు బుడ్ల గలగలు. శిష్యుల చేతుల్లో కోతలకి కప్పల అరుపులూ, కుందేళ్ల చావుకేకలూ—మధ్యమధ్య. పెద్ద సైంటిస్టు మాయలమరాఠీ. ఎదురుగుండా బికారి వేషంలో దేవుడూ.]

మా. మరాఠీ—ఇష్! యింతా జేస్తే వొట్టి మనిషే! ఏదో విచిత్రవ్యక్తంటే, విడగొట్టి చూద్దామనుకున్నాను. మరో మహావిషయం కనిపెట్టేద్దామనుకున్నాను.

దేవుడు—మీ శిష్యుడి పొరబాటు! నేను విచిత్రవ్యక్తిని కాదు.

మా. మరాఠీ—ఆ, మరెవరవు?

దేవుడు—విచిత్రాతివిచిత్రవ్యక్తిని—అవ్యక్తినీని!

మా. మరాఠీ—అంటే?

దేవుడు—అంటే, అతిసామాన్యుణ్ణి!

మా. మరాళీ—సామాన్యుల కిక్కడ ప్రవేశం లేదు.

దేవుడు—నాకు ప్రవేశం అక్కర్లేదు. యిక్కడే కాదు, ఎక్కడైనాను! అందుకే యిక్కడ—వున్నాను!

మా. మరాళీ—నీధోరణి ఏదో చిత్రంగానే వుంది! అయితే, నీ కింకా మాప్రతిభ అవగాహన కాలేనట్టుంది! మా పిచ్చిపట్నంలో 'ఆకాశసౌధం' చూశావా? నా మెదడే దాని కాధారం...ప్రపంచం లోకల్లా ఎత్తైన గోపురం—

దేవుడు—హిమాలయ శిఖరం కంటేనా?

మా.మరాళీ—నదీనదాలు, సముద్రాలుకూడా అడ్డులేకుండా జయించినవాణ్ణి నేను! నేలమీద కంటె చురుగ్గా, కులాసాగా నీళ్లమీద ప్రయాణాలు-ఓడలు...పూరం చేసి ఓడలు! నా పేరు చెప్పుకుని మనుష్యు లిప్పుడు స్వేచ్ఛగా నీళ్లమీద - నీళ్లలో- సంచరిస్తున్నారు!

దేవుడు—చేపలూ, జలచరాలూ ఏనాటినించో చేస్తున్నా యీపని!

మా. మరాళీ—గాలిని లొంగదీసి, ఆకాశం తుంగదొక్కడానికి విమానాలు—రకరకాల గాలి విమానాలు—సృష్టించింది నేనే! దేశకాలభేదాల కతీతమై, ప్రపంచాన్నే కుదించిపారేస్తున్నాయి నావిమానాలు. (గంభీరంగా) నా ప్రతిభవల్ల మానవు డిప్పుడు ఎగురుతున్నాడు!

దేవుడు—పిట్టలన్నిటికీ పుట్టుకతోటే వచ్చే విద్య!

మా. మరాళీ—నేను సృష్టించిన చిత్రాలు, విచిత్రాలు, అద్భుతాలు ఎన్నో! నా మెదడు లోంచి ఫలించిన శక్తులు, యంత్రాలు ఎన్నో! ప్రతి మారుమూలకీ ప్రపంచం అంతా అలుముకున్నాయి. శతసహస్రసీతుల మానవసంఘాన్నంతా మార్చేశాయి—మార్చేస్తున్నాయి!... ఇదుగో! పెద్దమంచుకణంలా మిలమిల్లాడుతున్న ఈగోళీ చూశావా? అమాంతంగా నూరువేల వూపిరితిత్తులు నొక్కెయ్యగల మహాశక్తి—విషవాయుకషాయం— యిందులో యిమిడ్చాను! ఆమూల జిగుజిగు మంటున్న దేమిటో తెలుసా? నా బుద్ధి, నా చాకచక్యం సృష్టించిన యంత్రజాలం... యినుం, వుక్కు ఎటువంటి దుర్భేద్యమైన వారం అయినా నా దూదిపింజలా ఏకెయ్యగల దారుణాస్త్రం...క్షణాల్లో, మహానగరాలు మంటిదిబ్బలు చెయ్యగల నాశన రహస్యం!

(ఒక వెడ:)

ఒక శిష్యుడు—ఇవేళ గురువుగా రిలా వాగేస్తున్నారేమిటి?

రెండో శిష్యుడు—వాగు వలా వుంచు, ఆ తాగు డేమిటి? ప్రయోగానికని పెట్టిన రెండుబుడ్లూ—అదుగో, మూడోదికూడా మూతవిప్పారు!

మా. మరాళీ—(విలువు లేకుండానే) అదుగో—చూడు, చూడు! మెరుపుని మించిన ప్రళయ విద్యుత్తేజం! పసినచోటల్లా భస్మీపటలం-మసి! మసి!-అమోఘమైన మారణకిరణం—పూర్తికావస్తోంది! హ! హ! హ!...హ! హ! హ! (గమ్మున నవ్వాపి) అంతటితో ఆగా ననుకున్నావా? ఊహూ! ఆగలేదు-ఆగను; విరామం లేదు...విశ్రాంతి లేదు...విజయం మీద విజయం—రోజుకో కొత్త విజయం సాధిస్తున్నాను.

దేవుడు—అసలు యుద్ధం ఎవరితోటో!

మా. మరాళీ—(రిచ్చపాటుతో) ఆ! యుద్ధమా?...యుద్ధం!... ఎవరితో టేమిటి? ఆమూలవాళ్లతోటి యీమూలవాళ్లు, యీమూలవాళ్లతోటి యింకో మూలవాళ్లు! అదోరకం—మూలభక్తుల యుద్ధం! తిన్నది అరాయించక కొందరూ, అరాయించుకోడానికేం తిండిలేక కొందరూ. యింకోరకం — పుల్లిస్త్రరావుల యుద్ధం! — ఒకటేమిటి? రకరకాలు! అసలు ముఖ్యవిషయం యుద్ధం—అదీ సంగతి!

(యింకో వెడ:)

ఒక శిష్యుడు—నిషా ఎక్కిపోతోంది!

రెండో శిష్యుడు—మతే పోతున్నట్టుంది!

౧-వ శిష్యుడు— మనిషిలోని కూర్పొచ్చేస్తోంది!

# నీవు తినేదంతా బలమునిస్తుందా?






ప్రతి గృహిణి ఏ ఆహారపదార్థములు శక్తి నిచ్చునవో తెలిసికొనవలెను. డాల్డా పాకశాస్త్రము పుస్తకము (ఇంగ్లీషులో అచ్చు వేయబడినది) 150 ఇండియన్ వివిధ తినుబండారములు తయారుచేయు పద్ధతులతో కూడినది. మిక్కిలి ఉపయోగకరమైన విషయములు గలవు. 4 అణాల బిళ్లలు Dept. D110 P. O. Box 353, Bombay, పంపుడు.



ఔను — ఆహారము బలమునిచ్చును! గాని అన్ని ఆహార పదార్థములు ఒకే విధముగా పుష్టినివ్వవు. కొన్ని బాగా బలము నివ్వగలవు. కొన్ని చాల కొద్దిగా మాత్రమే యివ్వగలవని చెప్పాలి — ఈ కారణంచేతనే ఆరోగ్యంచెడటం సంభవిస్తుంది. సామాన్యముగా బాగా యిష్టమైన ఆహారములు యేమాత్రము బలము నివ్వలేకపోవుటచే వాటిమీద ఆధారపడే వారు పనిపాటలు చేయుటవలనగాని, ఆటలాడుటవలనగాని, అలసట చెందకుండా వుండలేక పోతున్నారు. ఐతే అన్ని ఆహారములు విటమిన్లతోనిండిన డాల్డాతోవండుటవలన మిక్కిలి బలము నివ్వగలవు. డాల్డా ప్రకృతిసిద్ధమైన ఆహారపదార్థములతో కూడినదై మంచి బలమును చేకూర్చి, బలమునివ్వలేని యితర ఆహారముల కొరతను తీర్చగలదు. దీనితో వండినయెడల అన్ని పదార్థములు ఎక్కువ బలము నివ్వగలవు.

## విటమిన్లతోనిండిన డాల్డా బలమునకు

HVM. 33-23-60 Tel

THE HINDUSTAN VANASPATI MANUFACTURING CO., LTD.

# చందా వివరాలు

## దినపత్రిక ఆదివారపు సంచికతోసహా

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంవత్సరం చందా | ... | రు. | 36 | 0 | 0 |
| అర్ధసంవత్సరం చందా | ... | | 18 | 8 | 0 |
| 3 మాసముల చందా | ... | | 9 | 6 | 0 |
| నెల చందా | ... | | 3 | 4 | 0 |

## ఆదివారం వెలువడే వారపత్రిక

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంవత్సరం చందా | ... | రు. | 9 | 12 | 0 |
| అర్ధసంవత్సరం చందా | ... | | 5 | 0 | 0 |

## భారతి (సచిత్ర మాసపత్రిక)

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంవత్సరం చందా | ... | రు. | 6 | 0 | 0 |
| అర్ధసంవత్సరం చందా | ... | | 3 | 0 | |

విడిప్రతి 8 అణాలు.

మా. మరాఠీ—(ఏదో చటుక్కున స్పృహ కొచ్చినట్టు) ఆ!—ఆ!—ఆయుధా లన్నింటికీ ఆధార భూతమైన మహాభూతయుద్ధం—ప్రకృతితో ప్రతినిత్యం నేను సాగిస్తున్నాను—ప్రతిరోజూ విజయాలు సాధిస్తున్నాను! (దేనికో వెదుకుతున్నట్టు) ఏదీ, ఏదీ—ఆ. చూశావా, యీ గాజునాళిక? యిందులో, అసలు జీవరహస్యం—సృష్టికీలకం — పట్టుకోబోతున్నాను. యీమధ్య మహారాజశ్రీ దయ్యం పిగుదాంకితుల పాలనకి పూర్వం మానవులూ, మృగాలూ దేవుడు దేవుడంటూ ఒక అభూతకల్పనతో అటమటలాడేవారే, వాడితో యిక్కడ ముఖాముఖీ కొట్టేస్తా! —అమీతుమీ తేల్చేస్తాను దీంతో! కనిపించని దేవుడు—వినిపించకోని దేవుడు—హా! హా! హా!—హా! హా! హా!—చూస్తున్నావా నా ప్రతిభ?—హా!—హా!—హా!

దేవుడు—(జాలిగా) అజ్ఞానియా—!

మా. మరాఠీ—(ఉలిక్కిపడి) అజ్ఞానినా? —

దేవుడు—(గంభీరంగా) ఔరా! ప్రకృతి అజేయ! సర్వార్థప్రదాయి! (వెళ్లిపోతూంటాడు)

ఒక శిష్యుడు—(రొప్పుతూ) గురూజీ! గురూజీ!

మా. మరాఠీ—ఏమిటేమిటి? ఏమయింది? ఆ వొచ్చిన మనిషేడీ?

శిష్యుడు—ఏసంగతినింతో పారేశాడు! వాడి మాట కాదు, మీరు—మీరు—

మా. మరాఠీ—ఏమిటి? ఏమిటి? నేనేమిటి?

శిష్యుడు—అదే నా సమస్యాను! మీరు యీ కొద్దిసేపట్లోనూ విపరీతంగా మారిపోయారు!

మా. మరాఠీ—మారానా? ఎంత మారాను? ఎక్కడ మారాను? ఏదీ, ఏదీ, పెద్ద అద్దం—భూతద్దం!

(వెళ్లి అద్దంలో చూసుకుంటూ వుంటాడు. యింకో మూలనించి దేవుడి నవ్వు పుగుసుల్లే ప్రయోగ శాలంతా ప్రతిధ్వనిస్తుంది)

దేవుడు—అద్దం కాదు, అంతర్యాం చూడాలి!

మా. మరాఠీ—(ఉలిక్కిపడి) అదుగో! — అదుగో!

ఒక శిష్యుడు — ఎవరు గురూజీ! ఎవరూ లేరే యిక్కడ?

మా. మరాఠీ—వాడే! వాడు! నిజంగా విచిత్ర వ్యక్తే! విచిత్రాతివిచిత్రవ్యక్తి! కనిపెట్టాల్సిన మహా చిత్రం!

శిష్యుడు—వొట్టి భ్రమ! ఎవరూ లేందే యిక్కడ?

మా. మరాఠీ—అబద్ధం! అదుగో, నే చెప్పలే! మన అయోమయయంత్రంలో చుట్టేసుకూర్చున్నాడు! (అంటూ ఆవేపు వెళతాడు)

రెండో శిష్యుడు—(ఆదుర్దాగా) గురూ, గురూ! తప్పమీట నొక్కుతున్నారు! యంత్రం— పొగ — మంట— పేలి—

(అంటూండగానే బ్రహ్మాండమైన ప్రేలుడు ధ్వని. కొంత సద్దుమణిగిన తర్వాతకూడా పిడుగులు పడ్డట్టు మధ్యమధ్య 'ఫభేల్ ఫభేల్'మంటూ వుంటుంది)

ఒకటో శిష్యుడు—గురువుగారి చేతులు — కాళ్లు! అయ్యయ్యో!

మా. మరాఠీ—అద్భుతం! అత్యద్భుతం! నాకు మొదటే తెలుసు వీడో మహాసమస్య అని. యిది విడగొట్టానా, సరికొత్తవి, వంద— వెయ్యి— రహస్యాలు కనిపెట్టేస్తాను! తాకితేనే తునుకలైపోవాల్సిన ఆకిరణం పొడుగునా హాయిగా పడుకున్నాడు! ఇందులో మహత్తు—(అంటూ ఆకిరణంవేపు వెళతాడు)

మూడో శిష్యుడు — (హడలుతో) సార్, సార్! ప్రమాదం! కళ్లు — (అంటూండగానే నెయ్యి ఆవిరియంత్రా లొక్కసారి విచ్చేసినట్టు — సప్తసాగరాలూ సలసల మరిగినట్టు—బీభత్సంగా బుసబుసశబ్దాలు)

మూడో శిష్యుడు — ఏణ్ణర్థం శ్రమ. యంత్రం అంతా తునులైపోయింది! మీ కళ్లు రెండూ పోగొట్టుకున్నారు!

మా. మరాఠీ—అబద్ధం! నాకిదివరకంటే బాగా కనిపిస్తోంది! అదుగో, ఆవిచిత్రవ్యక్తి! కుదించుకుని ఆ గాజుగొట్టంలో కూచున్నాడు — కులుకుతున్నాడు!

నాలుగో శిష్యుడు—అయ్యయ్యో! మా జీవ రహస్యం—సృష్టికీలకం—

(అంటూండగానే గొట్టం ముక్కలయిన చప్పుడు. గాజుముక్కలు గుచ్చెపించివేస్తున్న గరగరశబ్దం)

మా. మరాఠీ—ఓరి మహాసముద్రా! అందులోంచి యిందులోకి దాటావా? అంతమాత్రం చేత వదిలేస్తా ననుకున్నావా? వదలను—వదలను! విడగొట్టితీరతాను!

ఒకటో శిష్యుడు—తోడుకులు, తోడుకులు! — విషగోళం చిదిపేస్తున్నాడు!

రెండో శిష్యుడు—మంట! మంట! కొంపంటుకుంది!

మూడో శిష్యుడు—గురూజీ—గురూజీని—

నాలుగో శిష్యుడు—రండి, రండి! సాయం పట్టండి. (మంటల చిటపట; మధ్యమధ్య ఉరుముల్లా పేలుడు శబ్దాలూ; 'గాస్‌మాస్కు'ల గలగల; శిష్యుల కేకలూ, హాహాకారాలూ. గందరగోళం అంతా క్రమంగా సద్దణిగి మారాన్నించి మాత్రం వినిపిస్తూనే వుంటుంది. ప్రయోగశాలబయట పుష్పోద్యానవనం. 'కొక్కొరోకో' అని ఝాముకోడి నవోదయం ప్రకటిస్తుంది. విచ్చిన గులాబీల చుట్టూ తేనెటీగలు ఝుంకరిస్తుంటాయి. మామిడి పూతలలోనుంచి మధ్యమధ్య 'కూ. ఓ, కూ. ఓ' అని కోయిల కొత్తసంగతులు ఎత్తుకుంటుంది.)

రెండో శిష్యుడు—ఎక్కడికి కప్పుడే? గురూజీకింకా తెలివైనా రాందే—

ఒకటో శిష్యుడు—(విసుగ్గా) ఆ, గురూజీ—గురూజీ! తనంతటివాణ్ణి చేస్తానని తీసుకొచ్చి, చివరికంటా యిల్లా తగలబెట్టేశాడు! యింకెందుకిక్కడ? వెళ్ళి, మహారాజశ్రీ నియోగించిన ఆమారణయంత్రం కాస్తా నేనే పూర్తిచేస్తాను. పేరు, ప్రతిష్ఠ, లక్షరూపాయల బహుమానం—(వెళ్ళిపోతాడు)

మా. మరాఠీ—(తేరుకుంటూ) కొత్త సమస్యలు! ఎన్నో...ఎన్నో...సరికొత్త ప్రయోగాలు! రండి, రండి! బోలెడంత పనుం దవతల!

రెండో శిష్యుడు—గురూజీ, మన ప్రయోగశాల కాలిపోయింది! సాధనసామగ్రి పోయింది!

మా. మరాఠీ—మిగిలిన దాంతోటే సాగిద్దాం! రండి, రండి—క్షణాలు జారిపోతున్నాయి!

రెండో శిష్యుడు—మిగిలిందేమీ లేదు గురూ—మీరూ, మేమూ తప్ప!

మా. మరాఠీ—మీరూ...నేనూ! నేనూ...మీరూ! అంతకన్న ఏం కావాలి? అద్భుతమైన సాధనాలు! మహాద్భుతమైన సాధ్యాలు! అల్లా చూస్తారేం? పదండి, పదండి—కొత్తకొత్త ప్రయోగాలు...సరికొత్త ఫలితాలు!

(అంటూ ఆముక్కలే గొణుక్కుంటూ వుంటాడు)

౬. పిచ్చిపట్టణం : వాకపేట

[గాలివాన: హోరుహోరున అంతకంతకీ హెచ్చిపోతూంటుంది]

దేవుడు—(చినిగిన గుడ్డపేలికలలోంచి పొడుచుకొస్తున్న శల్యాలు: జ్యోతుల్లా మండుతున్న కళ్ళూ—పిచ్చిగాడి అవతారంలో, ఆకలియాత్రతో—) అబ్బా... అబ్బా...ఈ లోకమహిమ — కడుపు దహించుకుపోతోంది. కళ్ళు చీకట్లు కమ్ముకొస్తున్నాయి. చెవులు గళ్ళడిపోతున్నాయి. కాళ్లూ వేళ్లూ చలికి కొంకర్లు పోతున్నాయి. (ఆగి) అదుగో, అదేదో పెద్ద భవనంలా వుంది. చాలా దీపాలు మినుకు మినుకుమంటున్నాయి. అంత దూరం... వెళ్ళాలి ఎలాగో...గాలివాన...ఉష్...అబ్బా.. ...అమ్మా...

(దేవాలయం గంటలు; భక్తుల సహస్రనామాలూ, స్తోత్రాలూ; యువతులంతా జనుల సందడి)

సింహద్వారం దగ్గిర, దేవు డంటాడు: "ఆకలి...ఆకలి!"

ఒకరిద్దరు—ముష్టాడు! ముష్టాడు! అయ్యయ్యో! గుళ్ళో జొరబడుతున్నాడు! ఆపండి...ఆపండి! (కోలాహలం)

(ధ్వజస్తంభం దగ్గిర:)

దేవుడు—ఆకలి!...ఆకలి!

ఒకరిద్దరు—అయ్యయ్యో! మాలాడు!...మాలాడు!...ధ్వజస్తంభంమీద పడుకున్నాడు!

(కోలాహలం)

(మంటపంలో :)

ఒకావిడ—అమ్మయ్యో! దొంగ! దొంగ! నా నాను పేటలు—

దేవుడు—ఆ. క. లి. ఆ . . క . . లి!

ఒకావిడ—దొంగ! దొంగ! పట్టుకోండి!

(గర్భగుడిలోంచి :)

పూజారి—అడియేన్ దాసన్! స్వామీ, ఆరగించు... యీపళ్లూ, పాలూ, ప్రసాదం ఆరగించు! (ఆగి, కొంచెం హెచ్చుగా) అయ్యయ్యో, స్వామి అలక చెందాడు! స్వామి ఆగ్రహించాడు! నైవేద్యం తిరస్కరించాడు!

("మంటపంలో మాలాడు, మంటపంలో మాలాడు" అని కేకలు)

పూజారి—అపరాధం స్వామీ, అపరాధం! అడియేన్ దాసన్!...యిప్పుడే శుద్ధి చేస్తాను!... పుణ్యాహవాచనం చేస్తాను. అడియేన్ దాసన్! అడియేన్ దాసన్!

("మాలాడు, మాలాడు! గుడి మైలపడిపోయింది" "దొంగ, దొంగ, నా నాను పేట" అంటూ కేకలు...కోలాహలం.)

దేవుడు— ఆకలి... ఆ...కలి... ఆపళ్లూ... ఫలాలు! రాసులు!...నాలుగు రాలు!...ఆకలి!... ఆ...క...లి...!

పూజారి—తన్నండి!...తన్ని యీడ్చెయ్యండి దబ్బుని. స్వామి ఆగ్రహించాడు! నివేదన ఆరగించలేదు! తన్నండి, తన్నండి...!

రెండో పూజారి—తంతే మైలపడిపోతాం. ఏం గతి?

పూజారి—కర్రలు...కర్రలు.

యింకో యిద్దరుముగ్గురుపూజార్లు — కర్రలు, కర్రలు! తన్నాలంటే మైలపడిపోతాం! కాలితో తన్నకండి! కర్రలట్టుకు నెట్టెయ్యండి!...నెట్టెయ్యండి!

(కర్రల చప్పుళ్లు)

దేవుడు—ఆకలి! ఆకలి! చలి! గాలివాన!

ఒకావిడ—దొంగ, దొంగ! నా నాను పేటలు!

పూజార్లు—నెట్టెయ్యండి... నెట్టెయ్యండి ... గుడికి దూరంగా...దూరంగా ...

దేవుడు – ఆకలి...ఆ...క...లి...ఆ...క...లి...!

( కోలాహలం. )

# అంతం

## ౧. ఆలోకంలో—దేవపిత కొలువు

దేవపిత—దేవుడి జాడ ఏమీ తెలియనే లేదా?

౧, ౨ దేవతలు— లేదు దేవపితా!

౧-వ దేవత— మీ ఆదేశానుసారం పడమటి దిక్కంతా గాలించి చూశాం.

దేవపిత—పల్లెలూ, పట్టణాలూ—

౨-వ దేవత — భగభగ మండిపోతున్నాయి. పొంగి పొంగి బొబ్బలెక్కి కుళ్లిన మెదడు విషం పుర్రె పగుల్చుకుని ప్రపంచమంతా విచ్చిపోతోంది.

౧-వ దేవత— గాలిఅంతావిషం, గగనంఅంతా విషం, సప్తసముద్రాలలో ఆ విషం, పృథివి ఎక్కడ రేగినా అదే విషపు నెత్తురు! సూర్య చంద్రులకి మసిపూసి, చుక్కలకి కూడా తొడుగులు మాటేసి, చీకటిచాటున చిత్రవధ! - కళేబరఖండాలతో కసాయి వ్యాపారం!

౨-వ దేవత—యింతకి తప్పితే ఆదిశలో యింకేమీ గోచరించలేదు, దేవపితా!

దేవపిత— అంతటా సరిగా వెదకి చూశారా? ప్రార్థనాభవనాలలో, పూజా మందిరాలలో—

౧-వ దేవత — బూజుపట్టుకునిభూతాలువాల్లాడుతున్నాయి. పాపాలమీద బరాతా లమ్ముకున్న డబ్బుతో, కల్లుతాగిన దయ్యాలు కైపెక్కి చిందులు తొక్కుతున్నాయి.

దేవుడు—చాలాదూరం పోవాలి తల్లీ యింకా.

పెద్దమ్మ—వెళ్లొచ్చులే!...ఆ, యిదుగో, మా వెంకాయ్ అప్పుడే లాగూ, చొక్కా తెచ్చింది. (అని అందుకుని యిస్తూ) వేసుకో. ఆ తడిబట్టలు విప్పెయ్యి.

దేవుడు—నాతల్లి, నాతల్లి!...ఇన్నిచోట్ల చూశాను...ఎక్కడికెళ్లినా తిట్లూ, తిరస్కారం! పట్టెడు మెతుకులే దక్కనైపోయాయి. పెట్టేసేవాళ్లేగాని, యీ గాలివానలో తలదాచుకోడానికెక్కడా స్థలం దొరకలేదు. కళ్లోకూడా కూచోనివ్వండా తోసేశారు.

పెద్దమ్మ—అయ్యో, పాపం! అక్కడికెందుకెళ్లావు బాబూ? అది పూజార్లబజారు—టిక్కెట్లు లేందే లోపలికి రానివ్వరు...పడుకో నాయనా, కాస్సేపు పడుకో పాపం!

దేవుడు—వెళ్లాలి, తల్లీ, వెళ్లాలి. నీ ఋణమా అంటూ కోపగించుకోకుండా కొంత అన్నం పెట్టావు కట్టుకోడానికి లాగూ, చొక్కా యిచ్చావు కొత్తకాస్త వెచ్చబడింది ప్రాణానికి, వెళతా యింక.

పెద్దమ్మ—అప్పుడే వెళతావా యింకా. వస్తే ఏమున్నా చిన్నబుచ్చుకోకుండా యిప్పిస్తాను. ఉండు పాపం, మళ్లీ ఏమియిబ్బంది పడతావో!

దేవుడు—అవసరం లేదమ్మా! నీలాంటి తల్లి మళ్లీ ఎప్పుడో పట్టెడు మెతుకు పెడుతుందిలే...ఏంపని తల్లీ, అబ్బాయి?

పెద్దమ్మ—పనేమిటి? అన్నీ పస్తా వాడివే! యీవూరికంతా వాడు పెద్దకే!

దేవుడు—మాడాలి తల్లీ, మాడా లోసారి!

పెద్దమ్మ—మళ్లీ ఎన్నికలొస్తున్నాయికాదూ, యిల్లట్టుకుంటా కారేసుకు తిరుగుతున్నాడు రాత్రింబగళ్లు. పెద్దపెద్దవాళ్ల యిళ్లచుట్టూ తిరుగుతుంటాడు. ఏ అర్ధరాత్రికో వస్తాడు—పడుకో కాస్సేపు.

దేవుడు—(ఆశ్చర్యంగా) దయ్యం అంటారు-?

పెద్దమ్మ—అవును నాయనా, నీకెట్లా తెలిసింది? ఈనేడే యిచ్చారా బిరుదు.

దేవుడు—వెళ్లాలి తల్లీ, వెళ్లాలి! ఏత్రోవలోనో కలుసుకుంటాను. వెడతాను తల్లీ, వెడతాను... చాలాదూరం...చాలా దూరం...

### 3. పిచ్చిపట్టణంమధ్య—మహాసభ

ఒకరు—ఏమండీ పంతులుగారూ, యింకా రాస్తూనే వున్నారే వుపన్యాసం? పెద్ద సంఘసంస్కర్తల మంటారు, వక్తల మంటారు—యింతసేపు వుపన్యాసం రాసుకోవాలి?

పంతులు—అయిపోయింది, అయిపోయింది. "అనాథ శరణాలయం వొకటి కట్టడానికి—"ఏమండీ నాయుడుగారూ, ఈసారి శరణాలయ నిర్మాణానికి ఎంత గ్రాంటు యిస్తా మంటారు?

నాయుడు—క్రిందటిసారి ఎంతిచ్చాం? రెండువేలా? సరే, మళ్లీ యింకో రెండువేలేసుకోండి.. ప్రతిసారీ అనాథశరణాలయమేనంటే గోలగా వుంటుంది, యీసారి మరో పేరేదైనా—

పంతులు—సరే, దానికేం లెండి! పశుసంరక్షణాలయ మందాం..."పశుసంరక్షణాలయానికి రెండు వేలరూపాయలు ధారావిరాళం యిస్తా మనిన్నీ—"

అఖండకవి—అయ్యయ్యొ్యో, కొంప మునిగింది!

నాయుడు—ఏమిటి కవిగారూ, అంత ఖంగారుపడుతున్నారు?

అ. కవి—ఆచొక్కా చిలక్కొయ్య నుండి పోయింది. తొందరలో ఈచొక్కా వేసుకొచ్చేశాను.

నాయుడు—ఏచొక్కా అయితేం యిప్పుడు? అన్నీ వొకటే, కూచోండి!

అ. కవి—యిదేం రాజకీయాలా బాబూ, అల్లా సరిపోడానికి? పద్యాలు...నవరత్నమాలిక... ఆ చొక్కాలో వుండిపోయాయి. యిప్పుడేం చదవను? ఇల్లాసుత్తం అన్ని సూక్తుల్లో నాపుస్తకాలెట్టిస్తా నన్నారు. కోపగించి మానేస్తే యేంగతి?

నాయుడు—భారతభాగోతాల్లోవి ఏవయినా పద్యాలు చదువు.

అ. కవి—భారత భాగోతాలు చదువుకోలేదు.

నాయుడు—పోనీ సహస్రనామాలు, దసరా పద్యాలూ.

అ. కవి—రావు.

నాయుడు— అయితే మళ్లీ రాయి నాలుగు పద్యాలు.

అ. కవి—ఆ పేరుకి యతిప్రాసలు సులభంగా కుదరవు. నవరత్నమాలిక...తొమ్మిది పద్యాలుండాలి. ఏం గతి ?

నాయుడు—ఉష్... గోలచెయ్యకు ! అధ్యక్షులు వచ్చేస్తున్నారు.

(అంతా నిశ్శబ్దం. లాగూ చొక్కా వేషంతో దేవుడు ప్రవేశం)

దేవుడు—అబ్బా, ఎన్ని సేలముం గొచ్చానో...

నాయుడు—ఆల్లా కుర్చీమీదకి దయచెయ్యండి ...మన పార్టీనాయకులంతా వచ్చారు.

అ. కవి—పద్యాలు రాశానండి. మర్చిపోయాను లేపటం! సెలవయితే, వచనంలోనే అంతకంటె బాగా మాట్లాడతాను.

పంతులు— తమ రొక్కసారి చిత్తగించాలి ఉపన్యాసం... మార్పులు చెయ్యమంటే చేస్తాను. మొత్తంమీద కొట్టేసి తిరగ రాయమన్నా రాస్తాను ...పది సంవత్సరాలనాటికి మాత్రం —

రిపోర్టరు—నేను 'పిచ్చిప్రూఫ్' పత్రిక రిపోర్టరునండి. తమ ఉపన్యాసం...ముందుగా ఓకాపీ—

ఒకరు—ఫొటోగ్రాఫర్ రాలేదేం యింకా ?

ఫొటోగ్రాఫర్—ఇక్కడున్నానండి!... ఇంకొంచెం నవ్వుమొహం పెట్టండి...ఒక్కనిముషం !... వన్...టూ...త్రీ... థాంక్స్... సాయంత్రం పత్రికలో వచ్చేస్తుంది !

ఒకరు — పూలమాలలట్టుకొచ్చారా?... ఇలా తెండి...అదిగోండా!... హారతికర్పూరం దండలు.

(సభలో చప్పట్లు.)

నాయుడు — మొత్తం ముప్పయితొమ్మిది సంఘాలవాళ్లూ, సమాజాలవాళ్లూ సన్మానపత్రా లర్పిస్తున్నారు...వేళయిపోతోంది. సభ ప్రారంభించమంటారా ?... (కొంచెం ఆగి గొంతు సర్దుకుంటూ)

"అధ్యక్షా, పిచ్చిపట్టణ వాస్తవ్యులైన సోదర సోదరీమణులారా ! యీనాడు సుదినం...శుభదినం... మనం అంతా — యీ వేలకొద్ది జనమంతా—ఏకగ్రీవంగా యిక్కడ చేరి మన పురపెద్దలైన మహారాజశ్రీ గారి యందు మన కున్న అభిమానం, ప్రేమ, గౌరవం ప్రకటించుకోగలగడం, నిజంగా మన అదృష్టం. . .

(సభలో " వినుడు, వినుడు " అను కేకలు)

యిదివరలో పురపెద్దగా ఎన్నో కొత్తవిషయాలు ప్రవేశపెట్టారు. ఇంకా కొత్తవిషయ మొకటి ప్రవేశపెట్టడానికి బద్ధకంకణులై వున్నారు. పురపెద్దగా ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా యింకా యీ పిచ్చిపట్టణంలో మతివున్నవాళ్లు అక్కడక్కడ దాగి వున్నారు ..

(సభలో "చంపెయ్యాండి, కాలిపించెయ్యండి", "షేమ్...షేమ్..." అని కేకలు)

వుండవలసిందే కాదు... నానాటికీ పెరిగిపోతున్నారు. ఈ మతివున్నవాళ్ల మారణానికి? పురపెద్దగారు కొత్తగా ఒక యంత్రం తెప్పించి, పెద్ద కసాయి దుకాణం స్థాపించబోతున్నారు. మీ అందరి మేలు కోసం, మీ బాగుకోసం, ప్రపంచకల్యాణం కోసం ప్రారంభిస్తున్న యీనూతన సంస్థ మీయందరి అనుమతీ, ఆదరణా పొందగలదనే నా విశ్వాసం——

(సభలో "జో..., జోను" అను కేకలు)

ఆయితే పురపెద్దగారు న్యాయమంత్రులూ, ధర్మశాస్త్రజ్ఞులూ అవసరంవల్ల, అన్నా యీ దుకాణానికి వప్పజెప్పుతున్న ప్రతి మతికలవాడి కొక్కంటికీ యింతని నిరకట్టి వాళ్ల కుటుంబాలకివ్వాలని నిశ్చయించారు. కావున, ఓ పిచ్చిపట్టణవాసులైన మహాజనులారా——

(పెద్దగేటుదగ్గిర 'ఆగండి, ఆగండి' అని కేకలు. సభ అంతా కలకలం. జనాన్ని తోసుకుంటూ హడావుడిగా దయ్యం ప్రవేశం)

దయ్యం—నాయుడూ, నాయుడూ !... ఏమిటల్లా తెల్లబోయి చూస్తావు ? నేనూ మహారాజశ్రీని... దయ్యంబిరుదాంకితుణ్ణి... గుర్తు తెలియటంలేదూ ? యీ దొంగముండాకొడుకు కవడు? ఈ గలభా

అంతా ఏమిటి? ఒక్క నిముషం ఆలస్యమైతే, అంతలో యింత హంగామా జరగనా?

నాయుడు—క్షమించాలి! రోజూ చూస్తుండే నాకే ఆనవాలు భేదం తెలియలేదు! ఆచొక్కా, ఆలాగూ అంతా అదే పోలిక. అచ్చుకి అచ్చు. మీరే ననుకున్నాం!

దయ్యం—ఏమిటే, ఏమిటే, నాచొక్కా, నాలాగూ! దొరికాడు. దొంగ దొరికేడు. రోజూ కోటి పోతుంటే, ఏమయిపోతున్నాయా అనుకున్నాను!... నాయుడూ, వీణ్ణి బంధించు! కొట్లో పెట్టు! ఆరి, దొంగయుండా వాడా! నాచొక్కా, లాగూ తస్కరించి పైపెచ్చు నాకు బాగాలు జాబు అపెదామనుకున్నావా?

దేవుడు—అమ్మా, నేను దొంగనీ కాను, దొరనీ కాను; సామాన్యుణ్ణి! ఆగ్లి యింత అన్నం పెట్టి, తొడుక్కోమని చొక్కా, లాగూ యిచ్చింది.

దయ్యం—ఆ! ఏమిటే, మా అమ్మ యిచ్చిందా? దానికి మతి పోతోంది! నాయుడూ, మన కొత్త గుణకారానికి మొదటి పేరు రాసుకో, మా అమ్మ పేరు...

దేవుడు—అమ్మా, ఆమె నిమీ విలువ తెలియక వీరల్లా అంటున్నారు

నాయుడు—నీకు తెలుసా మనుష్యుల విలువ?

దేవుడు—నాకు తెలిపేందే అది అందుకనే యిలా వచ్చాను.

నాయుడు—భలే, భలే! అయితే, మా కొత్తగుణకారానికి వచ్చే పసుకు విలువ కడుతూంటాం గాని. ఒప్పుకోనంటే పుర్రుకోం!... ఏమంటారు మహారాజశ్రీ!

దయ్యం—సరే, అల్లాంటి వాడి కొస్తే యిబ్బంది వుండక్కర్లేదు.

నాయుడు—ఆహాహా! శాంత బుగ్గులు! నరావతారుడు! "జై, మహారాజశ్రీగారికీ జై! దయ్యం బిరుదాంకితులకీ జై!" అంటూ సభలో కేకలు).

## ర. కసాయిదుకాణం

[మారణయంత్రం జోరుగా హోరెత్తిపోతూంటుంది. తుత్తునియలుగా మానవకళేబరాలు తెగుతూంటాయి. చేతులు, కాళ్లు, పీకలు, పేగులు ఛిన్నాభిన్నంగా ఎగిరిపోతుంటాయి. నేలఅంతటా నెత్తురు వరదలై ప్రవహిస్తూంటుంది. స్త్రీ, బాల, వృద్ధ భేదాలు లేకుండా చస్తున్న జనం ఆక్రందనాలు, హాహాకారాలు బీభత్సంగా మిన్ను ముట్టుతుంటాయి]

నాయుడు—మాదిబ్బ, ఏమిటన్నావు నీ పేరు?.. ఓహో, ఊరూ పేరూ కూడా లేనివాడ వన్నావుగా! భలే ఎత్తులే నిజంగా. సమయాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి ఏదో వూరూ, ఏదో పేరూ తగిలించుకుని చలామణీ కావచ్చు. నేనానేదే పసికట్టాను. నీది బ్రహ్మాండమైన బుర్ర, మా రాజకీయాల్లో బాగా రాణిస్తావని... కొత్తకుం పొచ్చింది. త్వరగా ధరకట్టి పంపు. పొచ్చరా పరుగెదక లోపల యంత్రం వూరికే హోరెత్తుతోంది!

దేవుడు—పసిపిల్లలు... స్త్రీలు...

నాయుడు—సరే అయితే, మూకవుమ్మడిని, ఏదోరకంగా కొట్టెయ్య... వీళ్లెవరింకా? మంద తప్పిన మేకల్లాగ మిడిగుడ్లేసుకు చూస్తున్నారు?

దేవుడు—మహాతత్త్వజ్ఞుడు, కవి, స్వతంత్రవాది...

నాయుడు—మొదటున్న రకం మొత్తంమీద! త్వరగా ధరకట్టు.

దేవుడు—వారికి ధర లేదు!

నాయుడు—మరీ మంచిదయితే! కానీ యివ్వ కర్లేదన్నమాట!.. తిన్నగా యంత్రానికి పట్టించు... అదుగో, మహారాజశ్రీ దయ్యంబిరుదాంకితులు కూడా సమయానికే వస్తున్నారు! కూడా మన కొత్త సైంటిస్టు. ఆయనే కనిపెట్టాడీయంత్రం... ఇల్లాంటివింకా ఎన్నో యంత్రాలు!

(సపరివారంగా దయ్యం ప్రవేశం)

దయ్యం—యంత్రం సరిగా పనిచేస్తోందా? నిముషానికి వెయ్యి కళేబరాలూ తెగుతున్నాయా?

నాయుడు—చిత్తం మహారాజశ్రీ!

సైంటిస్టు—అంతకంటె జోరైన యంత్రం కని పెట్టానండీ మిస్య! నిమిషానికి పదివేలు తేసుతాయి దానిమీద.

నాయుడు—తగినంత సరుకు సప్లయి కాక అప్పుడప్పుడు ఈ యంత్రమే వూరుకోవలసివస్తోందే—

సైంటిస్టు—ఆ భయం అక్కర్లే దికమీద. కొత్తపద్ధతిని గాజుగొట్టాల్లో సరుకు వుత్పత్తి చేస్తున్నాను.

దయ్యం—అయితే యింకేం! అద్భుతంగా వుంటుంది. వల్లి వెంటనే ఆ పెద్ద యంత్రమే అమర్చెయ్యాండి. వెళ్లు.

(జనసమూహం. కోలాహలం అంతకంతకి దగ్గరవుతుంది.)

నాయుడు—మళ్లా యింకో సంస. కొత్త సరుకు! బలే జోరుగా వుంది దీనికి! ఈ పిగపిగ ఒక్క పదిరోజులు యిల్లాగే సాగితే మెదకున్న పురుగుకూడా మెదలకుండా పోతుంది. మాకు అర్థ్రి, ముందుగా ఈ ముసలాడికి నరకట్టు: దాన్ని బట్టి తతిమా వాళ్లని కూడా తోసెయ్యొచ్చు.

(జనసమూహం, దేవపితా, పరివారం దేవుడి ముందుకి తోసుకొస్తారు)

దేవుడు—కనతాను. ఇప్పుడే [illegible] అసలు నర కట్టి చూపిస్తా. ఆ ముసలాడి విలవ—

దేవపిత—ఆ! ఆ! ఏమిటీ ఘోరం? దేవుడా, నువ్వుండేనా యిక్కడ?

౧-వ దేవత—మానవమారణహోమం...

౨-వ దేవత—కుప్పతిప్పలుగా కళేబరకుండాలు...

౩-వ దేవత—పుర్రెలు, బొమికలగుట్టలు...

౪-వ దేవత—ఆక్రందనాలు, హాహాకారాలు.

దేవపిత—నేల అంతటా నెత్తుటి గడ్డలు!

దేవుడు—అవును తండ్రీ, అంతకీ అంతా కావలసిందే! తప్పదు!

దేవపిత—ఏమిటి దేవుడా, ఏమంటున్నావురా? ఒకప్పుడు కళ్లు తెరిచి చూడమన్నాను నిన్ను. ఇప్పుడు కళ్లు మూసుకోమనవలసివస్తోంది. మూసుకుని మననం చేసుకో ఒకసారి...అసలు అవతారకారణం...

(మారాన్నించి పాట)

"పురుషు డాత డొకండె
పొలతి నే నొక తెనే
లోకాలు నాలోని
లోలమై పోయేను..."

అదుగో, నిన్ను వెతుక్కుంటూ దేవికూడా ఈ వేపుకే వస్తోంది.

దేవుడు—ఆమె గానం చేస్తున్న విలయ సంహారాస్త్రం దాపరించింది. అందుకే వస్తోంది దేవి.

సైంటిస్టు—(గాభరాగా ప్రవేశించి) మహారాజశ్రీ! మహారాజశ్రీ! పెద్ద యంత్రం అమర్చడం అయిపోయింది! కాని, [illegible] తప్పిన వేగంతో దానంతట అది తిరిగిపోతోంది!

దేవుడు—సెహబాష్! యింకా జోరుగా నడవాలి. (యంత్రధ్వని హెచ్చిన హోరు) ఇంకా జోరుగా...యింకా...యింకా...

దేవపిత—దేవుడా, దేవుడా, నాయనా యిదా నాశమైన మానవసృష్టి—

దేవుడు—మానవజాతికి కీర్తనంగా పత్రికల తేసిపోయింది.

దేవపిత—అయితే, మానవుడు కానప్పుడు...?

దేవుడు—నాశమాన్యమే నా కర్తవ్యం. అదుగో, యంత్రం వేగం హెచ్చిపోతోంది... అదుగో!... అదుగో!.. లయమైపోయిన మానవరాశి లయంలో పడుతోంది. పంచభూతాలూ విజృంభిస్తున్నాయి. ప్రళయం కమ్ముతోంది.

(యంత్రంహోరు అంతకంతకు హెచ్చిపోయి, పెద్దగా పేలిపోతుంది. క్రమంగా పృథివీబంభ్రమణం, జలప్రళయం, అగ్ని పెటపెట, గాలిహోరు, ఆకాశగర్జనం సముద్రకెరటాలలాగ ఒకదానిలో ఒకటి లీనమై చివరికి ఓంకారంగా రూపొంది నిలుస్తాయి)

# వరుణుని యాగడము



= శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు =

గత (జ్యేష్ఠమాసపు) భారతిసంచికలో వర్ణించిన ఉత్తరహిందూస్థానకన్యావివాహపు సందర్భమున వరుని జాతకము నాకు లభించినది కాదనియు, అది లభించెనేని ఆ వధూవరుల వివాహము ఇంద్రావరుణుల దుశ్చేష్టాఫలమను నాకర్షణముచే సంఘటింపఁబడినదిగా నిరూపించుట సులభమనియు మనవిచేసుకొనియుంటిని. అప్పటికి చాలకాలమునుండియే నానావిధములుగ ప్రయత్నించుచుంటినను, దూరదేశమగుటంజేసి నా ప్రయత్నములు సఫలములు కాకపోవుటచే విసిగి, అది లేకయే ఆవ్యాసమును ముగించితిని. విశేష మేమియు లేని సామాన్యజాతకముల నెన్నియైన సంపాదించవచ్చునుకాని, జీవితమున కొంత వైచిత్ర్యమో, వైలక్షణ్యమో కలవారి జాతకములను సంపాదించుట మన దేశమున చాల కష్టసాధ్యమయిన పని. అట్టి జాతకములను పరిశీలింపఁజేయుట శాస్త్రాభ్యుదయమునకు అత్యవసర మనియు, తన్మూలమున లోకకల్యాణమునకు సహాయకారి యనియు తలఁచు నుదారహృదయము కల స్త్రీపురుషులు మన దేశమున నరుదనుట యనుభవములోనిది. "అయ్యా, తమ భార్య మతాంతరము చేరి మారుమనువు కట్టుకొన్నదఁట. ఇట్టి పరిస్థితి ఏల వచ్చెనో పరీక్షింపవలయు నని నా కాశ కలదు. దయచేసి తమ జాతకముల నిప్పించెదరా" అని భర్తనుకాని, "అమ్మాయీ, భార్యాభర్తలకు మీకు సరిపడదఁట. మీ దాంపత్యములో నేమి లోప మున్నదో యని కుతూహల మున్నది. మీ జాతకముల నిచ్చెదవా" అని భార్యనుకాని సూచించినచో, ఇప్పటి మన సాంఘికపరిస్థితులలో కలుగు ఫల మిట్టిదని చదువరులు సులభముగ నూహించుకొనఁగలరు. అంతదనుక యేల! ఆకస్మికముగా నగ్నిప్రమాదము పాలయిన యొక సువాసినినిగూర్చి గత వైశాఖమాసపు భారతిసంచికలో వ్రాసినది పాఠకమహాశయులు మరచియుండరు. ఆకన్యకకు వివాహమయిన ముహూర్తమందే పెండ్లిజరిగిన మరియొక బంగారువంటి వధువు సయితము మించుమించుగ ఆకాలప్రాంతమందే, అట్టి పరిస్థితులలోనే అగ్నిప్రమాదముపాలయ్యెనను శోచనీయమగు వార్త వింటిని. ఆ వధూవరుల జాతకములను సంపాదించి, వివాహముహూర్తపు కుండలితో పోల్చి, నాయూహలను పాఠకలోకమున కర్పింపవలెనను కుతూహలముతో నాచేసిన ప్రయత్నము లొక్కటియైనను నేఁటిదాఁక ఫలింపలేదు. ఫలించు ననునాశ సయితము కానరాకున్నది. ఇది నా గ్రహచారఫలమనుకొందును.

మన దేశమున నీ శాస్త్రాభ్యున్నతికిఁ గల ప్రతిబంధకములలో పైకష్ట మొకటి. పరిశోధనమునకు వలయు సాహాయ్యసంపత్తివిషయమునయిన ఘోరదారిద్ర్యమట్లుండ, సామగ్రిని సంపాదించుటసయితము సులభము కాదు. పాశ్చాత్యదేశములలో నిట్టి లోపము సామాన్యముగ కానరాదఁట! గర్భాధానకాలమునకు జన్మకాలమునకుఁ గల సంబంధమును పరిశీలింపవలయునని కోరిక లండనుపట్టణమున బెయిలీ అను శాస్త్రవేత్తకు జనించినది. యుక్తవయస్సులో నుండి, సౌభాగ్యమయిన వర్తనము కలిగి, విశ్వాసార్హమగు శీలస్వభావములు గల తరుణీమణుల జాతకముల నతఁడు నూర్లకొలఁది సంపాదించినాఁడు. తాను సలుపుచున్న శాస్త్రపరిశోధనముల విషయమును విశదీకరించి, ప్రతిమాసరజోదర్శనము, పురుషసంయోగము, శిశుజననము - వీని కాలముల నెప్పటికప్పుడే నికరముగా దినచర్య వ్రాసియుంచి తన కీయవలసినదిగా నా శాస్త్రజ్ఞుఁడు కోరఁగా, వందలకొలఁది యువతులు సంతోషముతో నంగీకరించి యట్లు వ్రాసి అతని కిచ్చిరఁట. అనేకసంవత్సరము లిట్లు సామగ్రిని నేకరించి, పరిశీలించి, కార్యకారణములను చర్చించి, ఆమహనీయుఁడు ఆధానకాలమునకు జన్మకాలముతోఁ గల సంబంధమును తెలుపునట్టి సూత్రములను నిర్ణయించి "Pre-

"Natal Epoch" అను నొక యుద్గ్రంథమును వ్రాయఁ గలిగెను. శాస్త్రపరిశోధనవిషయమున జనసామాన్యమున కిట్టి యాదర ముండుటఁబట్టియే, ఆ దేశములలో శాస్త్రాభివృద్ధి సర్వతోముఖముగా నేఁటికాలమున జరుగుచుండుట. మరి మన దేశమున—?

పోనిండు. ఎట్లో ప్రయాసపడి నా మిత్రుల సాహాయ్యమున ప్రశంసలో నున్న తరుణి భర్త జాతకము మూఁడు దినముల క్రిందనే సంపాదింపఁ గల్గితిని. స్పష్ట గ్రహభావములను పోల్చుటలో చదువరుల సౌకర్యమునకై భార్యాభర్తల సాయన జాతక కుండలుల నొకటికింద నొకటిగ నీ క్రింద నుదాహరించితిని:—

| | | | |
|---|---|---|---|
| శ ౨౬-౩౬<br>ను౧-౩౯ | | కు ౧౭-౪ | |
| గు ౨౦-౨౯<br>ర౪-౫౫<br>బు౨-౫౭<br>కే౫-౪౧ | వధువు జాతకము<br>(సాయనము)<br>అయనాంశలు<br>౨౨ భాగలు<br>౪౯ కలలు | | రా ౫-౪౧<br>X౧౩-౦<br>ఇ౨౬-౧౦ |
| శు౫-౩౩ | చ ౧-౫౦<br>I ౧౧-౩౦<br>లగ్నము | | |

| | | | |
|---|---|---|---|
| | | రా ౪-౪౬<br>కు ౧౫-౫౨<br>శ ౧౯-౪౩ | I ౫-౨<br>లగ్నము |
| X ౨౪-౩౦<br>చ౧౨-౩౬<br>వ ౨౬-౩౭ | వరుని జాతకము<br>—<br>(సాయనము)<br>అయనాంశలు<br>౨౨ భాగలు<br>౩౫ కలలు | | ఇ ౨౨-౧౩<br>ర౧౬-౫ |
| | కే ౪-౪౬<br>గు ౬-౪౪ | | బు౧౩-౧౨<br>శు ౨౫-౨౩ |

[ ఈ కుండలులలో చూపఁబడిన అయనాంశలను తీసివేసినచో నిరయన స్పష్ట గ్రహభావ స్థితులు సాధించుకొనవచ్చును.]

వరుఁడు నిండుపున్నమ నాఁడు జనించినవాఁడు. పరస్పర సమసప్తకమున రవిచంద్రులు చతుర్థ దశమ కేంద్రముల నాశ్రయించినారు. రవికి కేంద్రమున చంద్రుఁ డున్నచో నధమయోగ మని మనవా రనిరి.

" అధమసమవరిష్ఠా న్యర్క కేంద్రాదిసంస్థే
శశిని వినయ విత్తజ్ఞాన ధీ నైపుణాని."
(వరాహమిహిరుఁడు)

ధనాధిపతి యగు చంద్రుఁడు దశమకేంద్రమున నుండుట జాతకుఁడు ధనవంతుఁడు, ఆజ్ఞాపరుఁడు, ఖ్యాతివంతుఁ డని తెలుపును. చతుర్థాధిపతి రవి స్వక్షేత్రమం దున్నాఁడు కాన గృహ క్షేత్రాది వసతికి లోప ముండదు. లగ్నాధిపతి బుధుఁడు స్వక్షేత్రమున ప్రబలుఁడుగ నుండుటచే విద్యాబుద్ధుల కే కొదువయు నుండదు. కాన, ఈ గుణముల కధమయోగము పట్టిన దనరాదు. శనికుజుల సంయోగము ద్వాదశ భావమునఁ గలదు. చలచల మగ్గు నూనెలో చన్నీరు పోయుట వంటి దీ యోగము. దీనిచే స్వభావములో నొకవిధము పెడుసుదనము, కాఠిన్యము, క్రౌర్యము వచ్చునని పాశ్చాత్యు లనిరి. శత్రుత్వము వచ్చినచోట చేయు పనులలో తమకుఁగాని, పరులకుఁగాని కాయక్లేశము కలుగునని ఈయోగము గలవారికి స్ఫురించదఁట! యుద్ధరంగము నలంకరింపవలసిన సైనికున కిది యెంతయు తగిన దనవచ్చును. ఈ శని కుజ సంయోగమునకు సారావళి చెప్పిన ఫల మిది:

" ధాత్వింద్రజాలకుశలః
ప్రపంచకస్తేయకర్మకుశలశ్చ,
కుజసౌరయోర్విధర్మ
శ్శస్త్రవిషఘ్నః కలిరుచిస్స్యాత్."

ఈ కుజశను లిరువురికిని పరస్పరము సమసప్తకమున నున్న రవిచంద్రులపై గుప్త శత్రుదృష్టి గలదు. కాన, పై అధమయోగపు ఫలము కుజ శని సంయోగ ఫలము నాశ్రయించియుండును. రవిచంద్రుల పరస్పర కేంద్రవర్తిత్వముచే శక్తి సామర్థ్యాదులకు లోపముండ

పనిలేదు కాని, ఇతర గ్రహ శుభవీక్షణ సాహాయ్యము లేనిచో ఆ గుణములను పురోభివృద్ధికై సద్వినియోగ పరచుకొను నైపుణ్య ముండదు. మనస్సంకల్పములకు (చంద్రసూర్యులకు) పరస్పరము పొత్తు కుదరమిచే నిట్టి ఫలము సిద్ధించునఁట! ప్రత్యేకము లయిన అభిరుచులు, ఆశయములు, ఆదర్శములు కలిగి, సర్వవిధముల భిన్నస్వభావము గల స్త్రీతో —అగ్నిసాక్షికముగనో, ఆకాశసాక్షికముగనో— వివాహబంధము సిద్ధించుటవలన జీవితము క్లేశకరముగ పరిణమించు నని ఈ యోగపు ఫలమును పాశ్చాత్య జ్యోతిష శాస్త్రవేత్తలు వక్కాణించిరి. అది యట్లుండె.

సప్తమభావము నింక విచారింతము. కళత్రస్థానాధిపతి (గురువు) వృశ్చికరాశిలో శత్రుభావమున కేతుసంయోగము నొందినాఁడు. దీనికి మంచి ఫలము చెప్పుట కష్టము.

"దారాధీశే షష్ఠగే మృత్యుగే వా
రుగ్ణో నిత్యం క్రోధయుక్త స్సదారార్తః,
సౌఖ్యం స్వప్నే ప్యస్య నస్యాత్ కథంచి
ద్వారస్త్రీభి ర్వా ధనస్య క్షయ స్స్యాత్."
అని 'సంకేతనిధి.'

కళత్రకారకుఁడగు శుక్రుఁడు పంచమభావములో నున్నాఁడు. వ్యయాధిపతి యగుటచే నీ శుక్రునిచే పంచమభావమునకు కీడే.

"వ్యయనాథ సుతభేవా,
లాభేనాపత్యసౌఖ్యవిధుర స్స్యాత్,
దత్తక్రీతసుతాద్యై
ర్మణిముక్తాద్యైశ్చ నిర్వాహః" (సంకేతనిధి)

సంతానఫలము మాత్రమే కాక తత్కారణ మగు విషయసుఖమును సయితము పంచమభావము తెలుపునని పాశ్చాత్యు లనిరి. కళత్రస్థానమునకు లాభస్థాన మగుటచే, కళత్రమునుండి కలుగులాభమును పంచమభావము చూపఁజాలినందున నీయుక్తి సమంజసముగ చూపట్టును. ఇట్టి పంచమభావఫలమున ఉత్తేజన మిచ్చు శుక్రుఁడు కన్యారాశిలో నుండుటచే నీచుఁడైనాఁడు. నీచశుక్రుని ఫలము 'సారావళి' యిట్లు వర్ణించినది:

"స్త్రీసంభాషణమధురః
ప్రణయజనగణనార్థకృతయత్నః
నారీషు దుష్టరతిషు
ప్రణయీ దీనో నసౌఖ్యభోగరతః,
కన్యాయాం భృగుతనయే
తీర్థసభామండితో జాతః."

శుక్రునకు దాపరించిన వ్యయాధిపత్యము పంచమభావస్థితి, నీచరాశిప్రాప్తి - వీని ధర్మములను సమన్వయము చేసినచో స్త్రీలతోటి వ్యవహారమున నైపుణ్యము కానవచ్చినను, సత్ఫలము చేకూరుట కష్టమని తేలఁగలదు.

విశేష మేమన, ధర్మస్థానమున నున్నవాఁడు వరుణగ్రహము. వీనిని చూచునది జిత్తులమారి ఇంద్రుఁడు. అన్నివిషయములయందును స్వయంనిర్ణయసూత్రము వరుణునిది. ఇతరులు నిర్ణయించిన ధర్మసూత్రములు వీనికి గిట్టవు. ఇట్టి వరుణగ్రహము పరిపూర్ణత్రికోణదృష్టితో శుక్రుని చూచుచున్నది. శుక్రవరుణసంబంధము అవివాహితలగు తరుణుల నతిసులభముగా నాకర్షించు శక్తినిచ్చునఁట! వరుణుని యుపజ్ఞ యంతయు శుక్రుని నాకర్షించుటలో వ్యక్తమగును. ఇది యొక దుర్గుణ మని కాని, లోప మని కాని చెప్పుట వాంఛనీయము కాదు. ప్రేమమయ దాంపత్యజీవితమును పోషించుటకు వలసిన యితరధర్మము లుండునెడల, ఈగుణము నేటి సాంఘికనైతికస్థితులలో చాలయోగ్యముగ పరిగణింపఁదగిన దనుటకే ఆక్షేపము నుండదు.

కాని, చంద్రరవుల సమసప్తకస్థితితో చేయి కలుపుకొను కుజశనిసంయోగ మున్న జాతకమున, ఇంద్రుని మోహవాగురలకు లోనయిన నీచశుక్రునిపై నుపజ్ఞాశాలియగు వరుణునికిఁ గల ప్రబలాకర్షణపు ఫలపరిణామమును మన మిచట గమనింపవలసియున్నది. యుద్ధరంగములో పడకటింటినో, పడకటింటిలో యుద్ధరంగమునో సమకూర్చుటకు తగినట్లున్న దీ యోగము!

మరియొక్క మాట. యుద్ధరంగమునఁగాని, దాంపత్యరంగమునఁగాని జయాపజయములను గూర్చి విమర్శింపఁబూనినచో ఒకపక్షమువారి యోగ్యతాయోగ్యతలు, బలాబలములు, నీతిదుర్నీతులు మాత్రమే

గమనించుట చాలును. కాన, ప్రశంసలో నున్న పురుషుని జాతకముతో స్త్రీజాతకమును పోల్చిచూచినఁగాని వారి వివాహానంతర ఫలపరిణామముల నూహింపలేము. బ్రతికినన్నాళ్లు ప్రథమభార్యను పడరాని హింసలు పెట్టి సాగనంపి, చిన్నభార్య చేతి పొరకతో చామరము వీచినా సెబాసని మెచ్చుకొను మహనీయులను మన మెందరి నెఱుఁగము? ఇట్టి దృష్టాంతములలో మొదటి భార్య పోయినంతనే భర్త తన యఖండకల్యాణ గుణములను తటాలున మార్చుకొనెనని యర్థము కాదు. సుగుణములో, దుర్గుణములో పుట్టిననాఁటివి పుడకలతోఁ గాని పోవందురుగదా? ఆ గుణములతో నదుకుకొనలేక ప్రథమజాయ బాధపడిన దనియు, అతఁడు సంపాదించుకొని రెండవ భార్య రాజ్యమేలిన దనియు మనము గ్రహింపవలసియుండును.

ఇఁక, కన్యజాతకమును వరజాతకముతో పోల్చి చూతము. పొంతనములలో-స్వాతీశ్రవణములకు-౩౬టికి ೨೩೩ గుణములు వచ్చుటచే నక్షత్రానుకూల్య సంపత్తి బాగుగనే చేకూరిన దనవచ్చును. నూటికి ఉత్తమ వంతున గుణములు వచ్చినచో నేపరిస్థితులలోనైన ప్రథమకక్ష్యలో సంస్థిరత లభించినట్లేకదా? గ్రహమైత్రియా, పూర్ణముగ నున్నది (శనిశుక్రులు పరస్పర మిత్రులు). స్వాతీశ్రవణములు రెండును సాధునక్షత్రములే. (రెండును దేవగణమునకు చెందినవి) మరి దాంపత్యానుకూల్య మెట్లు పరిణమించినదో చదువరు లెఱుఁగుదురు.

పొంతనముల నట్లుంచి, ఈదంపతుల స్పష్టలగ్నగ్రహములను పరస్పరముగ పోల్చి చూడుఁడు! కన్యకజన్మ శుక్రునకు (సౌఖ్యకారకునికి) వరుని జన్మశని (దుఃఖకారకుఁడు) సరిగా పూర్ణచతుర్థకేంద్రమున కూర్చున్నాఁడు. ఈ మెసుక్రునకు భర్తశని యేమి వర మిచ్చునో మన మూహించుకొనఁగలము. చాలదని కన్యక సప్తమస్థానముననున్న కుజునిపై భర్తజాతకపుశని యధిష్ఠించినాఁడు. ఈవివాహముచే భర్త ఏస్థానమున నీ తరుణి సంపాదించుకొన్నది కుజుని శీలమును కొంత యలవరచుకొన్న శనిమహాశయుఁడు! భర్తగారికి భక్తితో భార్య సమర్పించుకొన్నది సయితమిందుకు తగినట్లే యున్నదని చదువరులు గుర్తింపఁగలరు. ఈమె జాతకమున ధనుస్సులో ౨౫-వ భాగలో నున్న శని భర్తజాతకమున సరిగా సప్తమ (భార్యా) స్థాన కేంద్రమునే ఆశ్రయించియుండుట చిత్రము! ఆహా! దాంపత్య మన్న నిట్లుండవలయును. భార్యపాలికి భర్త శని, భర్తపాలికి భార్య శని!!

వరుని జన్మచంద్రుఁడు కన్యకజన్మరవిసంయోగము నందుట సామాన్యముగ దాంపత్యమునకు శ్లాఘ్యమైన యోగము. ఖగోళమున చంద్రసూర్యులు భార్యాభర్తలుగదా! కాని ఈజాతకములలో (పురుష)చంద్ర (స్త్రీ) రవుల కున్న యంతరము ౮ భాగ లగుటచే నీయోగము వెల యత్యల్పము. కాక శనికుజుల క్రూరదృష్టి యీరవిచంద్రులపైఁ బడుచున్న కారణము వలనను, కన్యజాతకమునఁగల రవిచంద్రుల శత్రుదృష్టి వలనను ఈయోగము సత్ఫలదాయి కాలేదు.

ఇట్టి పరిస్థితులలో సామాన్యముగ వధూవరు లొకరి నొకరు రాకర్షించుట యరుదు. మరి వీరికీ వివాహబంధ మెట్లు వచ్చినది? మంచిచెడ్డల నూహింపలేని బాల్యప్రాయమునవైన వివాహమా కాదు వీరిది. విద్యాబుద్ధులలో వధూవరు లిరువురును గడితేరినవారే. ఈ ప్రశ్న కుత్తరమిచ్చుటకు మన మింద్రాకరుణుల నాశ్రయింతముగాక. వారిదే అఘటనఘటనాసామర్థ్యము! ఇంద్రగ్రహపు సమస్తకదృష్టిచే కన్యజాతకమందలి శుక్రునికి అందరాని పంక్తి నాశించు ముగ్ధత సిద్ధించినది. వరుని జాతకమునందలి శుక్రుఁ డుండునది కన్యారాశిలో ౨౫ భాగల ౨౩ కల లగుటచే, ఆ శుక్రుఁడు వధువుజాతకమందలి వరుణుని పరిపూర్ణసమ సప్తకశత్రుదృష్టిపాతమునకుఁ జిక్కినాఁడు. ప్రేమవిచారమునపైతము వరుణునిది మూఁడవ మార్గమే! శుక్రవరుణుల త్రికోణదృష్టి సంబంధము పరిపూర్ణముగ వరుని జాతకమం దుండుటంబట్టి యీయోగమునకు ప్రోదిచేసినట్లయినది. ఇట్టి యోగముచే బద్ధులయిన స్త్రీపురుషులు ప్రథమదర్శనమువలననే మోహపాశబద్ధు లగుదురు. వారి దృష్టికపు డితరప్రపంచమే కానరాకుండును. వివాహబంధము తగిలించుకొని, ఆనందబ్రహ్మము తమ సొమ్మే యని నమ్మి వారు మైమరతురు. ఇట్టి వధూవరుల జాతకములలో, ఇతరశుభగ్రహ దృష్టియోగ

ములు పరస్పరముగ కలిగెనేని, వారు రంభానలకూ బరులను మరపింతురేమో ? కాని, మన కథానాయకు లుండునది శనిగ్రహసామ్రాజ్యమున ! పిడుగు పని చేసిన ట్లూపిరి తిరుగనీయక వరుణుండు తన పాశముల నొడ్డి పనిచేయుచుండఁగా "కానిమ్ము. నెమ్మదిగా చూతముగాక." యని యపు డూరకుండి క్రమక్రమముగ శని తన యధికారమును తాను చూపఁగలిగి నాఁడు. కళకళలాడుచున్న యీవధూవరుల కోమల ప్రేమలతను క్రమక్రమముగ శనైశ్చరుఁడు పట్టి, బిగించి, కృషింపఁజేసి, తుదకు త్రుంచివైచినాఁడు!

ఇచట నొక ప్రశ్న కవకాశ మున్నది. "పై చెప్పిన గ్రహసంబంధములు జన్మకాలము నాఁటివి గదా? ఇవి యున్నా నూరకుండి ౧౯౪౨-వ సంవత్సరమున మాత్రమే ఏల మిడిసిపాటుపడినవి?" అని యడుగవచ్చును. సత్యము. ఈయోగము లన్నియు జన్మకాలిక పరస్పర గ్రహములకు చెందినవే. దినవర్గ దశా పద్ధతితో చలితగ్రహభావము తేవయున్న జన్మకాలీన సంబంధముల నగ్నీకరింపమనో, అవయమునకే వానికి ఫలము సిద్ధించుట. ౧౯౪౨-వ సంవత్సరమున వరుని జాతకమున చలితదశమకేంద్రము మీనరాశి ౨౫౦ భాగలకు వచ్చుటచే వరుని జాతకమందలి ముగ్ధచంద్రుని కెదురువచ్చినది. అప్పుడే వరుని చలితచంద్రుఁడు మీనరాశిలో ౨౬-వ భాగకు వచ్చి, అతని చలితదశమస్థానమును చేరుకొని జన్మచంద్రుని కెదురుపడినాఁడు. అనఁగా, ఆ చలితచంద్రుఁడు వధూపుజన్మవరుణుని సంయోగము నొంది వరుని జన్మచంద్రునితో సరిగా ౧౮౦ భాగల శత్రుదృష్టిని, అతని జన్మవరుణునితో ౬౦ భాగల మిత్రదృష్టిని పొందుటే కాక, తాత్కాలికవరుణునికి సయితము ౬౦ భాగల దూరమున నిలిచినాఁడు. అనఁగా వధూవరుల వివయమున చేయనెంచిన కార్యమును కొనసాగించుటకు వరుణుని ప్రేరేపించినాఁడనుట. తత్ఫలముగ వరుణుఁడు తన పని సాధించినాఁడు.

వధూవరుల జాతకములలో నొకరి కుజుఁడు, మరియొకరి శని - వీరికి పరస్పరశత్రు సంబంధ ముండెనేని అట్టి వధూవరుల వైవాహిక సంబంధము తొలుదొలుత హృదయంగమమై, ఉత్కంఠాపూరితమై, ఆశాజనకముగ చూపట్టిననేమి, క్రమక్రమముగ ప్రేమ మాయమై, అనూయగ మారి, ద్వేషముగ పరిణమించి, క్రౌర్యమున పర్యవసానమందునని రాబ్సన్ మహాశయుఁడు వ్రాసిన మాటలు మరువరానివి. ఈసూత్రమిచట బాగుగ నన్వయించుచున్న దని చదువరులు గుర్తింపఁగలరు.

ఈవరున కిది రెండవ వివాహమని యిపుడు తెలిసినది. దినవర్గ దశాపద్ధతితో వరుని లగ్నభావము చలించి ౧౯౪౦-వ సంవత్సర ప్రాంతమున మిథున రాశిని వదలి కటకరాశి ప్రవేశము చేసినది. దీనితో తొలివివాహపు ముచ్చట తీరి దాంపత్య జీవితములో ప్రథమాంకము ముగిసియుండనోపు. ౧౯౪౨-వ సంవత్సరమున దశాపద్ధతిచే కలిగిన గ్రహచలనపు ఫలము మనము కనుగొంటిమిగదా ? అదియే యీవివాహమునకు కారణము. మరు సంవత్సరమందే (౧౯౪౩ లో) వరుని జాతకమున చలితదశమ భావము కన్యాజాతకమందలి వరుణస్థానమును జొందినది. ప్రబలమయిన ఆకర్షణాపకర్షణ శక్తి వరుణగ్రహమునకు చెందిన దని మనము మరువరాదు. వరుని శుక్రునితో సమసప్తకమున నున్న యీవరుణుఁడు వీరి కపుడు విప్రలంభమును దెచ్చియిచ్చినాఁడు. దీనితోపాటు, శని కుజ సంయోగంపు క్రౌర్యద్వేషానూయలుపయితము ఫలించియుండు ననుట కే సంశయము నుండదు. ఈ రెండవ యంకముపై యవనిక జారిన దెప్పుడో తెలియదు. ౧౯౪౩-వ సంవత్సరపు జూన్ మాసమున ౨-వ తేదీనాఁడు వచ్చిన సూర్యేందుసంగమము (అమావాస్య) మిథునరాశిలో ౧౨-వ భాగలో భర్తజన్మవరుణునికి సార్ధకేంద్రస్థానమున (౧౩౫ భాగలు) పడినది. ఈసంయోగము భర్తజన్మచంద్రునికి త్రికోణమున వచ్చుటచే జన్మకాలికచంద్రసూర్యులు చేసిన వాగ్దానము చెల్లించుటకు మంచి అదనయినది. అప్పుడే భార్యశుక్రునకు, భర్తశనికి సరిమధ్యమున (అనఁగా, మేషరాశి ౪౨ భాగ) కుజుఁడు (భార్యలగ్నాధిపతి) చారవశమున వచ్చి నిలిచినాఁడు. ఆ శుక్రశనుల కుండునది శత్రుదృష్టికదా? తత్ఫలమును పరిగ్రహించుటకై కుజుఁడు వారి మధ్యమున చేరినట్లు కాన

వచ్చును. వరుణుఁడు చారవశమున మిథునరాశిలో ౭-వ భాగకు (భర్తలగ్నమునకు) వచ్చుటయయిన మప్పుడే! "ఊరక నే ఊగే తల్లి ఊరిదేవర నాడు మరింత ఊగినది." అన్నట్లున్నది. స్వాభిమానము, స్వైరవర్తనము, స్వాతంత్ర్యప్రీతి ఇవి మితిమీరి పెడదారి బట్టు యోగ మిది. వరుణమహాశయుఁ డీగుణముల నుత్తేజన మిచ్చుకాలమున, అతనికి పరిపూర్ణశత్రుస్థానమున (ధనుస్సు ౭-వ భాగలో) భార్యజాతకమున నున్న శని గుటకలు మ్రింగుచు నూరకుండఁగలఁడా? సమయమునకై వేచి యున్న భార్యజాతకపు శని కిపుడు వరుణునితో నాకాశరంగమున ముష్టాముష్టి, బాహాబాహి, కేశాకేశి జరుగదా? ఇట్టి పరిస్థితులలో నీభార్యాభర్తల వైవాహికజీవిత మీరంగమున నెట్లు సామరస్యమున నడువఁగలదు? కాన, ఈఅమావాస్యాప్రాంతమందే ఈభార్యాభర్తలు విడిపడి యుందురేమో యని నాయూహ. ఏలన, ఆయమావాస్యకు మరుదినమే తాత్కాలికశత్రుఁడు భర్తజాతక వరుణుని కెదురువచ్చి సమస్తకశత్రుదృష్టిని పొందును గనుక. ఆకర్షించిన శత్రునిపై అపకర్షణము చూపుటకు వరుణుని కప్పుడేకదా మంచితరుణము?

భార్యజాతకమున వివాహకాలమునకు వచ్చిన యింద్రగ్రహమాయాచేష్టనుగూర్చి గడచిన వ్యాసములో విన్నవించితిని. భర్తజాతకమందలి వరుణగ్రహము వైవాహికజీవితమునఁ గావించిన యాగడము నిపుడు పాఠకమహాశయులు గమనించియుందురు. పొంతనములు చూచి మనువులు కుదుర్చు సమయములో "పాశ్చాత్యుల గ్రహము లివి మన కేల" నని ఇంద్రావరుణాలను మనము నిరాదరించితిమేని, అనేక సందర్భములలో అమాయికసాధుశీలలగు వధువుల కోమలజీవితములను నిష్కారణముగ నాశనముచేయు ఘోరపాతకమున కొడిగట్టుదుమేమో యని నాభయము.

ఒక్క మాట! పాశ్చాత్యులీగ్రహములను సృజింపలేదు. ఇవి విశ్వామిత్రసృష్టి కాదు. యంత్రసాహాయ్యమున, గణితసాహాయ్యమున పాశ్చాత్యులీగ్రహములను కనుగొనిరి. జాతకభావములలో వీని ధర్మములను అనుభవముమీఁద నిర్ణయించిరి. యంత్రసాహాయ్యమున మనముసయితము వీనిని చూడవచ్చును. ఫలముల ననుభవమునకుఁ దెచ్చుకొనవచ్చును. శాస్త్రజ్ఞానమునకు పాశ్చాత్యులేమి, పౌరస్త్యులేమి! "యుక్తియుక్తం వచో గ్రాహ్యం బాలాదపి శుకాదపి" అను సూక్తి మన పెద్దలు చెప్పినదేకదా?



## తేయాకు కథ నెం. 9.



గృహమునందు తేనీరు సేవించువేళ.

# గమ్యస్థానము

మా ఫ్యాక్టరీలలో పాళ్లు కలుపబడి ప్యాకింగు చేయబడిన తేయాకు దేశమంతటను మా స్వంత అమ్మకముదార్ల ద్వారా బట్వాడా చేయబడుటకు సిద్ధముగా నుండును.

భారతదేశమందలి ముఖ్యకేంద్రము లన్నిటగల మా డిపోలనుండి మా అమ్మకముదార్లు తేయాకును తీసికొందురు. మా ఫ్యాక్టరీలనుండి తాజా తేయాకు తిరిగి డిపోలలో నించబడుచుండును.

ఈ విధముగా కొనువారికి తాజాసరుకు శీఘ్రకాలములో అందజేయబడుచుండుట చేత మీకు సేవించుటకు తాజా అయిన, సౌరభముగల తేయాకు నమ్మకముగా లభ్యమగుచున్నది.

బ్రూక్ బాండ్ తేనీరు తయారుచేయునప్పుడు, అప్పుడు కాచిన నీటినిమాత్రమే వాడి తేయాకును నాలుగునిమిషములు మాత్రమే మరుగనిండు.

# బ్రూక్ బాండ్

# ఆనితల్లికలువచేరుశాసనము

(గతసంచిక తరువాయి)

❀

= శ్రీ నేలటూరి వెంకటరమణయ్య =

(౧)కాకతి వంశము: వంశోత్పత్తి:—శాసనోక్త కాకతిరాజ చరిత్రమున వారి వంశమునకు మూలపురుషుఁడు కుష్మాండితీగయందు పుట్టినట్లు ౨౧-వ శ్లోకమునందుఁ జెప్పియున్నది.

"కాకత్యాః పరశక్తేః
కృపయా కూశ్మాండవల్లికా కాచిత్,
పుత్ర మసూత తదేత
త్కులమనఘం కాకతియ్య సంజ్ఞ మభూత్."

ఈ శ్లోకము కాకతీయులను శూద్రు లని సూచించుచున్న దని శ్రీ జయంతి రామయ్యగారు వ్రాసియున్నారు. "ఇంతియు కాక కాకతి యను పరాశక్తి కృపవలన నొకానొక కుష్మాండితీగ కొడుకు నొకనిఁ గనె ననియు, వాని వంశ మా కారణమున కాకతీయవంశ మయ్యె ననియుఁ బ్రస్తుత శాసనమున నీవంశమున కమానుషోత్పత్తి కల్పింపఁబడుటకూడ నీ యూహను (కాకతీయులు శూద్రులను) దృఢపఱచుచున్నది....సామాన్య వంశమునఁ బుట్టినవా రున్నతస్థితికి వచ్చిన పిదప తమ వంశమున కదివఱకు లేని మాహాత్మ్యమును గల్పించుకొన్నందున కుదాహరణము లనేకము గలవు.[15]

కాకతీయులు శూద్రు లని యన్యాధార మూలమున నిశ్చయమైన కావచ్చును. కుష్మాండితీగ కథ మాత్రము వారు శూద్రులని నిర్ధారణ చేయుట కెంత మాత్రమును సహాయకారి కాఁజాలదు. కథ వంశమాహాత్మ్య ప్రకటనకై కల్పింపఁబడలేదు; కులదేవతతోడి సంబంధమును దెల్పుటకై నిర్మాణము గావింపఁబడినది. కాకతీయులు దుర్గోపాసకులు. దుర్గాదేవి సమస్త ప్రపంచమునకుఁ బోలె వారికిని తల్లి. ఇతరులకంటె తమ కా జగన్మాతపై నెక్కువ భక్తి గల దనియు, నా జగన్మాతకుఁ దమయందు పుత్రవాత్సల్యము గల దనియు నమ్మి తా మామెకు పుత్రుల మని నమ్మిరి. కూశ్మాండము కేవలము కుష్మాండితీగ మాత్రము గాదు. కూశ్మాండీ నామాంకిత యగు దుర్గాదేవి కునికి పట్టు. ఈ భావమే కుష్మాండితీగకథయందు గూఢరూపమున దాఁగియున్నది. కావున ఈకథ నాధారపఱచుకొని కాకతీయులు శూద్రు లనుటకు వలనుపడదు.

వంశచరిత్ర: ఇందు వర్ణింపఁబడిన కాకతివంశ చరిత్ర మసంపూర్ణము; మధ్య గణపతిపాలనతో నారంభమైనది. తత్పూర్వపు రాజుల నీప్రశస్తిరచయిత యేల పేర్కొనలేదో తెలియదు. గణపతియు, నతనికిఁ దరువాత నతని కుమారిత రుద్రమదేవియు, పిమ్మట నామెదౌహిత్రుఁడగు ప్రతాపరుద్రదేవుఁడును రాజ్యము సల్పినట్లు చెప్పఁబడియున్నది. ఇందు క్రొత్తవిషయము లెవ్వియు లేవు. కాని ౨౬-వ శ్లోకమునందు ప్రతాపరుద్రునికి 'నరపతి' యను బిరు దుండినట్లు చెప్పియున్నది:

"గజపతి రుత్కళనాథః
పాశ్చాత్యాధీశ్వరోఽశ్వపతిః
తాభ్యాం నరపతి రధికః
ప్రతాపరుద్రో యతస్త్రిలింగేశః"

పై శ్లోకమునం దుక్తమైన 'గజపతి' 'అశ్వపతి' 'నరపతి' బిరుదములు కడు ప్రాచీనములు. ఇందు 'గజపతి రుత్కళనాథః' అని చెప్పియున్నది. కాని వాస్తవముగ నీబిరుదు కళింగాధీశ్వరులది. కాటయ వేమారెడ్డి గాంగవంశీయులగు కళింగగజపతులను నుత్కళమునకు నెట్టి చిలుకసముద్రముపర్యంతము గల యాశ

15. ఆం. సా. పరి. పత్రిక సం, ౨ పుట ౯౩.

త్కళింగదేశమును స్వాధీనపఱచుకొనెను; అప్పటి నుండియు మన శాసనకాలమువఱకును నాదేశము రెడ్డి రాజుల స్వాధీనమం దుండెను. గజపతి బిరుదాంకితులగు కళింగగాంగరాజుల యధికార మస్వ ముత్కళదేశమందే చెల్లుబడి యగుచువచ్చిన కారణమున నీప్రశస్తి కారుఁడు 'గజపతి రుత్కళనాథః' అని చెప్పియుండును. కళింగ మేనుఁగులకు చిరకాలమునుండియుఁ బ్రసిద్ధి నందినది. కళింగరాజబలమంతయు నతని యేనుఁగుల దళముపై నాధారపడియుండుటచేత నతనికి గజపతి యని పేరు వచ్చెను. కళింగోత్కళనాథులకుఁ దప్ప మఱి యీ బిరుదే రాజుల కుండినట్లు తోఁచదు.

'అశ్వపతి' యని బిరుద మాద్యమున కాన్యకుబ్జేశ్వరులగు గూర్జరప్రతీహారులకును, దరువాతి మాళవ పారమారులకును, అనంతరము దేవగిరి యాదవులకును నుండెను. అశ్వబల మధికముగ నుండుటచే నీబిరుదు వచ్చినట్లు తోఁచుచున్నది. ప్రస్తుతశ్లోకమున 'పాశ్చాత్యాధీశ్వరోఽశ్వపతిః' అని యున్నది. పాశ్చాత్యాధీశ్వరు లనఁగా తురకలు. మహమ్మదీయుల శక్తి యంతయు వారి యశ్వదళముపై నాధారపడియుండినది. ఢిల్లీ సుల్తానులు లక్షలకొలఁది గుఱ్ఱములఁ గొని కాపాడుచు వచ్చిరి. ఇచటఁ జెప్పఁబడిన పాశ్చాత్యాధీశ్వరుఁడైన యశ్వపతి ఢిల్లీ సురత్రాణుఁడు.

ఇఁక 'నరపతి' బిరుదము రాష్ట్రకూటుల కుండినట్లు తోఁచుచున్నది. మాన్యఖేటపురమును రాజధానిగ నేలిన రాష్ట్రకూటచక్రవర్తుల కందఱికిని నరేంద్రదేవుఁ డను బిరుదుండినట్లు వారి శాసనములవల్ల తెలియవచ్చుచున్నది. వీరి యధికారమును గూలఁద్రోసి, సామ్రాజ్యము నాక్రమించుకొని కల్యాణకటకమును రాజధానిగ ప్రజాపాలన మొనర్చిన పాశ్చాత్య చాళుక్యచక్రవర్తులు తాము నరపతుల మని చెప్పుకొనిరి. కాకతీయు లాద్యమున కల్యాణిచాళుక్యులకు సామంతులై యుండి కాలక్రమమున వారి యధికారము క్షీణించఁగా స్వతంత్రులైనది యందఱకును దెలిసిన సుప్రసిద్ధచరిత్రాంశమే. వరాహలాంఛనమువలె నరపతిబిరుదమును కల్యాణిచాళుక్యుల దగ్గరనుండియే కాకతీయులకు సంక్రమించియుండవలయును; కాని వీరికి నరపతిబిరుదుండినట్లు ఈశాసనమునం దొకచోఁ దప్ప మఱియెచ్చటను గానరాకపోవుటమాత్రము చిత్రమే.

మహమ్మదీయ అవాంతరము:—ప్రతాపరుద్రునితో కాకతీయుల దొరతనము సమాప్తినందినది. మహమ్మదీయులతోడి యుద్ధమున నితఁ డోడి వారిచే బందీకృతుఁ డాయెను. అంతట వారు హిందూస్వాతంత్ర్యమును గూలఁద్రోసి దేశము నాక్రమించుకొనిరి. ఈ వృత్తాంత మీశాసనమందు ౨౭-వ శ్లోకమున వర్ణింపఁబడినది.

“తస్మిన్ ప్రతాపరుద్రే
స్వస్థానం స్వేచ్ఛయైవ యాతవతి,
అస్సా ధరా యవనమయీ
జాతైవాహో మహోమహో మహిమా”

ఈశ్లోకమును బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులవారు ఇట్లాంధ్రీకరించినారు :

“ఆ ప్రతాపరుద్రుఁడు స్వేచ్ఛచేతనే (తురుష్కుల కోడిపోయి యుద్ధాదులవలన మృతుఁడు కాలేదనుట) స్వర్గస్థుఁడు కాఁగా భూమి తురుష్కాక్రాంత మాయెను” 16

'స్వేచ్ఛచేతనే' అను మాటకు శ్రీప్రభాకరశాస్త్రి గారు వ్రాసిన వ్యాఖ్యానము తప్పు; చరిత్రకు విరుద్ధమైనది. ప్రోలయనాయకుని విలసతామ్రశాసనమందు ప్రతాపరుద్రుఁడు యుద్ధమునఁ దురుష్కుల కోడిపోయి వారిచే బందీకృతుఁడై ఢిల్లీకిఁ గొనిపోవఁబడుచుండఁగా మార్గమధ్యమున సోమోద్భవ, అనఁగా నర్మదానదీ తీరమున మృతినందినట్లున్నది. 17 ఈవిషయమునే షంసీ షిరాజి అఫీఫ్ అను మహమ్మదీయ చరిత్రకారుఁడు కూడ తన తారీఖ ఫీరోజ్ షాహీ అను చరిత్రమునం దుల్లేఖించియున్నాఁడు. కావున శ్రీ ప్రభాకరశాస్త్రులవారి వ్యాఖ్య యంగీకరింపఁదగినది కాదు. ఇఁక మహమ్మదీయులచే బందీకృతుఁడుగాఁ గొనిపోఁబడుచున్న ప్రతాపరుద్రుఁడు మన ప్రస్తుత శాసనమునఁ జెప్పినట్లు

---

16. శృంగార శ్రీనాథము : పుట ౪౬.

17. భారతి సం. ౧౫, భాగ. ౧. పుట ౩౧౧.

'స్వేచ్ఛచేతసే' స్వర్గస్థుఁ డగుట నిజమేని యతఁ డాత్మహత్య గావించుకొనెనని చెప్పవలసియున్నది.

(౨) నాయక రాజులు:—తురుష్కుల స్వాధీనమునఁ ద్రిలింగదేశము స్థిరముగ నిలువలేదు. సముద్రమున మునిఁగియుండిన భూమిని ఆదివరాహునిబోలి యవనాక్రాంతమైన హిందూరాజ్యమును ప్రోలయనాయకుఁ డుద్ధరించెను. ఈశాసనములోని ౨౮-వ శ్లోకమునం దిట్లు చెప్పియున్నది:

"వరాహవ ద్వారిధినాభిమగ్నాం
ధరా మశేషాం యవనోదరస్థాం,
సముద్ధరన్ ప్రోలయనాయకేంద్ర
స్తతః ప్రతిష్ఠాపయతిస్మ కిద్వత్."

ఇతఁడు కాలగతి నందినవనుక కాపయనాయకుఁ డితని రాజ్యమును పాలించెనఁట.

"స్వర్గాతిథౌ ప్రోలయభూమిపాలే
విశ్వేశ్వరాష్ట్రా మధిగమ్య గత్వా
అపాలయ త్కాపయనాయకేంద్ర
స్తదీయరాజ్యం తనతి ప్రతాపః"

ఈ ప్రోలయ, కాపయ నాయకు లెవ్వరు? వీరు యవనాక్రాంతమైన త్రిలింగదేశము నెట్లుద్ధరించిరి? అను విషయములు విచారణీయములు. ఈశాసనము నాంధ్రసాహిత్య పరిషత్పత్రిక ద్వితీయసంపుటమునఁ బరిష్కరించి ప్రకటించు సందర్భమున కీ. శే. శ్రీ జయంతి రామయ్యగారు ఇట్లు వ్రాసియున్నారు:

"ప్రతాపరుద్రునితో కాకతీయరాజ్యము సాంతమయినది. తురుష్కులు ప్రతాపరుద్రుని జయించి యాతని దేశములోఁ గొంతభాగము నాక్రమించుకొనిరి. దూరదేశముల నానానాయకు లాక్రమించి స్వతంత్రముగాఁ బాలింపసాగిరి. వారిలో ప్రోలయనాయకుఁ డొకఁడు. అతఁడు గతించినపిదప నాదేశమును కాపయ యను నాయకుఁడు పరిపాలించెనఁట. అతని క్రింద డెబ్బదియయిదుగురు నాయకు లుండినట్లును, కాపయనాయకుని యనంతరము వా రాతని దేశమును విభజించి స్వాధీనపఱచుకొన్నట్లును . . . నీశాసనము వలనఁ దెలియవచ్చుచున్నది. ఇదివర కెచ్చట నీ కాపయనాయకుని పేరు వచ్చియుండలేదు. ప్రోలయ కాపయలకు . . . చుట్టఱిక మేమయిన నుండెనేమో తెలియదు. తురుష్కు లాక్రమించుకొనఁగా మిగిలిన కాకతీయ రాజ్యమంతయు కాపయ నాఁటిదనుక యేకముగా నున్నట్లే యిందువలన దెలియుచున్నది." 18

శ్రీ రామయ్యగారు వ్రాసినప్పుడు ప్రతాపరుద్రుని మరణానంతర మాంధ్రదేశమున జరిగిన సంగతు లెవ్వియో ఎవ్వరు నెఱుఁగరు. అప్పటి స్థితిగతులను దెలుపు నాధారము లెవ్వియు వారికి చిక్కలేదు. మహమ్మదీయచరిత్రలు కొన్ని యాకాలపు త్రిలింగదేశచరిత్రను వర్ణించియున్నను దోషభూయిష్ఠములగుటచే వాని మూలమున వాస్తవస్థితిని గనుగొనుట కప్పుడు సాధ్యము గాకపోయెను. కావున రామయ్యగారు శాసనశ్లోకముల యర్థమును చక్కఁగఁ జేసికొనఁజాలక కొన్నిచోట్ల నపార్థము గావించిరి.

ఈ నాయకుల శాసనము లిటీవల కొన్ని లభించినవి. అందు ముఖ్యమైనవి రెండు తామ్రశాసనములు. వీనిలో మొదట పేర్కొనఁదగినది ప్రోలయనాయకుని విలస తామ్రశాసనము. ఆంధ్రదేశ మధ్యయుగ చరిత్ర రచన కిది యమూల్యమైన సాధనము. ప్రతాపరుద్రుని మరణానంతరము త్రిలింగదేశ స్థితిగతులును, హిందూస్వాతంత్ర్య పునస్స్థాపన విధానమును గనులకు పొడగట్టినట్లిందు వర్ణింపఁబడినది. సంక్షేపముగ నందలి విషయ మిది: ప్రతాపరుద్రుఁడు ఢిల్లీ పాదుషహా యగు మహమ్మదు సురత్రాణునకోడి బందీకృతుఁడై ఢిల్లీకిఁ గొంపోవఁబడుచుండి మార్గమున నర్మదాతటమున మృతి నందెను. తురుష్కులు త్రిలింగదేశము నాక్రమించుకొని యచటి జనులను బలువిధములుగ హింసింపసాగిరి. అప్పుడు చతుర్థకులమున మునునూరి వంశమునఁ బుట్టిన ప్రోలయనాయకుఁ డను శూరుఁడు తురుష్కులను దేశమునుండి వెడలఁగొట్టి హిందూధర్మమును, హిందూస్వాతంత్ర్యమును గాపాడెను. ఇతనికి కాపయనాయకుఁడు మొదలయినవారు కొందఱనుజు లుండిరి. వారు రాజకార్యములయందు సహాయులై వర్తించుచుండ నితఁడు గోదావరి ప్రాంతమందు మాల్యవంత పర్వత సమీప

18. ఆం. సా. పరి. పత్రిక. సం ౨. పుట ౯౯.

మందలి రేకపల్లి రాజధానిగ రాజ్యము సల్పెను.[19] రెండవది కాపయనాయకుని గురజ తామ్ర శాసనము. ఇందు ముసునూరి వంశము సంపూర్ణముగ వర్ణింపఁబడి యున్నది. చతుర్థాన్వయమున పోతనృపతి పుట్టెను. అతనికి పోచక్షితీశుఁడు, దేవరాజు, కామాధిపుఁడు, రాజభూపుఁ డను నలువురు పుత్రు లుద్భవించిరి. వీరియందు పోచ నరపతికి ప్రోలక్షితీశ్వరుఁడును, ఎఱపోతభూపాలుఁడును నను తనయు లిర్వురును, దేవరాజునకు కాప నృపతియు, ముమ్మడీశ్వరుఁడును నను కొడుకు లిద్దరును, కామక్షితీశ్వరునకు ఇమ్మడీశ దేవప్రభువు లను కుమారు లిరువురును, రాజనృపునకుఁ ద్రోయ్యేటినగరాధిపతి యగు ననపోతభూపాలుఁ డనునతఁడును జన్మించిరి. ఈ సహోదరులందు ముసునూరి ప్రోల నరపాలుఁడు ధరణీచక్రముపై నేకచ్ఛత్రాధిపత్యము సల్పెను. అతని యనంతరము కాకతీయందలి విశ్వపతి ప్రసాదముచేత కాపనృపతి భూపరిపాలన మొనర్చెను. ప్రతాపరుద్రునితోఁ దుల్యమైన ప్రభావము గల ఈ కాపభూపాలుఁడు ఏకశిలా నగరమందు వసించుచు అశేషమైన ఈ భూమిని శాసించెను.[20] గురజ శాసనమున వర్ణింపఁబడిన వంశవృక్షము నిట్లు లిఖింపవచ్చును :




శ్రీ జయంతి రామయ్యగా రనుకొనినట్లు తురుష్కులు ప్రతాపరుద్రుని జయించి యాక్రమించుకొన్నది యాతని దేశములోఁ గొంతమాత్రము గాదు. కాకతిరాజ్యము సర్వము వారికి హస్తగతమాయెను. ప్రోలయనాయకుఁడు కాకతిరాజ్యాంతర్గతమార ప్రాంతముల నాక్రమించి యచట స్వతంత్రుఁ డాయె నని రామయ్యగారు వ్రాసిరి. ఈ శాసనమున స్పష్టముగ "వరాహవ ద్వారిధివారిమగ్నాం ధరా మశేషాం యవనోదరస్థాం సముద్ధరన్" అని చెప్పియుండఁగా దానికి విరుద్ధముగ రామయ్యగా రిట్లేల వ్రాసిరో తెలియకున్నది.

ప్రోలయనాయకుఁడు దేశభక్తుఁడు ; స్వాతంత్ర్యప్రియుఁడు. దేశము నాక్రమించుకొని, దేవాలయములను విరుగఁబొడిచి, విగ్రహములను ఛిన్నభిన్నము గావించి, దేవబ్రాహ్మణవృత్తుల నపహరించి యజ్ఞాది వైదికకర్మలను సాగనీయక, ప్రజల సర్వస్వమును దోచికొని నిరంతరము సురాపానము గావించుచు గోమాంసమును మెసవుచు స్త్రీల మానభంగమును గావించుచు సర్వజనకంటకులగు విజాతీయులగు తురకల చేష్ట లతనికి హృదయవిదారణము లాయెను. తురకలను వెడలనడచి దేశమున స్వాతంత్ర్యమును, సనాతనహిందూధర్మమును పునరుద్ధరించుటకు బద్ధకంకణుఁడాయెను దేశస్వాతంత్ర్యస్థాపనకై ఇతఁడు ప్రయత్నమొనరించుచున్నాఁడని విని జను లితనికి బాసటయై నిలిచిరి. అచిరకాలముననే సముద్రతీర దేశమును దాస్యమునుండి తొలఁగించి మరల స్వతంత్ర రాజ్యమును స్థాపించెను. తురక లాక్రమించుకొనిన దేవాదాయబ్రహ్మదాయములను యథాపూర్వముగాఁ దీసియిచ్చి వైదికకర్మల జరుపుటకును, దేవాలయముల యందు పూజాపురస్కారముల నడపుటకును దగు నేర్పాటులను గావించెను ; కాని తలపెట్టిన కార్యము సంపూర్ణముగఁ గొనసాగుటకు మునుపే ప్రోలయ నాయకుఁడు కాలగతి నందెను. తీరప్రాంతములనుండి తఱుమఁగొట్టఁబడినను, మహామ్మదీయు లింకను సంపూర్ణముగ దేశమును విడిచిపోలేదు.

ప్రోలయనాయకుని నిర్యాణమువల్ల నాతఁడు దలపెట్టిన కార్యము నిలిచిపోలేదు. అతనికి చేదోడై సర్వవిధముల నతనికి గార్యనిర్వహణయందు సహాయుఁ

19. భారతి సం. ౧౯. భాగ ౧. పుటలు ౩౦౭-౧౪. ఈ శాసనగ్రంథమునకుఁ జక్కని యాంధ్రీకరణమును శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారిందు ప్రకటించియున్నారు. శాసన ప్రాశస్త్య మిందువల్ల తెల్లము కాఁగలదు.

20. భారతి, సం. ౧౧, పుట ౯౮౫.

డైయుండిన అతని పితృవ్యపుత్రుఁడగు కాపయ కార్యభారమును వహించెను. కాపయనాయకుఁడు ప్రోలయ నాయకుని మించినవాఁడు; అపారశక్తిసంపన్నుఁడు; రాజ్యతంత్రమర్మజ్ఞుఁడు. ప్రజలయందైకమత్యము కుదురనిది దేశదాస్యవిముక్తి సంపూర్ణముగఁ గాఁజాలదని యతఁడు గ్రహించెను. దేశమునందచటచట సంస్థానముల నేలుచుండిన నాయకులను జేరదీసి దేశమునందుత్సాహమును వారి హృదయమునఁ బాదుకొల్పెను. అందరును గాపయనాయకుని నాధిపత్యము నంగీకరించి మహమ్మదీయులతోఁ బోరాటమునకు సంసిద్ధులైరి. కాపయనాయకుని నాధిపత్యము నంగీకరించి దేశస్వాతంత్ర్యస్థాపనకై నడుముకట్టుకొనిన నాయకులు డెబ్బదియేవురు.

"అష్ట పంచోత్తరసప్తతి
నాయకసంసేవ్యమానపదపద్మః,
కాపావనీశ్వరః శ్రీ
విశ్వేశ్వరకరుణయా క్షితి మరక్షత్."

అను శాసనశ్లోక మీవిషయమును స్పష్టపఱచుచున్నది. ఆంధ్రనాయకుల నందఱిని ఏకముఖము చేసినంతటనే కార్యము సులభముగ సఫలము గాదని యతఁడెఱుఁగును. శత్రువు మహాబలవంతుఁడు. యావద్భారతభూమి నేలు చక్రవర్తి. బలసంపదతోఁబాటు ధనసంపదయు నతనికి మెండు. ఎన్నియేండ్లైనను వెనుదీయక యుద్ధమును నడుపు నుపపత్తి యాతనికిఁ గలదు. అట్టి శత్రునితో ముందువెనుకలు జింతింపక డీకొనుట యుక్తము గాదు.

దక్షిణమున రామేశ్వరముదాకను, బశ్చిమమున నరేబియాసముద్రముపర్యంతమును వ్యాపించియుండు దక్షిణాపథమంతయు మహమ్మదీయులచే జయింపఁబడి ఢిల్లీసామ్రాజ్యములోని కడఁకువరై యుండినను, కర్ణాటకమునమాత్రము హిందువుల యధికారము సంపూర్ణముగ నాశనము గాలేదు. ఆకాలమున కర్ణాటకముపైఁ బ్రభుత్వము నేయుచుండిన ముమ్మడిబల్లాలరాయఁ డన్యదాక్షిణాత్య హిందూరాజులవలె రాజ్యభ్రష్టుఁడు గాక కాలానుగుణ్యముగ మహమ్మదీయుల కనువర్తియై కప్పముగట్టుచు ఢిల్లీసుల్తానుల మన్ననకుఁ బాత్రుఁడై యుండెను. అతఁడు కార్యకాఁడు. శత్రువు బలవంతుఁడైనప్పుడు లొంగినను అణుమాత్రమేనియు సత్వహీనత గాన్పించిన వానిఁ గూలద్రోయుటకు వెనుదీయువాఁడు కాఁడు. మఱియు బల్లాలరాయని యధికార మొకకర్ణాటమందుమాత్రమే కాక కొల్లడపర్యంతము వ్యాప్తమైన ద్రావిడదేశమునందును జెల్లుచుండెను. పాండ్యసామ్రాజ్యము నాశనమైనపిమ్మట మధురయు కొల్లడమువఱకును గల దేశమంతయు మహమ్మదీయులకు వశమైనను, దానికి ఉత్తరమున నుండు రాష్ట్రము సంబువరాయలాక్రమించుకొనిరి. బలవంతులును, ఉపపత్తిపరులును నైన మధురసుల్తానులతో వారు సమానస్కంధులు గాకపోవుటచే బల్లాలరాయని నాశ్రయము సంపాదించుకొని యతని నాజ్ఞాబద్ధులై యుండిరి. కావున ఇంతటి పలుకుబడి గల బల్లాలరాయఁడు తన యుద్యమమునకుఁ దోడైనచో దాక్షిణాత్యహిందువుల నేకముఖము జేసి దక్షిణదేశమున నొక్క తురకపురుగు సంచరనీయక వెడలఁదఱుముట సులభమని గ్రహించి కాపయనాయకుఁడు రహస్యముగ బల్లాలరాయని దర్శనార్థ మతని రాజధానియగు ద్వారసముద్రమునకుఁబోయి యతనికి దన యుద్యమమును దెలియఁజెప్పి యతని సహాయమును కోరెను.

బల్లాలరాయఁడు దన హితులను, సామంతులను బిలిచి మంత్రాలోచన యొనర్చి మహమ్మదీయులను దేశమునుండి వెడలఁగొట్టుటకును, నష్టమైన దాక్షిణాత్య స్వాతంత్ర్యమును మరల స్థాపించుటకును నిశ్చయించి, కాపయనాయకునికిఁ గొంత సైన్యమును సహాయ మొసఁగి త్రిలింగదేశమున కంపెను. ఈసైన్యముతోఁ గూడ నతఁడు స్వదేశమునకుఁ దిరిగివచ్చి తన యనుయాయులగు డెబ్బదియేవురు నాయకులను గలసికొని మహమ్మదీయులపై నడచి వారి నోడించి త్రిలింగదేశమును స్వాధీనపఱచుకొని యోరుగల్లు నిజరాజధానిగ రాజ్యము నేయ నారంభించెను. 20 a

(3) రెడ్డిరాజులు :—రెడ్డిరాజ్య స్థాపనను గూర్చి మన శాసనమున నిట్లు చెప్పియున్నది:

---

**20 a. Early Muslim Expansion in South India pp. 163-191.**

"విశ్వేశ్వరాయ వివిధాం ప్రవిధాయ సేవాం
యాతే విభౌ దివిచ తత్పదసేవనాయ
తై ర్నాయకై స్స్వనగరా ణ్యధిగమ్య సర్వై
స్సంరక్షితా గతవిరోధకథైః స్వదేశాః.

తేషాం వేమనరేశ్వరః క్షితిభుజాం
ధర్మాత్మనా మగ్రణీ
శ్శశ్వ ద్భారతవిష్ణుపురాణకథా
జ్ఞాతాంతరంగ స్సుధీః
శ్రీమత్పంటకులోద్భవ శ్శివపద
ద్వంద్వైకసేవాపరో
విప్రాశీర్వచనోన్నతో
జితరిపు స్సూర్యజ్జ్వలత్ప్రతాపోదయః"

ఈ రెండు శ్లోకములవల్ల కాపయనాయకుని మరణానంతర మాతని గొల్చిన డెబ్బదియేవురు నాయకులును వారి వారి నగరములకుఁబోయి యెవ్వరి దేశము వారు సంరక్షింపఁదొడఁగి రనియు, వారిలో నొక్కఁడును, పంటకులోద్భవుఁడునునగు వేమనరేశ్వరుఁడు అనఁగా వేమారెడ్డి వారివలెనే నిజనగరమునకుఁ బోయి స్వదేశమును బరిపాలింప నారంభించె ననియుఁ దెలియవచ్చుచున్నది. కాపయనాయకుఁడు క్రీ. శ. ౧౩౩౫ మొదలుకొని ౧౩౬౫ ప్రాంతమువఱకును రాజ్యమొనర్చినట్లు చరిత్రాధారములు సూచించుచున్నవి. ఇతఁడు క్రీ. శ. ౧౩౫౫ వఱో, యించుక పూర్వమో బల్లాలరాయని సందర్శించుటకు ద్వారసముద్రమునకుఁ బోయి న్యు క్రీ.శ. ౧౩౩౬ నందు ఢిల్లీ సుల్తాను సైన్యముల నోడించి తెలుఁగుకొట్టి యోరుగంటిని త్రిలింగరాజ్యమును స్వాధీనపఱచుకొనెను.[21] క్రీ. శ. ౧౩౪౫ నందు ఓరుగల్లు నిజరాజధానిగ నాంధ్రదేశము నేలుచుండెను.[22] మఱియు నితని భృత్యులగు ఉప్పలపుం బ్రోలులెంక, ఎఱపోతులెంకల గణపేశ్వర పిల్లలమఱ్ఱి శాసనములవల్ల నితఁడు క్రీ.శ. ౧౩౪౬, ౧౩౫౭ సంవత్సరములలో రాజ్యము నేయుచుండె నని తెల్లమగుచున్నది.[22a] మఱియు క్రీ. శ. ౧౩౬౦-వ సంవత్సరమునందు జల్లిపల్లి యుద్ధమున మృతినందిన రేచర్లదాచయసింగమనాయని కుమారుఁడైన మాదానాయఁడు భీమవరముకడ జరిగిన రణమున నితని జంపెనని వెలుగోటివారి వంశావళియందుఁ జెప్పియున్నది.[23] కావున కాపయనాయకుఁడు రమారమి క్రీ. శ. ౧౩౩౬ మొదలు ౧౩౬౫ వఱకును రాజ్యము జేసెనని చెప్పవచ్చును. పైనుదాహృతములైన మన కలువచేరు శాసన శ్లోకముల ప్రకారము వేమారెడ్డి క్రీ. శ ౧౩౬౫-వ సం.న రాజ్యమునకు వచ్చియుండవలయును; కాని వేమారెడ్డిగారి శాసనములు దీనికి విరుద్ధముగ సాక్ష్యము బల్కుచున్నవి. ఇప్పటివఱకు లభ్యమైనవి ఇతని శాసనములు పదునేడు. ఇందు మొట్టమొదటిది క్రీ. శ ౧౩౨౫-వ సంవత్సరమునాటిది.[24] ఇది యిప్పటి గుంటూరుజిల్లా ఒంగోలు తాలూకాయందలి మల్లవరగ్రామమున నున్నది. కట్టకడపటి శాసనము క్రీ. శ. ౧౩౫౦ నాఁటిది.[25] ఇదియు గుంటూరు మండలమందే సత్తెనపల్లి తాలూకాలోని వెల్లూరు గ్రామమునం దున్నది. ఇతని యితర శాసనములవల్ల నీతని యధికారము నెల్లూరు మండలములోని కందుకూరు మొదలుకొని కృష్ణానదీపర్యంతముగల తీరరాష్ట్రముపై క్రీ.శ ౧౩౨౫-౧౩౫౦ సంవత్సరముల మధ్యకాలమున నవిచ్ఛిన్నముగ సాగుచుండె నని స్పష్టమగుచున్నది. తరువాత నీతని కుమారుఁడు సింహాసన మధిష్ఠించెను. వేమారెడ్డి కాపయనాయని యనుచరులలో నొక్కఁడైయుండి యతని పిమ్మట స్వదేశమునకు వచ్చి స్వతంత్రుఁడైనట్లు కలువచేరు శాసనమునఁ జెప్పియుండఁగా నతని శాసన

---

21. Early Muslim Expansion in South India.

22. భారతి సం. ౧౧. పుట ౯౪౫.

22 a. SII IV. No 950; Telingana Inscriptions. O.I.No.11.

23. వెలుగోటివారివంశావళి, పుట ౩౬.

24. నెల్లూరుజిల్లా శాసనములు, సం. 3. ఒంగోలు, నెం ౭౩. బట్టరువర్తు వేణుగోపాలసెట్టిగారు "శాకాబ్దే శైలవార్థిద్యుమణి పరిమితే" అను శాసనకాలమును శకాబ్దము ౧౨౭౭ అని చదివిరి. ఇది తప్పు. ఈతప్పును మిత్రులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు కనిపెట్టి శకాబ్దము ౧౨౪౭ అని సరిచేసినారు. రాఁబోవు వారి రెడ్డిచరిత్రయం దీవిషయమును చక్కఁగ చర్చచేసియున్నారు. నాకీయంశమును దెలియఁజేసినందుకు వారికిఁ గృతజ్ఞుఁడను.

25. A R E. 199 of 1925.

ములం దెచ్చుటను గాపయ నాయకుని ప్రస్తావము లేకపోవుటకుఁ గారణము దెలియదు. మఱియు నతని శాసనములయం దెచ్చుటను నతఁడు సామంతుఁ డని తెల్పు సూచనలుగూడ కానరావు. కాపయ నాయకుఁడు క్రీ. శ. ౧౩౬౮ వరకును రాజ్యము సేయుచుండినట్లు శాసనాధారమువలన నిశ్చయముగఁ దెలియవచ్చుచున్నది. వెలుగోటివారి వంశావళియందుఁ జెప్పినట్లు రేచర్ల సింగయమాదనిచే భీమవరరణక్షేత్రమున నతఁడు నిహతుఁడైనది నిజమేయగుసేని యతఁడు క్రీ. శ. ౧౩౬౦-వ సంవత్సరము తరువాత కొంతకాలము జీవించి యుండెనని చెప్పవలసివచ్చును. వేమారెడ్డియొక్క కట్టకపెపటి శాసనము క్రీ. శ ౧౩౫౦-వ సంవత్సరము నాఁటిదని పైఁజెప్పియున్నాను. ఒకవేళ అనవోతారెడ్డి యేలుబడి యతని మొదటిశాసనములో నుదాహృతమైన శకాబ్దము ౧౨౭౫, అనఁగా క్రీ. శ. ౧౩౫౪-౫లోనే గూరంభమాయెనని తలఁచినను వేమారెడ్డి కాపయ నాయకుఁడు సజీవుఁడై యుండఁగనే మృతినందెనని చెప్పవలసియున్నది. కలువచేఱు శాసనము కేవలము విశ్వాసపాత్రము గాదని త్రోసిపుచ్చుటకు వీలులేదు. ఈ విషయము దప్ప అందు చెప్పఁబడిన తక్కిన విషయము లన్నియు సత్యమని యన్యాధారములవల్ల రుజువగుచున్నది. క్రోలయ కాపయనాయకుల ప్రస్తావ మెచ్చట లేకపోయినను రెడ్డి శాసనములలోఁ గొన్నిటి యందు వేమారెడ్డియే ప్రతాపరుద్రుని మరణానంతరము దేశము తురుష్కాక్రాంతము కాఁగా నా తురుష్కులను దఱిమివేసి దేశమున హిందువుల యధికారమును, ధర్మమును మరల నెలకొల్పినట్లు వ్రాసియున్నది. కుమారగిరిరెడ్డి యనపర్తి శాసనమున,[26]

> "తతః క్రమాత్ విక్రమవాన్ ధరిత్రీం
> ప్రతాపరుద్రక్షితిప శ్శశాస
> శ్రీకాకతీయాన్వయవార్ధి చంద్ర
> స్సామ్రాజ్యలక్ష్మీ విజితామరేంద్రః.
> వర్ణోదయే చారువసుప్రసిద్ధా
> తస్మి న్మహీనాయక తిగ్మభానౌ
> అస్తంగతే కాలవశా దథాసీత్
> ద్దోష్షైకబంధు ర్యవనాంధకారః.
> సతాం హృదయపద్మాని
> వికాసం విజహుః క్షణాత్
> విచేరు శ్చోరాః ఖద్యోతా
> స్తస్మిన్ ధ్వాంతే నిరంతరే.
> తతఃపరం పద్మనిధి ర్నికామం
> ద్యోతే ఽబ్జసూతేః పదపంకజాతే
> జాతాన్వయే వేమనృపాలవర్యః
> సతోఽభ్యున్నతః ప్రాదురభూ దుదారః.
>
> *    *    *
>
> పవనజవనవాజివ్రాతరంగత్తరంగే
> యవనబలమహాబ్ధౌ భూతధాత్రీం నిమగ్నాం
> విపులవిజయధామా యస్సముద్ధృత్య చక్రే
> నిజభుజమణిభూషాం వీరనారాయణాంకః."

అని చెప్పియున్నది. వేమారెడ్డి యవనుల నోడించినట్లును, మధ్యాంధ్రదేశమును సంరక్షించినట్లును ఎఱ్ఱాప్రెగ్గడ తన హరివంశమున వ్రాసియున్నాఁడు.[27] మఱియుఁ బైనుదాహృతమైన మల్లవరశాసనమున నితఁడు కుండిజా కృష్ణాగోదావరీతటముల బ్రాహ్మణుల కగ్రహారముల నొసఁగెనని చెప్పియున్నది.

> "కృష్ణారోధసి కుండిజాపరిసరే
> గోదావరీ పార్శ్వతః
> కృత్వా గ్రామవరాన్ పరాక్రమజితాన్
> విద్వత్ప్రియో విప్రసాత్
> స్వాధ్యాయై రుదఘోషయద్విజసభా
> మాబ్రహ్మలోకం నిజాం
> కీర్తిం యస్య న కస్య వేమనృపతిః
> స్తుత్యో జగత్పావనః." [28]

కుండిజ, అనఁగా గుండ్లకమ్మ మొదలు గోదావరీతీరమువఱకుఁగల తీరదేశమును ఈతఁడు జయించియుండిన నితని కచట నగ్రహారములను బ్రాహ్మణులకొఱకు నిర్మిం

26. JAHRS XI pp 202-8.

27. 'యవననృపబలాబ్ధివ్యాప్త ఖస్త్రోర్వవేగా', (పూ. భా. ౫-౨౬౦) 'శ్రీమధ్యాంధ్రసుదేశ క్షేమద కరవాల' (ఉ. భా. ౪-౧).

28. నెల్లూరుజిల్లా శాసనములు, సం. 3. ఒంగోలు నెం ౭౩ రు.

చుటకు వలనుపడియుండదు. కొంచెమించుమించుగ నీ కాలముననే ముసునూరు ప్రోలయనాయకుఁడును తీర దేశమునే జయించి మాల్యవంతపర్వతసమీపమున నుండిన రేకపల్లినుండి రాజ్యము సేయుచుండినందువలన వేమారెడ్డియు నతని గలసియే పైఁ బేర్కొనిన దేశమును జయించియుండవలయు నని తోఁచుచున్నది. ఈ యూహ కేవల మా కాళసౌధనిర్మాణము గాదు. మల్లవరపు శాసనముననే దీనికి కొంత యాధారము గాన వచ్చుచున్నది.

"దృష్టానంగ్ర... జఘూరుహామహో శ్రోతో వహో...
...సంగతరాజక్షైరవవనీసంపూర్ణచంద్రోదయః"

శాసనపురాయి యరిగిపోవుటచేత శ్లోకమున చాలభాగము నష్టమైపోయినది. కాని 'సంగతరాజక్షైరవవనీసంపూర్ణచంద్రోదయః' అను వాక్యము ముఖ్యమైనది. ఇందు వేమారెడ్డి యొక్కటిగ కలసిన, లేక కూడిన రాజు లనెడు క్షైరవవనమునకు సంపూర్ణచంద్రోదయమువంటివాఁడని వర్ణింపఁబడియున్నాఁడు. ఈ సంగతరాజక్షైరవులు ముసునూరు ప్రోలయకాపయల నాశ్రయించియుండిన డెబ్బదియేవురు నాయకులే యని తలఁచెదను. వేమారెడ్డి పై డెబ్బదియేవురియందును ప్రధానుఁడని తోఁచెడిని. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశములో వేమారెడ్డిబిరుదులను వివరించి చెప్పుచు 'సంగతానేకనరపాలపరిపాలనశీలుం డంగరక్షాపాలుండనియు' నని విశదీకరించినాఁడు.[29] 'అంగరక్షు'యన శరీరరక్షకుఁడు; రాజపురుషుల దేహసంరక్షణార్థమై నియోగింపఁబడిన శూరుఁడు. అట్టి యంగరక్షులను పాలించువాఁడు అంగరక్షాపాలుఁడు; అంగరక్షుల కెల్ల యధిపతి. స్వతంత్రుఁడైన వేమారెడ్డికి అంగరక్షాపాలుఁ డను బిరుదెట్లు కలిగినది? అతఁ డెవ్వరి యంగరక్షుల పాలకుఁడు? అను నీప్రశ్నలకు సమాధాన మేమి? మల్లవరపు శాసనములోని 'సంగతరాజక్షైరవులే' హరివంశములోని 'సంగతానేకనరపాలురు'. వీరిని పరిశీలించుటవల్ల వేమారెడ్డికి 'అంగరక్షాపాల' బిరుదు గలుగుటచే వీరందరును అంగరక్షులని తోఁచుచున్నది. కావున మన శాసనమునందు

29. హరి. పూ. భా. ౧-౧౧

కాపయనాయకుని గొల్చిరని చెప్పఁబడిన డెబ్బదియేవురు నాయకులును అతని యంగరక్షులనియు, వేమారెడ్డి వారి పైయధికారి యనియుఁ దేలుచున్నది.

వేమారెడ్డి క్రీ. శ. ౧౩౨౫ మొదలు ౧౩౫౦ వఱకును రాజ్యము చేసినట్లును, కాపయనాయకునితో నతని కేదో కొంత సంబంధ ముండినట్లును సమకాలికశాసనాధారములవల్లను, వాఙ్మయమువల్లను దెలియ వచ్చుచుండఁగా నతని శాసనములలోఁ గాపయప్రస్తావన లేకపోవుటయుఁ, బ్రస్తుతము పరిష్కరింపఁబడుచుండు నీకలువచేఱు శాసనమున రమారమి క్రీ. శ. ౧౩౬౫ వఱకును రాజ్యము సేయుచుండిన కాపయమరణానంతర మీ యితఁ డన్యనాయకులవలె స్వనగరమునకు వచ్చి స్వదేశము నేలనారంభించెనని యుఁ జెప్పియుండుట వింతయే. ఇం దేదో కొంత రహస్య మున్నది. భావిపరిశోధన మీఁద అది బయల్పడవలసియున్నది.

వేమారెడ్డికి అనపోతారెడ్డియు, ననవేమారెడ్డియు నను నిద్దఱు కొడుకు లుండిరని రెడ్డిరాజుల శాసనము లుద్ఘోషించుచున్నవి. మన శాసనము అతనికి పుత్రులు మువ్వు రుండిరని తెల్పుచున్నది.

"పుత్రా ధాత్రీపతే స్తస్య
త్రిమూర్తయ ఇవ శ్రియః,
అన్నపో తాన్నమా చాన్న
వేమనామవిభూషణాః"

వీరియందు పెద్దవాఁడగు అన్నపోతారెడ్డికిఁ గుమారగిరి యను కొడుకును, నొక కూఁతురును బుట్టిరి. ఈ కూఁతును కాటయవేమారెడ్డి వివాహముగావించుకొనుటచే నితఁడు కుమారగిరికి బావమఱఁది యయ్యెను.

ఈ ప్రశస్తికర్త వేమారెడ్డి కుమారులను బేర్కొనెనేకాని వారు రాజ్యమేలినట్లు వ్రాయలేదు. కాని ప్రోలయవేముని తరువాత ననపోతారెడ్డియు, నతని యనంతర మనవేమారెడ్డియు, నటుపిమ్మట అనపోతారెడ్డికుమారుఁడగు కుమారగిరియు రాజ్యమేలిరని రెడ్డిశాసనములవల్లను, సమకాలికాంధ్ర వాఙ్మయమువల్లను మన మెఱుఁగుదుము. కుమారగిరి సత్వహీనుఁడు; భోగపరాయణుఁడు. రాజ్యపాలనయం దుదాసీనుఁడై నిరంతరము వేశ్యాంగనల గోష్ఠియందు ఆటపాటలతోఁ

గాలము ప్రచ్చుచుండెను. ఇతనికి బదులు ఇతని బావయు, మంత్రియు, దండనాయకుఁడును నైన కాటయవేమారెడ్డియే రాజ్యకార్యములను నిర్వహించుచు వచ్చెను. ఇతని రాజభక్తికి మెచ్చి కుమారగిరి తన రాజ్యమున నర్ధభాగమును బంచియిచ్చెనఁట. కుమారగిరికి వీరాన్నపోతుఁ డను కుమారుఁ డుండెనని కొన్ని శాసనములవల్లఁ దెలియుచున్నది. అతఁడు తండ్రి సజీవుఁడైయుండఁగనే మృతినందిన ట్లున్నది. కుమారగిరితో ప్రోలయవేముని వంశము సమాప్తిజెందెను. ఈవిషయము లన్నియు చిరపరిచితములే. వీనింగూర్చి విశేషించి చర్చచేయవలసిన యవసరము లేదు.

(౪) కాటయవేముని వంశము:— ఇతని వంశమీ క్రింది శాసనశ్లోకమున వర్ణింపఁబడినది.

"శ్రీమత్కాటయ భూపతే ర్భుజబలా
న్నష్టా ప్రతాపోన్నతేః
పౌత్రో మారమహీశ్వరస్య తనయః
శ్రీకాటనోర్వీ విభోః
జామాతా ప్రభు రన్నపోతనృపతే
ర్వేమక్షమాధీశ్వరో
యస్యాసీ త్కుమారగిర్యధిపతిః
స్వామీ పతి ర్దైవతమ్"

ఇందు నూతనాంశ మేదియు లేదు. ఇంతకు పూర్వము ప్రకటితములైన కాటయవేముని శాసనములవల్ల నిది యందఱకును విదితమైనదే. కుమారగిరి రెడ్డి క్రీ. శ. ౧౪౦౨—3 వఱకును జీవించియుండెను. తరువాత కాటయవేమారెడ్డి రాజమహేంద్రవర రాజ్యమునకు ప్రభువాయెను. ఇతనికిఁ గుమారగిరి రెడ్డి యను పుత్రుఁ డొకఁడు కలిగెను. ఈ యంశమే మన శాసనమందీ క్రింది శ్లోకములయందుఁ జెప్పఁబడియున్నది.

"వేమవిభు ర్లక్ష్మ్యా
వంగీకృతసర్వమంగళో జిష్ణుః
ప్రద్యుమ్నం శక్తిధరం
జయంత మయతిష్ట సుతం కుమారగిరిః.
జాతమాత్రేణ జాతోసౌ
సర్వసర్వంసహేశ్వరః
అదిగ ర్వేశ్వరఖ్యాతః
కుమారగిరిభూపతిః"

ఈ కుమారగిరిరెడ్డి క్రీ. శ. ౧౪౦౫-వ సంవత్సరమునఁ బుట్టెనని కాటయవేమారెడ్డిగారి తొత్తరము తామ్రశాసనమువల్ల తెలియవచ్చుచున్నది. అందు మొదటి శ్లోకమునం దిట్లున్నది:

"శ్రీకోర్కొండపతి ర్మహోత్పలగదా
శంఖారిధృగ్ధక్షకః
శ్రీలక్ష్మీనరసింహనామకహరి
ర్భక్తాభివేష్ట(?)ప్రదః
వామాంకస్థరమప్రతీతవిభవః
పద్మాసనస్థో జగ
న్నాథశ్రీకొమరాద్రిరెడ్డిజననా
భీష్టో జయ త్యచ్యుతః"30

ఈ కుమారగిరిరెడ్డి తన మేనమామయగు మొదటి కుమారగిరిరెడ్డియవతారమని కాటయవేమారెడ్డియొక్క అహోబిలశిలాశాసనమందు లిఖింపఁబడియున్నది.31 ఇందువల్ల మొదటి కుమారగిరిరెడ్డి నిర్యాణమైనపిమ్మట కాటయవేమారెడ్డి కొక కుమారుఁడు కలిగెననియుఁ, దన ప్రభుకందలి విశ్వాసముచే నాపుత్రునికి కుమారగిరి యని నామకరణముజేసెననియు నూహ కలుగుచున్నది. కాటయవేముని యనంతరము రెండవ కుమారగిరి రాజ్యమునకు వచ్చెననియు, నతఁడు మృతినందఁగా, స్వామిద్రోహపరాయణులగు కునృపాలు రాక్రమించుకొన్న రాజ్యమును కాటయ వేమారెడ్డియొక్క బంధుఁడైన దొడ్డయఅల్లనరేంద్రుఁడు సముద్ధరించి వేమారెడ్డియొక్క కూఁతురగు ననితల్లి కొసఁగెనఁట.

"స్వామిద్రోహపరాయణ
కునృపతిజలరాశిజలధినిమగ్నధరాం
దొడ్డయయల్లనరేంద్రో
హరిరివ సౌకర్యాత్సముద్ధృతవాన్.
దురితరహితచిత్తో
దొడ్డయాల్లాడభూపో

---

30. మెకంజీమ్యాన్యుస్క్రిప్ట్సు 15-4-4 పుట ౨౪౭
31. ARE 84 of 1915

భువ మరిజనవశ్యాం
　భూయసా హృశ్య దోష్ణా,
విమలగుణయుతాయాం
　వేమభూపాత్మజాయా
మవనిసురసుధాయా
　మన్నితల్యాం వ్యధత్త."

ఇందు పేర్కొనఁబడిన స్వామిద్రోహపరాయణులైన కునృపతు లెవ్వరో, వా రెట్లు రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము నాక్రమించిరో, దొడ్డయ యల్లనరేంద్రుఁ డెట్లు రాజ్యమును సముద్ధరించెనో ఇందు వివరించిచెప్పలేదు; కాని సమకాలికాంధ్రవాఙ్మయమువల్లను, శాసనములవల్లను అప్పటి యాంధ్రదేశములోని రాజకీయపరిస్థితులు కొంత తెలియవచ్చుచున్నవి. మొదట పేర్కొనఁదగినది రాజమహేంద్రవర మ్యూజియమం దుండిన అన్న దేవచోడని తామ్రశాసనము.[32] ఇందు భక్తిరాజకుమారుఁడును, వీరభద్రుని తండ్రియు నగు అన్నదేవచోడఁడు కాటయవేముని వంశ్యులను దనకు పాదాక్రాంతులైనవారిని సంరక్షించి 'శరణాగత భూపరక్షాదీక్షాగురు' వని ఖ్యాతి నందెనని చెప్పియున్నది.

"పాదాంబుజప్రణతకాటయవేమవంశ
　క్షితీశ్వరైకవత్సలతయా సమరక్షి యేన
సోఽయం విభాతి శరణాగత భూపరక్షా
　దీక్షాగురు ర్జయతి చోడకులాన్నదేవః"[33]

మఱియు దొడ్డయ అల్లాడరెడ్డి సూర్యవంశజులగు వీరభద్రాన్నదేవుల నోడించినట్లు శ్రీనాథకవి చెప్పుచున్నాఁడు:

"భానుమత్కుల వీరభద్రాన్నదేవేంద్ర
　గర్వసంరంభంబుఁ గట్టిపెట్టి
యవనకర్ణాటకటకభూధవులతోఁ
　జెలిమిఁ బాటించి యేలించెఁ దెలుఁగుభూమి"[34]

కావున స్వామిద్రోహపరాయణులగు కునృపతులు అన్నదేవచోడుఁడును, నాతని పుత్రుఁడగు వీరభద్రుఁడును ననుట తెల్లము. వీరిని జయించియే యల్లాడరెడ్డి వీ రాక్రమించుకొనియుండిన రాజమహేంద్రవర రాజ్యమును స్వవశముగావించుకొని కాటయవేమారెడ్డి పుత్రికయగు ననితల్లికి మరల స్వాధీనముగావించినది.

అన్నదేవచోడఁడును, నతని కుమారుఁడగు వీరభద్రుఁడును స్వామిద్రోహపరాయణులగు కునృపతు లంటిమిగదా. ఈయభిప్రాయము సరియైనచో వీరిరువురును మొదట కాటయవేముని యనుచరులైయుండి తరువాత నతనిపైఁ గత్తిగట్టి యతని రాజ్యము నాక్రమించుకొని రను సిద్ధాంతి మేర్పడుచున్నది. ఇదియే సరియని తలఁచెదను. అట్లగుచేని ఈ యన్నదేవచోడఁ డెవ్వఁడు? అతనికిఁ గాటయవేముని జయించునంతటి శక్తి యెట్లు కలిగెను? అను విషయములు చర్చనీయములు. రాజమహేంద్రవర మ్యూజియము తామ్రశాసనమును బరిష్కరించి ప్రకటించు సందర్భమున నీ యన్నదేవుని పూర్వోత్తరములను పరిశోధించి ఎపిగ్రాఫియా ఇండికా ౨౬-వ సంపుటమునఁ బ్రకటించియున్నాను. దానినే ఇచట సంగ్రహపరచి చెప్పుచున్నాను.

అన్నదేవుఁడు తెలుఁగుచోడఁడు; ఏలువ భీముని వంశజుఁడు; చోడభక్తిరాజుకొమారుఁడు; భీమలింగమనుజేశ్వరునికి ద్వైమాతురుఁడు. ఈ భీమలింగమనుజేశ్వరుఁడు కొండవీటి నేలిన రెడ్డిరాజగు అనవేమక్షితిపాలుని పుత్రిక నుద్వాహముగావించుకొనెను. వీరికి వేమాంబయను నొక కుమారిత కలిగెను; ఈమెను దొడ్డయ యల్లాడరెడ్డి పెండ్లాడెను. ఈ వివాహముల మూలమున చోళభీమలింగని కుటుంబమునకు రెడ్డిరాజులతోఁ జుట్టరికము కుదిరినది. కావున రెడ్డిరాజులు భీమలింగని పక్షమువారలై యన్నదేవచోడని కతని తండ్రి రాష్ట్రమును జెందనీరైరి; కావున

---

32. ఇప్పు డీ శాసన మచట లేదని వినికిడి. మహానుభావులు శాసనచోరు లెవ్వరో దీనిని హరించిరఁట. వీరు రహస్యముగ మరల దానిని యథాస్థానము జేర్చిరేని వీరికి చారిత్రపరిశోధకుల తరపున నా చేమోడ్పులు.

33. ఎపి. ఇండికా. సం. ౨౬, పుట ౯౫.

34. భీమేశ్వరపురాణము, ౧-౬౩.

నతఁడు స్వదేశమును వదలి రెడ్డిరాజులకు సహజశత్రువులైన రాచకొండవెలమరాజుల నాశ్రయించి వారి యాస్థానమున నుండెను. కాని రెడ్డిరాజులు ప్రబలులై యుండుటచే వెలమవారి సహాయమువల్ల పిత్ర్యమైన రాష్ట్రమును మరల వశపఱచుకొనుటకు వీలుగాకపోయెను. రాచకొండరాజులవలనఁ దన కార్య మనుకూలపడకపోవుటచే నచటినుండి గుల్బర్గకుఁబోయి బహమనీ సుల్తానుఁడగు ఫీరోజుశాహ నాశ్రయించి కొంతకాలముండెను. గుల్బర్గయం దుండుకాలమునఁ గృష్ణాతటమున నుండు నగరుకోటకై విజయనగరరాయలకును, బహమనీసుల్తానులకును యుద్ధము పొసఁగఁగా నన్నదేవుఁడు ఫీరోజుశాహాపక్షమునఁ బోరాడి జయము గొనెను.

ఇంతటనే రెడ్డిరాజ్యమున విప్లవము సంభవించెను. క్రీ. శ. ౧౪౦౩-వ సంవత్సరమున కొండవీటి ప్రభువు కుమారగిరి పరమపదించెను. అతనికి పుత్రులు లేకపోవుటచే నతని సన్నిహితజ్ఞాతి పెదకోమటివేమభూపాలుఁడు రెడ్డిరాజ్యమున కధిపతి యాయెను; కాని కాటయవేముఁడు మొదటి కుమారగిరియనుశాసనము చొప్పున కృష్ణకవ్వలి భూమి నంతయుఁ గబళించి పెదకోమటి వేముని యధికారమున కొప్పుకొనక స్వతంత్రుఁడై రాజ్యపాలన సేయనారంభించెను. ఈ కారణమున రెడ్డిరాజ్యమున నంతఃకలహము పొటమరించి రెండు స్వతంత్రసంస్థానములుగ చీలెను. కృష్ణకు దక్షిణమున నుండిన రాష్ట్రమును కొండవీడు రాజధానిగ పెదకోమటివేమారెడ్డియు, నుత్తరమం దుండిన రాష్ట్రమును రాజమహేంద్రవరము రాజధానిగఁ గాటయవేమారెడ్డియు పరిపాలించ నారంభించిరి. కాని వీరొండొరులకు వైరము దినదినప్రవర్ధమానమగుచువచ్చుటచేత యుద్ధమున కెదురుచూచుచుఁ దగు ప్రయత్నములు సేయుచుండిరి. కాటయ వేమారెడ్డి విజయనగరమునకుఁ బోయి మొదటి దేవరాయల సహాయమును గోరి సమయము వచ్చినపుడు దండును బంపునట్లు ఏర్పాటు గావించుకొని స్వరాష్ట్రమునకు మరలివచ్చెను. పెదకోమటి వేమారెడ్డి రాయలు దన శత్రునితో నేకీభవించుటను దెలిసికొని యతనికిఁ బ్రతిపక్షియైన బహమనీ సుల్తానుని సహాయము వేఁడికొనెను. పెదకోమటి వేమునికి సహాయము సేయుచుండిన కాటయవేముఁడు జయించు ననియుఁ, దన్మూలమున నతని మిత్రుఁడగు రాయలకుఁ దీరాంధ్రదేశమునఁ బలుకుబడి హెచ్చుననియు, నట్లు హెచ్చినఁ దన రాజ్యమునకు శత్రుభయ మతిశయించుననియు గుర్తెఱిగి, ఫీరోజ్ శాహ పెదకోమటి వేమునికిఁ దోడురా నంగీకరించెను. ఈపరిస్థితియం దన్నదేవచోడఁడు బహమనీసుల్తానునికి కర ముపయుక్తుఁడాయెను. అతని పిత్ర్యమైన రాష్ట్రము నతనికిఁ దీసియిచ్చు మిషచే నతనివెంట సైన్యముతోఁగూడ బయలువెడలి రాజమహేంద్రవరరాజ్యముపై దాడివెట్టెను. ఈ సడి నెఱింగి రాయలు గొప్ప సైన్యము కాటయవేమునికిఁదోడంపెను. వీరిని సహాయులుగఁ గొని కాటయవేముఁడు శత్రుసైన్యము నడ్డగించుటకు ప్రయత్నించెను. కాని సాధ్యపడదాయె. గుండుకొలను యుద్ధమునఁ బరాజయము నందెను. ఈ రణక్షేత్రముననో, అజ్ఞాతమైన మఱియొక తావుననో ఇతఁ డసువులఁ గోల్పోయెను. తరువాత నితని పుత్రుఁడు రెండవకుమారగిరి ప్రభువాయెను. కుమారగిరి బాలుఁడు. ఈయొడుదుడుకులలో రాజ్యకార్యమును నడుపుటకు శక్తిసామర్థ్యములు గలవాఁడుకాఁడు. కార్యభార మంతయు నల్లాడరెడ్డిపైఁ బడెను. ఇతఁడు పరాక్రమవంతుఁడే; కాని శత్రుబల మత్యంతాతిశయమైన దగుటచే నిర్వహించఁజాలకపోయెను. కాటయవేమునికి యొత్తాసైవచ్చిన రాయరాణువ అత్తిలి కడను, కొకరపర్తియొద్దను రెండు పర్యాయము లోడిపోయెను. కుమారగిరియు నీయుద్ధముల మధ్య మృతినందెను. కాటయవేముని సంస్థ లన్నదేవచోడనికిఁ బాదాక్రాంతములైన దీపట్టుననే. కాని జయలక్ష్మి యన్నదేవునికడ స్థిరముగ నిలువలేదు. రాయలు విజయనగరమునుండి మఱియొక సైన్యము నంపి, గుల్బర్గ సైన్యములు నడచు మార్గమున నుండు పానుగంటి కోటను స్వాధీనపఱచుకొనెను. ఇఁక తీరదేశమున నిలచుట క్షేమకరము గాదని ఫీరోజుశాహ వెనుదిరిగి స్వదేశమునకు పోయెను. తోడైవచ్చిన గుల్బర్గ సుల్తాను తిరిగిపోయిన పిమ్మట జయించిన దేశముపై నధికారము సాగించి రక్షించుకొనవలసిన భారము అన్నదేవునిపైఁ బడెను; కాని దానికిఁ గావలసిన బలముగాని, సహాయసంపత్తిగాని యతనికి లేకపోయెను.

కావున నతఁ డల్లాడరెడ్డి నెదుర్కొనలేక యోడిపోయెను. అల్లాడరెడ్డి రాజమహేంద్రవర రాజ్యమును మరల సాధించి కాటయవేమారెడ్డి కుమార్తెయగు ననితల్లి కప్పగించెను. 35

(౫) అల్లాడరెడ్డివంశము:—అల్లాడరెడ్డి కాటయవేమారెడ్డికి బంధుఁడు.

"అస్తి వేమేశ్వరబంధు
ర్విలసతి భువనప్రశస్తగుణసింధుః
దొడ్డయఅల్లనరేంద్రః
ప్రథితమహాసమరకేళినిస్తంద్రః"

ఈబంధుత్వ మెట్టిదో నిర్ణయించి చెప్పుటకుఁదగిన యాధారము లెవ్వియు లేవు. కేవలము చుట్టరిక మొక్కటియే యల్లాడరెడ్డిరాజ్యపునరుద్ధారణదీక్షకుఁ గారణము కాదు. బంధుత్వముతోఁగూడ స్వార్థము గలసినది. అనితల్లి దిక్కులేని కన్య. పితృసోదరమరణముచే గొప్పరాజ్యమునకు వారసైనది. అల్లాడరెడ్డికిఁ బుత్రులు కలరు. వారియం దొక్కని నామెకుఁబెండ్లి చేసిన రాజ్యమునకుఁ దానును, దన పుత్రులును నధిపతు లగుదురు. కావున అల్లాడరెడ్డి పట్టుపట్టి శత్రుసంహారణ మొనర్చి యవనకర్ణాటకటకభూధవులతో సఖ్యము నెఱపి యనితల్లికి రాజ్యము సంపాదించియిచ్చి, తన కుమారులలో రెండవవాఁడగు వీరభద్రారెడ్డి నామెకు భర్తను గావించెను. పేరునకు మాత్ర మనితల్లి రాజ్యమున కధిపతి. రాజ్యాధికారమంతయు వాస్తవముగ నామెభర్తయగు వీరభద్రారెడ్డిచేతను, బావయును సచివుఁడును నగు వేమారెడ్డిచేతను నుండెను. ఈవిషయమును కీ. శే. జయంతి రామయ్యగారు చక్కఁగఁ జర్చించియున్నారు. దానిగూర్చి ఇట చర్చ యనావశ్యము.

౭. శాసనకాలము:—ఈదానశాసనము అనితల్లి యిచ్చిన రెండుదానములను దెల్పుచున్నది: (౧) శకాబ్దము ౧౩౪౫-వ సంవత్సరము వైశాఖమున మార్కండేయేశ్వరసన్నిధియందు సురవిప్రక్షేత్రముల కరమును ద్యజించెను.

"శాకే శరయుగవిశ్వే
వైశాఖే మాసి భువ మవ త్యనితల్లీ
సురవిప్రక్షేత్రకరం
మార్కండేయేశసన్నిధౌ త్యక్తవతీ."

(౨) పైశకాబ్దమునకు సరియైన శోభకృద్వర్షమున శ్రావణకృష్ణఏకాదశినాఁడు శైలాధిపశ్రీరామేశ్వరసన్నిధియందు పరహితాచార్యుఁడను భిషగ్వరునకు కలువచేఱు అను గ్రామమును దానముచేసెను.

"శాకాబ్దే శరవేదరామశశభృ
త్సంఖ్యే శుభే శోభకృ
ద్వర్షే శ్రావణకృష్ణవిష్ణుదివసే
శ్రీకల్వచేఱుంశుభం
గ్రామందత్తవతీసతీపరహితా
చార్యాయ శైలాధిప
శ్రీరామేశ్వరసన్నిధౌ పతిహిత
శ్రీరన్యతల్యంబికా."

శకాబ్దము ౧౩౪౫-వ సంవత్సరము క్రీ. శ. ౧౪౨౩-నకు సరిపోవుచున్నది.

౮. ప్రతిగృహీత:—ప్రతిగృహీత పరహితాచార్యులని పైఁజెప్పియున్నది. ఇతఁడు కాళనాథుని పుత్రుఁడు. వీరిది వైద్యకుటుంబము. వీరి మూలపురుషుఁడైన పరహితుఁడు ఒక సర్పమునకు నోట శల్యము గ్రుచ్చుకొని యుండఁగా నాశల్యము నూడ్చి దాని పుండును మాన్పెనఁట. తన్మూలమున నతనికి పరహితనామ మన్వర్థమాయెనఁట. మఱియు నాసర్పమువల్ల నభయముఁ బొంది సర్పచికిత్స జేయ నారంభించెనఁట. ఈపరహితవంశమువా రాఱు పురుషాంతరములవారు ప్రక్క పుటలోని మొదటి వంశవృక్షమున వర్ణింపఁబడియున్నారు.

ఆ కడపటి పరహితుఁడే ప్రస్తుత శాసనోక్త దానమునకు ప్రతిగృహీత. పరహిత వంశమువారు క్రీ. శ. ౧౩౬౮ నాఁటి యక్కలపూండి దానశాసనమునందు ప్రతిగృహీతలుగఁ బేర్కొనఁబడి యున్నారు.36 అందు వర్ణింపఁబడిన వంశము ప్రక్క పుటలోని రెండవ వంశవృక్షమున వివరించినాను.

35. ఎపిగ్రా. ఇండికా. సం. ౨౬, పుటలు ౧౪-౪౮.

36. ఎపి. ఇండికా. సం. ౧౩. పుటలు ౨౬౩-౬౪.







కలువచేఱుశాసన ప్రతిగృహీత యగు పరహితుని తండ్రి యగు కాళనాథుఁడే యక్కాలపుండి శాసనప్రతిగృహీతయగు కాళనాథుఁడు. ఇద్దరి యన్నల పేర్లను, తండ్రితాతల పేర్లను ఇంచుకంతయైనను వ్యత్యాసము లేక సరిపోవుచున్నవి. ఈ ప్రఖ్యాత వైద్యకుటుంబమువారు కోర్కొండ నాయకులకాలము నుండి రాజమహేంద్రవర రెడ్లకాలము వఱకును వైద్యవిద్యచే లోకమునకు హితమాచరించుచు రాజాదరణకు పాత్రులై యుండిరి.

౭. స్థలనిర్ణయము: — ఈ శాసనోక్త దాన గ్రామము కలువచేఱు. ఇది రెడ్డిరాజ్యమునం దేమూల నుండెనో నిర్ణయించుటకుఁ దగిన యాధారము లిం దేవియుఁ గానరావు. గ్రామావధు లష్టదిశల నిచ్చి యున్నను మాడ్తపుంత ప్రేకేటిపుంతలు దప్ప తక్కిన వన్నియు సామాన్యము లగు పుంతలే. కాని శ్రీ జయంతి రామయ్యగారు "దత్త గ్రామము కృష్ణ జిల్లా తణుకు తాలూకాలో నిడదవోలునకు సమీపమున నున్న కలువ చెర్ల యని తోఁచుచున్నది. దీనిదగ్గఱ మోర్త, పేకేరు (శాసనములో మోడ్త, ప్రేకేరు) అను గ్రామములు గలవు" అని వ్రాసియున్నారు.37 వీరి నిర్ధారణను అంగీకరించవచ్చును. "శ్రీశైలరామేశ్వరుని యాలయ మెద్దియో తెలియకున్నది" అని వ్రాసిరి. అల్లయవేమని వేమవర గ్రామదానశాసనమునం దతని తండ్రియగు నల్లాడరెడ్డి పెదకోమటివేమారెడ్డిని 'రామేశ్వరము'కడ యుద్ధమున నోడించినట్లు చెప్పియున్నది:

"జిత్వానల్పవికల్పకల్పితబలం
తం చాల్పఖానం రణే
మిత్రీకృత్య సమాగతం గజపతిం
కర్ణాటభూపంచ తం
హత్వా కోమటివేమసైన్యనికరం
భూయోఽపి రామేశ్వరే
ప్రాజ్యం రాజమహేంద్రరాజ్య మకరో
దల్లాడభూమీశ్వరః"38

ఇందు పేర్కొనఁబడిన రామేశ్వరము గోదావరిజిల్లాలో నున్నదని డాక్టర్ బార్నెట్ గారు వ్రాసి యున్నారు.39 ఈ రామేశ్వరమును, గలువచేఱుశాసనములోని శ్రీశైలరామేశ్వరమును నొక్కస్థలమనియే తలఁచుచున్నాను. ఇది సరియైనచో నీ శ్రీశైలరామేశ్వరము గోదావరిజిల్లాయం దున్నదని చెప్పవలయును.

37. ఆ. సా. ప. పత్రిక. సం. ౨ పుట ౧౦౩.
38. ఎపి. ఇండికా. సం. ౧౩ పుట ౨౪౧.
39. ,, ,, పుట ౨౪౦.

నేను శిక్షకుడనైనచో-



నవ్వలేనివానికి కితకితలు - కనికరములేనివాని కంట్లో కారపుపొడి



ఈర్ష్యకలవానికి లేమి



ప్రేమింపలేనివానికి ముసలి పొత్తు



కుటిలునకు గంతలు



కోపినెత్తిమీద మంచుమూట

- తలిశెట్టి రామారావు.

నటీమణులవలె మీశరీరసౌందర్యమును కాపాడుకొనుడు!



# రమోలా

తన శరీర లావణ్యమే తన ప్రథమ కర్తవ్యమని రమోలా అంటుంది. ఆమె లక్స్ టాయిలెట్ సబ్బు నిత్యము వుపయోగించి చర్మాన్ని మిక్కిలి మృదువుగాను సున్నితంగాను వుంచుకొంటోంది. "ఇదే నేను అందంగా వుంటానికి చేయుచున్నది" అని అంటుంది. ఏ వనిత చర్మాన్నైనా ఈ సుగంధ మిశ్రమైన సబ్బుయొక్క నురుగు మృదువుగాను, లావణ్యంగాను వుంచగలదని గట్టిగా నమ్ముచున్నది.




## లక్సు టాయిలెట్ సబ్బు

LEVER BROTHERS (INDIA) LIMITED

L.79. 120-11-40 TL

# పోట్లగొడ్డు

[కథానిక]



● 'జమదగ్ని' ●

ఆ కఱ్ఱావుపాలు తియ్యడం బ్రహ్మాండమై పోతోంది రోజురోజుకూ. మనిషిని దగ్గఱకు రానివ్వదు. వాడి సూదుల్లాంటి గిన్ని కొమ్ములు జాడించి కుమ్ముతూ ఉంటుంది. పదిగజాల దూరంలో ఎవరు మసిలినా పసిపట్టిన పాములా బుస్సుమంటుంది. వెనక కాళ్లు ఎడంగా పెట్టి, బందం వెయ్యనియ్యదు సరికదా, ఎంతో జాగ్రత్తపడి కఱ్ఱ పుచ్చుకుని దగ్గఱకు వెళ్లినా సరే గాడిదతన్నులు తన్నుతుంది. ఒక మానెడు చిట్టు పోసిన బుట్ట ముందఱ పెట్టి, ఆఱడుగుల బాణాకఱ్ఱ చేత్తో పుచ్చుకుని ముందొకరు నిల్చున్న తరువాత నాడాలువేసే ఎడ్లకు కొమ్ములకు తాడేసి దూరంగా నిల్చుని నడుంచుట్టూ తాడువేసే పద్ధతిప్రకారం బందం వెయ్యవలసి ఉంటుంది. అప్పటికైనా తోకకు మాత్రం తాడు చుట్టనివ్వదు. పాలు తాగుతున్న దూడ నివతలకు లాగితే చిట్టుబుట్టలో మూతి అట్లాగే వుంచి గిరగిరా తిరుగుతుంది. అట్లా తిరగకుండా వెన కింకొకరు కఱ్ఱ పుచ్చుకు నిలబడాలి. ఇంతా కష్టపడి చెంబు పుచ్చుకొని పొదుగుదగ్గఱ కూర్చుంటే మూత్రసిక్తమైన పుచ్ఛంతో వీపు చిట్లగొట్టుతుంది. ఇన్నిటికీ సహించి మొండితనంతో ఎవరైనా పాలు తియ్యబోయి రెండు చేతులూ పొదుగుమీద పెట్టారా వెనకకాళ్లు రెండూ ఎత్తి పడేసిం దన్నమాటే.

అందుచేత ఆ ఆవుపాలు తియ్యడాని కాయింట్లో అందఱికీ భయమే - ఒక్క బసవమ్మకు తప్ప. ఆవిడంటే ఇంట్లో అందఱికీకూడా భయమే. నోరుగల మనిషవడంచేత ఇంట్లో వాళ్లకే కాక ఇరుగుపొరుగు వాళ్లకుకూడా భయమే. అయినప్పటికీ ఆవిడ చాలా మంచిదవడంచేత యావన్మందికీ ఆవిడమీద గౌరవంకూడా ఉన్నది. ఆవి డాయింటి యజమాని గోపాలాని కన్నగారి భార్య. భర్త చనిపోయిన దగ్గఱనుంచీ తనకు సంతానం లేనందువల్లా, వీళ్లిద్దఱూ ఆవిడకు మేనత్త బిడ్డలే అయినందువల్లా ఆవిడ మఱిదినీ, అతని సంసారాన్నీ కనిపెట్టుకుని అతనిదగ్గతే ఉన్నది.

ఆవిడకైనా ఆ ఆవు స్వాధీనమయ్యేది కాదుగాని తప్పదుకాబట్టి ఆ ఆవు వారింట్లో ప్రవేశించినదగ్గఱనుంచీ దాన్ని నయానా భయానా ఆమె లోబఱచుకున్నది. మఱిది కొడుకుల్లో పెద్దవాడు రాముడూ, చిన్నవాడు కృష్ణుడూ ముందూ వెనకా నిల్చుని తోడుపడగా ఆవిడ ఆ ఆవుపాలు తియ్యడపు యజ్ఞం చేస్తూఉంటుంది. పూటకు రెండు శేర్లకు తక్కువ కాకుండా పాలు ఇస్తూవుండడంవల్ల ఇంత కష్టమూ పడవలసివస్తోంది. ఇంటిముందు ఆవును కట్టేసుకోడం మంచిది గదా అనీ, ఏదో కాసిని పాలు ఇవ్వకపోతుందా అనీ ఇదివఱ కెన్నిమాట్లు తంటాలు

పడ్డా పావుశేరుకంటే ఎక్కువ పాలిచ్చే ఆవు దొరకనే లేదు. ఇదేదో దొరికిందికదా అనుకుంటే పోట్లగొడ్డయి ప్రాణాలు తోడేస్తోంది. ఇల్లు తడుముకోకుండా గడిచిపోయేటట్లు పాలిస్తూ ఉండడంచేత దీన్ని అమ్మివేయడానికి గోపాలంభార్యా, ఈవిడాకూడా సుతరామూ ఇష్టపడడం లేదు.

౨

పెత్తల్లి ఇంట్లో లేకపోవడంవల్ల పాలు తియ్యడానికి పిల్ల లిద్దరూ పూనుకున్నారు. మొదటిరోజు ఇద్దరు పిల్లల సహాయంతో ఒదినెగారి ననుకరించి గోపాలం తంటాలు పడ్డాడుకాని పావుశేరుపాలు తీసేటప్పటికి తాతలు దిగివచ్చారు. రెండోరోజు పెద్దవాడు తండ్రిని ముందు నుంచోమని తాను శేరుపాలు తీసి తండ్రికంటే గొప్పవాణ్నని పించుకున్నాడుకాని ఆ అదరగండపావు వెనక నుంచున్న కృష్ణుణ్ని క్రిందపడేసి కాలు తొక్కి బొటనవేలిగోరు లేవగొట్టింది. మూడోరోజు "నే నీ ఆవుతో వేగలేను. తీస్తే తీసుకోండి, లేకపోతే మానెయ్యండ"ని గోపాలం ఇంట్లో లేకుండా వెళ్లిపోయాడు. కృష్ణుడు కాలు మోపుచేసి లేవలేక పడుకున్నాడు. ఇక అధ్వర్యం అంతా రాముడి మీద పడింది. వాడికి హుషారుగానే వుంది కాని ముగ్గురుకి లొంగని ఆవుతో వాడొక్కడూ ఏం తంటాలుపడగలడు? అయినా వాడు ఊరుకోదలుచుకోలేదు. పక్కింటి సుబ్బయ్యనూ, వెంకమ్మనూ కేకేసుకొచ్చాడు. వెంకమ్మను పాలచెంబు తీసుకోమన్నాడు. సుబ్బయ్యను వెనక నుంచోమన్నాడు. తాను బాణాకఱ్ఱ తీసుకుని ముందు నుంచున్నాడు. రుక్మిణమ్మ గుమ్మందగ్గిర కూర్చొని కొడుకు ధైర్యానికీ,సాహసానికీ మెచ్చుకుని లోలోపల సంతోషిస్తోంది. బసవమ్మ స్నానానికని చెరువుకు వెళ్లింది. ఆవిడ వచ్చేదాకా ఉండమని తల్లి చెప్తున్నా రాముడు వినిపించుకోలేదు. ఆవిడ భయపడుతూనేవుంది. బంధం వేశారు; చిట్టుబుట్ట ముందు పెట్టారు. వెంకమ్మ పొదుగు కడిగింది; రెండుమూడు ధారలు లాగింది. ఆవేమీ అనలేదు. చక్కగా పాలు తియ్యనిస్తోంది. రోజూ వెంకమ్మచేత తీయిస్తే బాగుంటుం దనుకున్నాడు రాముడు. సుబ్బయ్య రాముడివంక చూసి తాను రావడంవల్ల ఆ వింత సాధువైం దన్నట్లుగా చిఱునవ్వు నవ్వుతున్నాడు. వెంకమ్మ తన ధోరణిని తాను పాలుతీస్తోంది. రాముడు చాలా జాగ్రత్తగా ఆ వెక్కడ కాలు కదుపుతుందో అని దాని కాళ్లవంకే చూస్తున్నాడు. ఇంతలో దూరంగా కట్టిన దూడ తల్లికోసం ఎగిరి దూకింది. ఆ వొక్కసారిగా రెండుకొమ్ములూ ఎత్తి రాముడి పొట్టలో గుచ్చి ఎత్తింది. వెంకమ్మ పాలచెంబుతో వెనక్కి పడింది. ఆమెను లేవదియ్యబోయిన సుబ్బయ్యను ఆవు కాలు జాడించి తన్నింది. అంతా ఒక్కమాటు గొల్లుమన్నారు. కుంటుకుంటూ కృష్ణుడు లేచివచ్చాడు. రుక్మిణమ్మ పరుగెత్తుకుని వచ్చి క్రిందపడడంవల్ల తలకు దెబ్బతగిలిన రాముణ్ని లేవదీసింది. సుబ్బయ్యా, వెంకమ్మా వాళ్లంతట వాళ్లే నెమ్మదిగా లేచారు. ఆవు పలుపు తెంపుకుని దొడ్డంతా గంతులేసింది. కుంటికాలి కృష్ణుడు బాణాకఱ్ఱ తీసుకుని ఆవును నాలు గుతికాడు. అది మొదట్లో మీదికి వచ్చిందికాని గట్టిదెబ్బ తగిలేటప్పటికి జంకి దూడదగ్గఱకు పోయి నుంచుంది. దూడ తల్లిపాలు స్వేచ్ఛ

గా తాగింది. వెంకమ్మా, సుబ్బమ్మా నెమ్మదిగా ఇంటిదారి పట్టారు. రుక్మిణమ్మా, కృష్ణుడూ రాముణ్ని లేవదీసి ఇంట్లోకి తీసుకుపోయి తలకు కట్టుకట్టారు. మంచం మీద పడుకోబెట్టి పొట్ట తోమారు. నిన్న కొడుకులిద్దరూ కష్టపడి తీసిన పాల పెరుగు చిలికి తియ్యటి మజ్జిగ గొంతులో పోసింది రుక్మిణమ్మ. అప్పటికి కాస్త స్వస్థత చిక్కి రాముడు కళ్లు మూసుకున్నాడు. కృష్ణుడు విసురుతూ పక్కన కూర్చున్నాడు. ఇంకేం చెయ్యడానికీ తోచక మంచంపక్కన దిగాలు పడి కూర్చుని రాముడివంక చూస్తూ భావి గతి ఆలోచిస్తోంది రుక్మిణమ్మ.

ఈ సమయంలో గోపాలం ఇంటికి చక్కా వచ్చాడు. వచ్చీ రావడంతోనే మంచంమీద పడుకుని వున్న రాముణ్ని చూచాడు. "ఇదంతా ఆవు ఆగడమేనా?" అని ఒక అంకె వేశాడు. కృష్ణుడు నెమ్మదిగా జరిగిందంతా చెప్పాడు. గోపాలానికి దేహమంతా శరీరమైంది. కోపంతో శివమెత్తి వొళ్లు తెలియలేదు. నోటికొచ్చినట్లు వాగడం మొదలుపెట్టాడు. "మీకు చేతకాక పోతే మిమ్మల్నెవరు తియ్యమన్నారు? నిన్న నువ్వు కాలు విరగగొట్టుకున్నావూ? ఇవ్వాళ వీడు తల పగలగొట్టుకున్నాడూ? ఇలా అయితే ఇక యింట్లో క్షేమంగా ఉండడమెట్లా? అయినా మిమ్మల్నని లాభమేమిటి? దీనికంతకూ ఆ పాడుముండ కారణం. దాని మూలాన ఇంత వచ్చింది! ఈ దిక్కుమాలిన గొడ్డు మన కెందుకు, అమ్మివేద్దామంటే వినదు. అ దెన్నాళ్లకూ లొంగదాయె! ఏం చెయ్యాలో తోచడం లేదు" అంటూ విరుచుకు పడ్డాడు. రుక్మిణమ్మ నోరెత్తలేదు. పిల్లలిద్దరూ కుక్కిన పేలల్లే నోరు మూసుకు కూర్చున్నారు.

పది కావస్తోంది. తండ్రి ధూంధాంలు తగ్గలేదు. గొడ్లకాపరివాడు ఆవును తోలుకు పోయాడు. దూడ గడ్డికోసం అరిచింది. ఆ వంక పెట్టుకొని కృష్ణుడు లేచి దానికి గడ్డి వేసి దొడ్లోనించి వంటింట్లోకి పోయి తల్లి దగ్గర కూర్చున్నాడు. చుట్టపొగతోపాటు అప్పుడప్పుడు కోపం వెలిబుచ్చుతూ వీధి వసారాలో కూర్చున్నాడు గోపాలం. రుక్మిణమ్మ వంట పూర్తిచేసింది. కృష్ణుణ్ని పోయి తండ్రిని పిల్చుకురమ్మన్నది. వాడు వెళ్లి గోడపక్కన నిలబడి తొంగితొంగి చూస్తూ నెమ్మదిగా పిల్చాడు. గోపాలం వినిపించుకున్నాడు కాని ఏమిటేమిటో కసిరాడు. వాడు భయపడి లోపలికి వెళ్లిపోయాడు.

రుక్మిణమ్మ రాముడిచేత అన్నం తినిపించింది. కృష్ణుడి కన్నం పెట్టి తాను కూర్చున్నది. గోపాల మన్నానికి లేవలేదు. ఇంతలో స్నానానికని చెరువుకు వెళ్లిన బసవమ్మ ఇంటికి చేరుకున్నది. ఆవిణ్ని వీధిగుమ్మంలో ఉండగానే గోపాలం చూచి లోపలికి వెళ్లాడు. అతన్ని చూచి రుక్మిణమ్మ త్వరత్వరగా విస్తరిలో అన్నం పెట్టింది. అన్నం మునివేళ్లతో కలుపుకుని చికాకుగా తింటున్నాడు గోపాలం. అంత చికాకెందు కన్నట్లుగా సాభిప్రాయంగా అతనివంక చూసింది రుక్మిణమ్మ. "ఏమిటీ కూర! నీ శ్రాద్ధంలా గుంది" అన్నాడు గోపాలం. దాన్నవతలికి తోసేశాడు. "మజ్జిగ పొయ్యి" అంటూ కసిరాడు. పాలు తియ్యకపోవడంవల్ల రెండురోజులబట్టీ నీళ్లమజ్జిగే పోసుకుంటున్నారు. ఇవ్వాళ ఆ మజ్జిగ నీళ్లెక్కువయి నలుపుతిరిగాయి. ఆనీళ్లే

నోరు మెదపకుండా బిక్కుబిక్కుమంటూనే పోసిం దాయిల్లాలు. "ఏమి టీమజ్జిగ! ఈ ఆవు నమ్మేస్తాను. పాలూ లేవు పాడూ లేదు. ఎందు కొచ్చింది తద్దినం" అంటూ విసుగుతూ అన్నం తోసేస్తూ అన్నాడు గోపాలం. రుక్మిణమ్మ ఊరుకోలేకపోయింది. "ఆ అన్నం అట్లా తోసేస్తా రెందుకు? ఇవాళసలు మీరు ఏమీ తినలేదు. నామాట విని ఆకాస్త తినండి. ఆవు నమ్మడంమాట తర్వాత చూద్దా"మంటూ ఆవిడ బతిమాలింది. గోపాలంధోరణి తగ్గనేలేదు. "తర్వాత చూద్దా మేమిటి? ఇల్లా అనే కుఱ్ఱాళ్ల నిద్దర్నీ మూలపడేశావు! ఇదంతా నీమూలానే వచ్చింది. ఛీ! నీ మొహం చూడ కూడదు." అని అరవడం మొదలుపెట్టాడు. ఆవిడ కిట్లాంటి మాట లలవాటే! అయినా ఆవి డెన్నడూ సమాధానం చెప్పదు. ఎందుచేతో ఇవాళ ఊరుకోలేకపోయింది. కొంచెం తీవ్రంగానే "అమ్మతా నమ్మతా నంటారు. అమ్మి ఎవర్ని ఉద్ధరిస్తారు! ఇన్నాళ్లూ ఆవులేక ఎన్నిపాట్లు పడిందీ తెలియదా! నా కెందుకొచ్చింది మధ్య! మీరూ మీరూ ఏం చేసుకుంటే నాకేం?" అని ఆవిడ మనసులో ఉన్నదున్నట్లు అనేసింది. గోపాలం ఛర్రుమని కోపం వచ్చి అన్నం తింటున్నవాడు తింటున్నట్లే లేచి అంటచేత్తోనే భార్య చెంపమీద చెళ్లున కొట్టి చకచకా బైటపడ్డాడు. ఒక్క నిముషమైనా ఇంట్లో ఉండకుండా చొక్కా వేసుకుని ఊళ్లోకి వెళ్లి పోయాడు.

వీధిలో కూర్చున్న బసవమ్మకు జరిగిన సంగతులన్నీ తెలిశాయి. పోయిన భర్తను జ్ఞాపకం తెచ్చుకుని కాసేపు దుఃఖించింది. గోపాలం అన్నగారు ఇలాంటి విషయాల్లో ఇతని కంటే మెఱుగే! కళ్లు తుడుచుకుంటూ 'చెల్లీ' అని రుక్మిణమ్మను జాలిగా కేకేసింది. ఆ కేక విని రుక్మిణమ్మ పమిటకొంగుతో ముఖం తుడుచుకొని విస్తరిలో అన్నం పెట్టి పట్టుకువచ్చి అరుగుమీద పెట్టింది. ఆవిన్నీ చూసి బసవమ్మ "అదేమిటే! పిచ్చితల్లీ! ఏడవకు. ఏడిస్తే ప్రయోజన మేమిటి? ఇవాళ క్రొత్తగనకనా! ఎప్పుడూ ఉన్నదానికి ఎన్నాళ్లని ఏడుస్తాము? ఎల్లాగో అల్లాగు సాదు చేసుకోవాలిగాని" అంటూ ఓదార్చింది. రుక్మిణమ్మ ఎదురుగుండా కూర్చుని ఉన్నదున్నట్టు వెక్కివెక్కి ఏడుస్తూ చెప్పుకుంటూ ఉండగా బసవమ్మ అన్నం తింటూ "ఇక ఏడ్పు మానెయ్యి చెల్లీ! ఈ తాటాకుమంట కోపాలకేం! మఱిదికి నే బుద్ధిచెప్తా నుండు" అంటూ ఆవిడకు ధైర్యం చెప్పి తాను భోజనం ముగించింది.

రెండైంది. మూడుగూడా అయింది. నాలుగు కావస్తోంది. గోపాలం ఇంటికి రాలేదు. రుక్మిణమ్మకు ఏమీ తోచలేదు. లోపల్లోపల భర్త యింటికి రాకపోతాడేమోనని అధైర్యం తోచింది. మళ్లీ తానే సమాధానం చెప్పుకున్నది. తల దిమ్మెక్కి బెల్లంకొట్టిన రాయిలా ఒకమూల కూలబడింది. రాముడు గాయం బాధపెట్టి నిద్ర పట్టక పట్టక పట్టి నిద్రపోయాడు. కృష్ణుడెక్కడకో అటూ ఇటూ తిరగడానికి వెళ్లాడు. బసవమ్మకూడా కూర్చునికూర్చుని విసిగెత్తింది. చుట్టుపక్కల ఎవరింట్లోనైనా ఉన్నాడేమో అతనికి తెలియకుండా చూద్దామనుకున్నది. కాని చిన్నవాడా చితకవాడా అతనే వస్తాడు లే అని మళ్లీ అనుకున్నది.

ఇంతలో పొరుగింటి వెంకమ్మ కేకేస్తే రుక్మిణిని ధైర్యంగా ఉండమని చెప్పి తా నక్కడికి వెళ్లింది.

3

సాయంత్రం ఐదుగంటలవేళ గోపాలం ఆవుల్లో మోతుబరిరైతు నాగభూషణాన్నీ, అతని పాలేర్నీ వెంటబెట్టుకొని ఇంటికి చక్కా వచ్చాడు. వస్తూనే ఉత్తరీయం వొంకెను వేసి, "పాతికరూపాయ లిచ్చేసి ఆవును తోలుకెళ్ల వోయ్ నాగభూషణం" అని అన్నాడు. "వట్టి పోట్లగొడ్డని మీారే చెప్తున్నారు కదండీ! పదిహేనురూపాయ లిచ్చేస్తాను తోలిపెట్టండి. పాల ఆశ లేనేలేదుకదా" అన్నాడు నాగభూషణం. "ఆశ లేకపోవడం ఏమిటి? పూటకు రెండుశేర్లు ఇస్తుంది. చేత కాక మే మిబ్బందిపడుతున్నాంగాని, నీ కేం, మహారాజులా తీసుకోవచ్చు. అయినా దాన్ని మూడేళ్లకింద ముప్ఫయిరూపాయిలకు కొన్నాను. యాతన పడలేక, ఇన్నాళ్లూ అనుభవించాంగదా పోనీలే అని అయిదురూపాయల నష్టాని కమ్ముతున్నాను. అస లావు మంచి పుటక గల గొడ్డు. తొలీత పెయ్యదూడను పెట్టిందికాని రెండోయీతకు కోడెదూడను పెడ్తుంది. ముప్ఫై యిచ్చినా నీకు దండగ లేదు. పాతికా యిచ్చెయ్యి" మంటున్నాడు గోపాలం.

నాగభూషణం రెండు పదిరూపాయల నోట్లూ, ఒక ఐదురూపాయల నోటూ తీసి అరుగుమీద పెడ్తూ "సరే! అట్లాగే కానివ్వండి" అని గోపాలంతో అని, "ఒరేయ్! వెంటయ్! ఆవుమెళ్లో పలుపు పెట్టరా" అని పాలేర్ని కేకేశాడు. వా డావుదగ్గఱకు వెళ్లాడుకాని అది మెడమీద చెయ్యి వెయ్యనివ్వడంలేదు. తల తెగ విసురుతోంది. వామిలో గడ్డి లాగి దానిముందు వేశాడు. లొంగదీసుకోడాని కెంత ప్రయత్నం చేసినా అది లొంగడంలేదు.

ఇంతలో రుక్మిణమ్మ ఇంట్లోనుంచి బైటికి వచ్చింది. గోపాల మామెన్ని చూసి "ఆవును అమ్మేశాను. అది వాళ్లకు లొంగడం లేదు. దాని మెళ్లో పలుపు పెట్టి వాళ్ల చేతి కియ్యి. తోలు కెడ్తారు" అని అన్నాడు.

దీని కావిడ "నాకు మాత్రం లొంగుతుందా ఏమిటి? అక్కయ్యను కేకేస్తా నుండండి. అయినా పాతికరూపాయ లేమిటండీ! ఇప్పుడది వందరూపాయలకు తక్కువ కాదు" అని మెల్లిగా అని బసవమ్మను కేకెయ్యడానికి వీథివైపుకు వెళ్లబోయింది.

అంతలో ఆవిడా వచ్చింది. ఆవిడ వెంకమ్మ ఇంట్లో కూర్చుని ఇదంతా ఆలకిస్తూనే ఉంది. వచ్చీరావడంతోనే ఆవిడ నాగభూషణాన్ని చూసింది. "ఏమోయ్! నాగభూషణం! ఆవును తోలుకెళ్లడాని కొంగాని పైకం పాతికే తెచ్చావా, ఎక్కువ తెచ్చావా? పాతికాపరకా వుంటే ఇట్లా యియ్యి, ఇంకో పోట్ల గొడ్డునిగూడా నీ కిస్తాను. తోలుకుపోదువుగాని" అని అన్నది.

నాగభూషణం ఆశ్చర్యపడిపోయాడు. అతని కేమీా అర్థంకాలేదు. తెల్లబోయి చూడ్డం మొదలుపెట్టాడు. అంతలో బసవమ్మ "ఏం, అట్లా చూస్తావేం? దగ్గఱ లేకపోతే ఇంటికి పోయి పంపిద్దుగానిలే. దాన్నిగూడా తోలుకుపో" అని గోపాలంవంక చూపింది. తోటకూరకాడల్లే గోపాలం తల వేలాడేశాడు. నాగభూషణానికి బసవమ్మరౌద్రం చూసి

కాళ్లూ చేతులూ వణకడం మొదలుపెట్టాయి. "ఇంకా చూస్తావేమిటోయ్. వందరూపాయలావును పాతికరూపాయలకు కొట్టుకుపోదామని చూశావుగా! ఇదీ చౌకబేరమే" అని అంటూండగానే నాగభూషణం అరుగుమీది నోట్లు తీసుకుని జేబులో వేసుకుని వెనక్కితిరిగైనా చూడకుండా కాలుగాలిన పిల్లిలా యింటిదారి పట్టాడు.

బసవమ్మ ఆతనివెంబడి నడుస్తూ "డబ్బువుంటే సరేనా! మర్నాడు విన్నవాళ్లేమంటారోనన్న జంకుండాలి" అని అంటూ అతన్ని సాగనంపి వీథితలుపు వేసి వచ్చి "గోపాలం! ఈపద్ధతిప్రవర్తన నాకేమీ నచ్చలేదు. కాస్తకూ కూస్తకూ అంతంత కోపాలు రావడం ఏమిటి? మాట్లాడితే ఆవు నమ్మేస్తానంటావ్. ఏమన్నా అంటే ఇద్దఱు పిల్లల తల్లిని దాన్నిగూడా చెయ్యిచేసుకుంటావు. అసలు పశువుల కున్నంత బుద్ధి మనుష్యుల కుంటే ప్రపంచం ఇదివఱకే బాగుపడేది. పాపం! అది ఎన్నడూ ఆడవాళ్లను పొడవనే పొడవదు. దాని పూచీ నాది. ఇకనుంచీ నువ్వు దాని ఊసెత్తబోకు" అంటూ పెట్టాలిసిన నాలుగూ ఒదినెగారి హోదాలో పెట్టేసింది.

గోపాలం తల వంచుకొని అట్లాగే కూర్చుండిపోయాడు.



# చందవోలు రాజధానిగానున్నప్పుడు

= శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ =

౧

కళింగదేశమునకు దక్షిణమున సముద్రతీరస్థమైన దేశమంతయు క్రీస్తుశకము ఏడవ శతాబ్దినుండి రమారమి పదునొకండవ శతాబ్ది నడిమిభాగమువరకు చరిత్రమున పూర్వచాళుక్యులని ప్రఖ్యాతిగాంచినవారి యధికారమున నుండెను. వీరికి వేంగి, విజయవాడ, జననాథపురములు రాజధానులు. విజయవాడ ఇప్పటి బెజవాడ; జననాథపురము తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురముతాలూకాలోని యిప్పటి దాక్షారామము. వీటిలో వేంగినగరము (పెదవేగి) చాలకాలము ప్రధానరాజధానిగ నుండినందున వీరికి వేంగిచాళుక్యులనియు, వీరి రాజ్యమునకు వేంగిరాజ్యమనియు చరిత్రమున వ్యవహారము కలిగినది. కావ్యగీతిప్రియుండును, ఆంధ్రమహాభారతకృతిపతియు నగు రాజరాజనరేంద్రుడు వేంగిచాళుక్యవంశజుడు. ఇతని కొడుకు రాజేంద్రచోడనృపతి.

వేంగికి దక్షిణమున నుండిన రాజ్యము ద్రవిడదేశాధిపతులైన చోళభూపతులది. వీరి రాజ్యము క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్ది కడపటిభాగముననే యారంభమైనను సాహసవిక్రమార్కుడయిన మొదటి రాజరాజచోళధరణీశుని నాటినుండియే నాలుగుదెసల విస్తరిల్లి యది శత్రుజనభయంకర మయినది. ఈ మొదటి రాజరాజు కాలమున నుండియు చోళభూమీశులు వేంగిరాజ్యాధిపతులతో మైత్రిపాటించి, వారితో సంబంధబాంధవ్యములు నెఱపుచువచ్చిరి. రాజరాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యనరేంద్రుని నాటినుండియు చోళవసుధాధిపతుల యాడుబిడ్డలకు ఆంధ్రధరణి యత్తిల్లయినది. రాజరాజనరేంద్రుడు తన కుమారునికి మేనమామ పేర రాజేంద్రచోడు డనియే నామకరణము గావించెను.

తండ్రియైన చాళుక్యరాజరాజనరేంద్రుని యనంతరము అతని తనయుడు రాజేంద్రచోడుడు అదృష్టము కలసివచ్చి పైతృకమైన వేంగిరాజ్యమునకే కాక మాతామహమైన చోళరాజ్యమునకును అధినేతయై కులోత్తుంగచోడనామమును ధరించి క్రీ. శ. ౧౦౭౦ నుండి ౧౧౨౦ వఱకు రాజ్యమేలెను. ఇతడు రాజధానిని ఆంధ్రదేశమునుండి ద్రవిడదేశమునకుమార్చి తనకొడుకులను దనకు ప్రతినిధులుగ నియమించి వేంగిరాజ్యమును బరిపాలించెను. ఈరాజప్రతినిధులకు జననాథపురము రాజధాని. కట్టకడపటి వేంగిరాజప్రతినిధి విక్రమచోడమహీపతి క్రీ. శ. ౧౦౯౨ నుండి ౧౧౧౮ వఱకు వేంగిరాజ్యమును బాలించెను. కులోత్తుంగచోడచక్రవర్తినాడు వేంగిరాజ్యము ఉత్తరమున గంజాముజిల్లాలోని మహేంద్రగిరి మొదలు దక్షిణమున నెల్లూరుజిల్లాలోని 'మన్నేఱు' వఱకు వ్యాపించినది.

వేంగిరాజ్యమునకు పడుమట వర్ధిల్లినది పశ్చిమచాళుక్యరాజ్యము. ఇది క్రీస్తుశకము పదవ శతాబ్దినారంభమై క్రమముగా పెంపొందినది. పశ్చిమచాళుక్యులకు కన్నడదేశమునందలి బిజాపురమండలములోని కళ్యాణినగరము రాజధాని. చరిత్రమున వీరికి కల్యాణిచాళుక్యులనియు, పశ్చిమచాళుక్యులనియు, కర్ణాటాధీశు లనియు పేరు. సామ్రాజ్యనిర్మాణప్రయత్నమున ప్రారంభమునుండియు చోళులకును,పశ్చిమచాళుక్యులకును వైర మేర్పడి అది యుభయపక్షములను సమానముగ దహించివైచెను. కల్యాణినగరాధీశులును, వేంగిరాజ్యాధిపతులును చాళుక్యవంశజులే యైనను ఇరువురును రెండు కొమ్మలవారు; ఉభయులకు చుక్కెదురు. చోళులతోడి స్నేహబాంధవములకతన వేంగిచాళుక్యులకు, పశ్చిమచాళుక్యులకు ప్రబలవిరోధము.

కులోత్తుంగచోడచక్రవర్తికి సమకాలీను డయిన పశ్చిమచాళుక్యభూపతి త్రిభువనమల్ల బిరుదాంచితు

డయిన విక్రమాదిత్యభూపతి. ఇతనికి విక్రమాంకదేవు డనియు, ఆరవ విక్రమాదిత్యు డనియు, త్రిభువనమల్లు డనియు నామాంతరములు. కులోత్తుంగచోడునివలెనే ఈతడును కడు పరాక్రమవంతుడు; బహుయుద్ధవిజేత. ఇతడు క్రీ. శ. ౧౦౭౬ లో పట్టాభిషిక్తుడై చాళుక్య విక్రమశకమని తన పేర ఒక నూతనశకమును ప్రవర్తింపజేసి ఏబదియేండ్లు ధరాపరిపాలనము సాగించెను. ఇప్పటి తెలంగాణా, రాయలసీమలలోని చాలభాగము విక్రమాదిత్యచక్రవర్తి యధికారమున నుండెను. విక్రమాదిత్య, కులోత్తుంగచోడభూపాలు లిరువురు బద్ధశత్రువులు; ఒకరికొకరు సరియైన యుజ్జి. కులోత్తుంగచోడుని వేంగి రాజ్యమును వశపరచుకొన విక్రమాదిత్యనృపతి కంకణముకట్టెను.

కులోత్తుంగచోడచక్రవర్తి దేశపరిస్థితులను, పశ్చిమచాళుక్యవిక్రమాదిత్యుని తంత్రములను గనిపెట్టి తన తనయులను వేంగిదేశమునకు ప్రతినిధిపాలకులుగ నియమించినను వారికి బాసటగ నుండుటకై ప్రాచీనకాలమునుండియు దమ వంశమును విశ్వాసపాత్రులై సేవించుచువచ్చిన కొన్ని భృత్యవంశములందలి దండనాయకులకు 'జీవితము' లొసంగి, రాజలాంఛనాదికములను ప్రసాదించి వారిని మండలేశ్వరులను గావించెను. యుద్ధమున సైన్యసాహాయ్యమును జేయు దండనాయకుని కిచ్చు వృత్తిని (జాగీరు) జీవితమందురు. క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దికడపటిపాదమునాటి రాజకీయపరిస్థితి యిది.

ఈవిధమయిన రాజకీయపరిస్థితులలోనే మండలికవంశము లనేకములు వేంగీభూతలమున వెలసి, సమర్థులును ప్రతాపమహితులు నయిన మండలేశ్వరుల నుదయించిరి. ఈ మండలికులు చాళుక్యరాజ్యమూలస్తంభములై ప్రతిష్ఠగాంచిరి. ఈ కారణమున రాజరాజనరేంద్రమరణానంతరకాలము ప్రాగాంధ్రదేశచారిత్రమున మండలికయుగముగ రూపొందినది. ఓరుగంటి కాకతీయనృపాలుర ప్రాగాంధ్రదేశవిజయముతో మండలికయుగ మంతరించును.

ఈ మండలికయుగమున ధనదాధిపురమను ద్రోసిరాజని వెనుకకు నెట్టివైచి రాజకీయముగ మొట్టమొదట ప్రాముఖ్యమును గడించినది చందవోలు.

౨

"పుష్పకనివహంబు భూమిపై నిలిచిన
యట్లందమైన దేవాలయములు
రూప్యాచలము బహురూపంబుల నటించు
రమణ శోభిల్లు సౌధముల పెల్లు
అలకాధిపతినిధు లన్నియు వెలివీట
విడిసిన క్రియఁ బణ్యవీథికలును
ధాత మేదిని మిన్నుఁ దఱిఁగివైచినమాడ్కిఁ
గనుపట్టు బహుతటాకముల సొంపు
నుపవనంబులు సరసులు నొప్పుచేయఁ
జెలువుఁదోఁటలుఁ బ్రాసంగుచేలు మెఱయ
నఖిలవిభవములకు నెల నగుచు వెలయు
ధనదు పురమున కెనయగు ధనదుపురము"

చందవోలికి ధనదుపుర మని, ధనదుప్రోలని నామాంతరములు. చందవోలన్నది ధనదుప్రోలు, ధనదుప్రోలన్న పదముల వికృతి. ఈగ్రామము రేపల్లె తాలూకా గుంటూరుజిల్లాలోనిది. క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దినిది ప్రాగాంధ్రదేశమునకు రాజధానియై గొప్ప వైభవము ననుభవించిన నగరము. చందవోలు రాజధానిగ ఆంధ్రదేశమును రమారమి నూటపాతిక సంవత్సరములు రాజ్యమేలినవారు చతుర్థకులజులైన దుర్జయులు.

చాళుక్యచోళచక్రవర్తియైన మొదటి కులోత్తుంగచోడమహీధవునివలన మండలికపదము నందిన వంశములలో ఈ దుర్జయవంశము మొట్టమొదటిది. ఇతరమండలికవంశము లన్నియు దీనికిపిదప తలయెత్తి వర్ధిల్లినవే. ఈ దుర్జయవంశజులు చరిత్రమున వెలనాటి భూవరు లనియు, వెలనాటి గొంకరాజు లనియు, వెలనాటి చోడు లనియు వ్యవహరింపబడుచున్నారు. వెలనాడు ఈ దుర్జయులకు కాణాచియగుటవలన వీరు వెలనాటి భూపతు లని పేర్వడిరి.

వెలనా డనునది ప్రాచీనాంధ్రదేశవిభాగములలో ఒకటి. ప్రాచీనకాలమున ఆంధ్రదేశమునందలి దేశవిభాగమునకు 'విషయ'మని, 'నా'డని, 'రాష్ట్ర'మని సంజ్ఞ యుండెను. క్రీస్తుశకము పదునొకండవ శతాబ్ది

పూర్వ మిది మూడును సమానార్థకములుగనే యుండి నను పదునాలుగు, పదునైదవ శతాబ్దులనుండియే రాష్ట్రమన్నది నాడువిషయములకంటె అధికవైశాల్యము గల ప్రదేశమునకు ప్రయుక్తమగుచువచ్చినది. మొట్టమొదట నీరీతిని పాకరాష్ట్రము, పాకనాడు, పాకవిషయము అనునవి సమానవాచకములు. ప్రాచీన శాసనములలో వెలనాటియం దుండినట్లు తెలుపబడిన చాలగ్రామముల కిప్పటికిని కొద్దిమార్పుతో ఆ ప్రాచీన నామములే చెల్లుచున్నవి. ఈ గ్రామములను గుర్తింపగా గుంటూరుమండలమునందలి రేపల్లె, తెనాలి, బాపట్లతాలూకాలును, కృష్ణామండలమునందలి దివి తాలూకాయును పూర్వము వెలనాడని వ్యవహరింపబడుచుండినట్లు తెలియుచున్నది. 'తుంగభద్రాతరంగిణ్యాః ప్రాగ్దేశం వెలనాడితి' — తుంగభద్రానదికి తూర్పున నున్న దేశము వెలనాడు. ఈ తుంగభద్ర గుంటూరు మండలములోని చిన్న యేఱు; డి. సి. డబ్ల్యు. వారి కృషి వలన నిది ప్రస్తుతము మురుగుకాల్వగ రూపొందినది.

వెలనాడు షట్సహస్రవిషయము — ఆఱువేల దేశము. ప్రాచీనదేశవిభాగములైన విషయములకు, నాడులకు ఇట్లు ఏంతో కొంత సంఖ్య చేర్చి చెప్పుట ప్రాచీనసంప్రదాయము. 'పాకనాటియం దిరువదియొక్క వేయిటి కధీశుండు నాఁజను చోడబల్లికికిఁ' అని కుమారసంభవపాఠము. 'అరుదందగ వెలనాటి చోడమనుజేంద్రాజ్ఞాపనం బూని దుస్తరశక్తిం జని, యేకవింశతిసహస్రగ్రామసంఖ్యాకమై ధరణిం జేర్చిన పాకనాడని మంచనకవికృత కేయూరబాహుచరిత్రము. ఈ యుదాహరణముల ననుసరించి యాఱువేలన్నది కూడ గ్రామసంఖ్య యనుట నిర్వివాదము. ఎంత పరిమితిని సూచించినను గ్రామ మన్నది పూర్వము రాజకీయసౌధమున కెట్లు పునాదిగ నుండెనో యట్లే దేశవిస్తీర్ణమును దెలుపుటకుకూడ అది కొలమానముగ నుండినట్లు పై యుదాహరణములు విస్పష్టపఱుచుచున్నవి.

వెలనాటి దుర్జయులకు వెలనాడు జన్మభూమి. తాము మధ్యదేశమునుండి వచ్చినట్లును, తమ పూర్వుడయిన మల్లభూపతి త్ర్యంబకపల్లవమహారాజుకు యుద్ధమున సాయముచేసి ఆ పల్లవేశ్వరునివలననుండి సామంతరాజచిహ్నములతో వెలనాడను షట్సహస్ర విషయమును బడసినట్లును వీరు తమ శాసనములయందు దెలుపుకొనియున్నారు. త్ర్యంబకపల్లవునికి త్రిలోచన పల్లవుడు, త్రినయనపల్లవుడు అని నామాంతరములు. కరికాలచోళమనుజేంద్రుడును, ఈ పల్లవనృపతియు సమకాలీను లనియు, చోళరాజితనిని సమరమున జయించె ననియు పరంపరగ వచ్చు గాథలు తెలుపుచున్నను ప్రాచీనపల్లవరాజవంశములలో ఆ పేరు గల నరేంద్రు డెవ్వరును లేనందున కొందఱు చరిత్రకారులు అతని యస్తిత్వమునే సంశయించుచున్నారు కాని మఱి కొంద ఱట్టి నృపతి యుండె ననియు, త్రిలోచనపల్లవు డనునది అసలు పేరు కాక నామాంతర మనియు వాడంచుటయే కాక అతడు క్రీస్తుశకము అయిదవ శతాబ్దియందుండె ననియు నిర్ణయించుచున్నారు. ఈ నిర్ణయము ననుసరించి చూచినచో వెలనాటి గోంకవంశము క్రీస్తుశక మయిదవ శతాబ్దినుండి యుండె నని చెప్పవచ్చును.

వెలనాటి దుర్జయులు మొదటినుండియు, పల్లవుల యనంతర మీపూర్వాంధ్రదేశము నాక్రమించుకొని పరిపాలించిన వేంగీచాళుక్యులను సేవించి వారికి భృత్యులై, దండనాయకులై వర్ధిల్లిరి. పైని చెప్పిన మల్లభూపతి వంశమువారిలో మల్లియ యనునతడు చాళుక్య వంశ్యుడైన నరేంద్రమృగరాజవిజయాదిత్యుని యనుచరుడట. మఱియొక మల్లియ చాళుక్య భీమమహారాజు ననుచర ప్రధాని. కుడియవర్మ యను మఱియొకడు విమలాదిత్య భూపతి వలన నుండి గుద్రవార విషయమును బడసెను. ఇతని కుమారుడు నన్నియ విమలాదిత్య తనయుడైన రాజరాజ నరేంద్రుని సేనాధిపతియై ఆ మహారాజు ననుగ్రహమున గుద్రవాటి విషయమును సంపాదించెనట. ఇతడే వెలనాటి దుర్జయరాజ వంశకర్త. ఇతనికాలమునుండియే వెలనాటివంశ మభ్యుదయము గాంచినది. పైని చెప్పిన విషయములలోని యాథార్థ్యమును దెలిసికొనుటకు క్రీస్తు శకము పదునొకండవ శతాబ్దికి పూర్వపు శాసనము లీ వంశమువారివి కానరాలేదు. అందువలన మనము వాటిని విశ్వసించినను విశ్వసింపక పోయినను వెలనాటివారు తరతరములనుండి వేంగీ

చాళుక్య నృపతులను గొలిచి వారి యనుగ్రహవిశేషము కలిమిని రాజకీయముగ ప్రాముఖ్యమును బడసిరనియు, నన్నియనాటినుండియే యీ వంశమున కుచ్చదశ యారంభ మనియు విశ్వసింపవచ్చును.

## 3

రాజరాజనరేంద్రుని సేనాధిపతియగు నన్నియకు అయుగురు కుమారులు. వారిలో వెదురయ్య మొదటివాడు. వేంగిదేశమునకు రాజప్రతినిధిగ వచ్చి దానిని క్రీ. శ. ౧౦౮౮ నుండి ౧౦౯౨ వరకు బరిపాలించిన వీరచోడ నరపాలుని కొలువున నుండినవాడు. వీరచోడ నరపతి నాటినుండియే వేంగిదేశముపై పశ్చిమ చాళుక్య చక్రవర్తుల దండయాత్ర లారంభ మైనవి. తమకు సామంతులైన పాండ్య నాయకులతో గలసి పశ్చిమ చాళుక్యులు చాళుక్య విక్రమ శకమునందలి అయిదవ, ఆఱవ సంవత్సరములకు సరియైన క్రీ. శ. ౧౦౮౧, ౧౦౮౨ సంవత్సరములలో వేంగిపై దాడెత్తి వచ్చి తాత్కాలికముగ గోదావరీనదీ ప్రాంతీయ దేశము నాక్రమించుకొనిరి. వెదురయ్య సాయముతో వీరచోడ రాజకుమారుడు పశ్చిమ చాళుక్య సైన్యములను, వారి సామంతులను అనతికాలముననే వేంగినుండి పాఱద్రోలి తన రాజ్యము నిష్కంటకము కావించెను. వెలనాటి వెదురయ్య పశ్చిమచాళుక్య సామంతుడైన పాండ్య దేవధరావరుని సంగ్రామమున నిర్జించి తన ప్రభువు వీరచోడనికి ప్రియ మొనరించెను. ఈ పాండ్యదేవుడు బళ్లారి ప్రాంతమందలి ఉచ్చంగి రాజధానిగ బరిపాలించిన పాండ్యవంశ్యుడు; త్రిభువనమల్ల బిరుదాంకితుడు; ముప్పదిరెండువేల నొలంబవాడి దేశమున కధీశ్వరుడు. ఇతని శాసనములు సరిగా క్రీ. శ. ౧౦౭౬ నుండియే కానవచ్చుచుండుటచేత నితడు ఆ ప్రాంతముననే రాజ్యమునకు వచ్చియుండును. ఈ విజయమునకు సంతోషము నొంది వీరచోడరాజేంద్రుడు వెదురయ్యకు అర్ధసింహాసనమును, సింధుయుగ్మాంతర దేశమున కాధిపత్యము నిచ్చెను. సింధుయుగ్మాంతర దేశమన్నది కృష్ణా గోదావరీనదుల మధ్యప్రదేశమని కొందఱును, కోనవిషయము (కోనసీమ) అని కొందఱును ఊహించుచున్నారు.

వెదురయ్య సోదరుడు గొంకయ్య. ఇతడుకూడ ఈ సంగ్రామమున సాహాయ్యము చేసినందున ఇతనికి వేంగీ చాళుక్య జనపతులు సమస్త సేనాధిపత్యము నొసంగిరి. ఈ గొంకయ్య మొదటిశాసనము క్రీ. శ. ౧౦౭౬ నాటిది గుంటూరు మండలమునందలి చేబ్రోలులో గానవచ్చినది. ఇదియే వెలనాటి దుర్జయులదిగ దెలియవచ్చు మొట్టమొదటి శాసనము.

కర్ణాటాధీశులు తమకు గలిగిన పరాజయముతో నిరుత్సాహులు కాలేదు. వారు తమకు మిత్రులయిన గంగవంశజులగు కళింగాధిపతులను వేంగిపై దాడెత్త బురికొల్పిరి. త్రిభువనమల్ల విక్రమాదిత్య నియోగమున కళింగాధిపుడు అనంతవర్మ చోడగంగ సైన్యసమేతుడై వేంగీ రాజ్యముపై నెత్తివచ్చెను. ఈ దండయాత్ర విక్రమచోళ రాజకుమారుడు రాజప్రతినిధిగ వచ్చిన మొదటి సంవత్సరములలో జరిగినది. కులోత్తుంగ చోడచక్రవర్తి కాలమున ప్రత్యేకముగ కళింగ దేశాధిపతులతో జరిగిన ప్రథమ సంగ్రామ మిదియే. ఈ కళింగ యుద్ధ ప్రస్తావము కులోత్తుంగచోడ చక్రవర్తి శాసనములలో మొదటిమాఱు అతని యిరువదియాఱవ రాజ్యసంవత్సరమునకు సరియగు క్రీ. శ. ౧౦౯౬ నుండి కానవచ్చుటచేత ఈ సమరము దీనికు పూర్వము క్రీ. శ. ౧౦౯౨-౧౦౯౬ సంవత్సరముల నడుమ జరగియుండవలెను.

చోడగంగుడు వేంగీదేశ సామంత మండనాయకుల లోనే రాజద్రోహమును, కుట్రలను పురికొల్పెను. కొలనిపురము- కొల్లేటికోట- రాజధానిగా తత్పరిసర ప్రదేశము నేలుచుండిన భీమనృపతి రాజప్రతినిధి విక్రమచోడునిపై ఈతరుణముననే తిరుగబాటు చేసి విప్లవధ్వజము నెత్తెను. ఈ విప్లవ, దండయాత్రల నడచి అనంతవర్మచోడగంగుని శిక్షించుటకు కులోత్తుంగచోడ చక్రవర్తి తన కుమారునికి బాసటగ ద్రవిడదేశమునుండి పరాంతకపాండ్య దండనాథుని సేనలతో వేంగికి బంపెను. పరాంతకపాండ్యుడు మధుర పాండ్య వంశ్యుడు. పరాంతక పాండ్యుడును, వెలనాటి గొంకయ్యయు, కొలనిపురపు కోటను ముట్టడించిరి. గొంకయ్య కుమారుడు వెలనాటి చోడనాయకుడు. ఈ

ముట్టడియందు ప్రధాన పాత్రమును గైకొని ఈ సందర్భమున ప్రవర్తిల్లిన భయంకర యుద్ధమున అఖండ పౌరుష పరాక్రమములను జూపి కొలని భీమ నాయకుని గథావశేషుని కావించెను. అనతికాలముననే అనంతవర్మచోడగంగు పరాజితుడై కళింగమునకు బాఱిపోయెను. చాళుక్య చోళవాహిని ఆ గంగవంశ్యుని వెన్నంటి తఱుముటయే కాక కళింగమునుగూడ విధ్వంసము కావించినది.

ఈ యుద్ధమున గొంకయ్యయు, అతని కొడుకు చోడయ్యయు జూపిన రాజభక్తివిశ్వాసములకును, శౌర్యసాహసములకును అలరి కులోత్తుంగచోడచక్రవర్తి గొంకయ్యకు షట్సహస్రావని - ఆఱువేలదేశము నిచ్చి యతనిని మండలేశ్వరుని గావించెను. ధనదుప్రోలు అతని రాజధాని. సామంతరాజచిహ్నవిభూషితుడయిన వెనుక వెలనాటి గొంకభూపతి త్రిపురాంతకమున కరిగి - తన యిష్టదైవమైన త్రిపురాంతకేశ్వరుడు - అదేవదేవునికి సుండేటి (గుండ్లకమ్మ) తీరమున నున్న చెటలపాడను గ్రామమును ఆస్వామి సాపదీపనైవేద్యములకు సమర్పించి దానశాసనము వ్రాయించెను. క్రీ. శ. ౧౧౦౮ నాటి యీశాసనమున చతుర్థకులజలనిధిసుధాంశు, చలమర్తిగండ, సహాకారవల్లభ, భుజబలభీమ, రణరంగరాక్షస, దాయగజకేసరి మండలేశ్వరపద ప్రతిష్ఠాసూచకమైన యతని బిరుదప్రశస్తి మొదటిమాఱు కనబడుచున్నది.

## ౪

వెలనాటి గొంకభూపతి క్రీ. శ. ౧౦౭౬ మొదలు ౧౧౦౮ వఱకు వేంగిసింహాసనాధిపులను భక్తితాత్పర్యములతో గొలిచి కీర్తిగాంచెను. ఇతని రాజ్యకాలము చరమభాగమున క్రీ. శ. ౧౧౦౬ ౧౧౦౭ లో మఱల కర్ణాటాధీశులును, కళింగాధిపతులును గలసి వేంగిరాజ్యముపై దండెత్తివచ్చిరి. ఈతడెవని కూడ కళింగేశ్వరుడు అనంతవర్మచోడగంగు మున్నెందు లేని సైన్యములతో వచ్చి వేంగిజనపదములను విధ్వంసము కావించెను. త్రిభువనమల్ల విక్రమాదిత్య ప్రేషితుడై అనంతవర్మచోడగంగునకు సాహాయ్యముగ వచ్చినవాడు పశ్చిమ చాళుక్యసంధివిగ్రహి (Minister for peace and war) కామనయ్యదండనాయకులు. రాజప్రతినిధి విక్రమచోడుడును, వెలనాటి వంశ్యులును దేశసంరక్షణమున అప్రమత్తులై యుండుటచే శత్రువులు పరాజితులై ఇదివఱకువలెనే పలాయనపాఠమును చిత్తగించిరి. వనుకటివలెనే కులోత్తుంగచోడచక్రవర్తి తన కుమారుడు విక్రమచోడుని సాహాయ్యార్థము కరుణాకర తొండైమాన్ అను విశ్వాసపాత్రుడైన తన దండనాయకుని సైన్యముల నిచ్చి పంపెను. కులోత్తుంగచోడచక్రవర్తిరాజ్యకాలమున జరగిన ఈ ద్వితీయకళింగమహాసంగ్రామము తమిళమున జయంగొండారుకవిరచితమైన 'కళింగత్తుప్పరణి'యందు మహాభారతయుద్ధమువలె అభివర్ణితమైనది. ఈ యుద్ధము సాగుచుండిన కాలముననే వెలనాటి గొంకనృపతి కాలధర్మము నొందియుండును. ఇక నటుతరువాత ఈతని శాసనములు గనరావు.

ఈ యుద్ధమున విజయము చేకూర్చినపిదప కులోత్తుంగచోడచక్రవర్తి వెలనాటి గొంకవిభుని తనయుడయిన చోడనృపుని తన పుత్రునివలెనే ఆదరించి తన కుమారులవలెనే సామంతరాజచిహ్నాంకితుని గావించి పదునాఱువేల వేంగిభూతలమున కతని నధిపతి గావించెను. ఇతనికి వెలనాటి కులోత్తుంగచోడుడని, కులోత్తుంగ రాజేంద్రచోడుడని నామాంతరములు. ఇతడు వెంగిభూతలమును క్రీ. శ. ౧౧౦౮ నుండి ౧౧౩౨ వఱకు పరిపాలించెను.

వేంగిరాజ్యమునుండి కులోత్తుంగచోడచక్రవర్తి తన ప్రియతనయుడు విక్రమచోడుని ద్రవిడదేశమునకు పిలువనంపించి క్రీ. శ. ౧౧౧౮ లో అతనిని యౌవరాజ్యమున నభిషేకించెను. యౌవరాజ్యాభిషేకము జరపిన రెండుసంవత్సరములకే కులోత్తుంగచోడచక్రవర్తి దివంగతుడైనాడు. కులోత్తుంగుని యనంతరము చాళుక్యచోళసామ్రాజ్యమునకు ప్రభువైనాడు విక్రమచోడభూపతి.

విక్రమచోళభూరమణుడు ద్రవిడదేశమున కరిగిన యంతనే వేంగియందు మరల విప్లవము రేగినది. కర్ణాటాధీశులు దాని నూది మఱింత ప్రజ్వలింపజేసిరి. గోదావరికి దూర్పున నున్న దేశమునందలి కోటకొత్తళములమీద విప్లవపతాక లెగిరినవి. పశ్చిమ చాళుక్య

దండాధినాథులు తమ సైన్యములను దీసికొని వేంగీరాజ్యముపై నెత్తివచ్చిరి. ఈ తడవ రాజ్యసంరక్షణభారమంతయు వెలనాటి చోడరాజుపై బడినది. కులోత్తుంగ చోడుని వలెనే విక్రమచోళ నరేంద్రుడుకూడ వెలనాటిచోడునికి సైన్యసహాయ మంపియుండు ననుట నిక్కము. వెలనాటి చోళుడు వేంగీరాజ్యమును గాపాడుటకు జేయవలసిన దంతయు జేసి శత్రుసైన్యము వేంగీ పశ్చిమసీమావధులను దాటిరాకుండ దాని నెదుర్కొనెను. ఉభయబలములకును పెక్కుపోరాటములు జరిగినవి. విజయవాడ ( బెజవాడ ) సంగ్రామమున వెలనాటి చోడ భూపతియే విజయలక్ష్మిని బరిగ్రహించి చాళుక్యచోళ ప్రతిష్ఠను కాపాడెను. ఒక్క సామంత మండలేశ్వరుడు తన సైన్యముల నోడించుట తలచుకొన్న త్రిభువనమల్లు డయిన విక్రమాదిత్య చక్రవర్తికి ఒడలెల్ల భగ్గురని మండిపోయినది. అతని కన్నులు నిప్పులవాన కురిసినవి. ధనదుపురమును భస్మావశేషము కావించి, వెలనాటిచోడుని గెడపిపుచ్చి వేంగీరాజ్యమును జయింప విక్రమాదిత్యుడు మరి కృతాంతుడును, సాహసోత్తుంగుడును అయిన అనంతపాల దండనాయకుని నియోగించెను.

అనంతపాల దండనాథుడు మహాసామంతాధిపతి. మహా ప్రచండ దండనాయకుడు. రణరంగరాఘవు డయిన మహేశ్వరదండనాయకుని పుత్రుడు. ఇతడు విప్రకులోత్తముడట. అరియంకభీము లని ప్రఖ్యాతి వహించిన గోవింద దండనాయక, లక్ష్మణ దండాధీశులు అనంతపాలుని మేనల్లుళ్ళు. వీ రందరువిక్రమాదిత్య చక్రవర్తికాలమువన నుండి పశ్చిమచాళుక్యరాజ్యమునకు పేరుపెంపు లొనగూర్చి దానిని శత్రుజనభయంకరము కావించినవారు. తన బంధు బలముతో తురగరేఖారేవంతులతో, ఆనెయసాహిణులతో, సామంత రాజన్యులతో, మహాసముద్రము ననుకరించు మహావాహినితో అనంతపాల దండనాయకుడు వేంగీ రాజ్యముపై నెత్తివచ్చెను. అతని సేనాసముద్రమున కడ్డు మాకలు లేకపోయినవి. వేంగీసైన్యము అనంతపాలుని ప్రచండధాటికి భిన్నాభిన్న మయినది. ఈ మహాసంగ్రామమున వెలనాటి రాజేంద్ర చోడ భూపతియు, అతని తనయుడు గొంకమహీధవుడును (రెండవ గొంక భూమీశుడు) కూడ అప్రతిమాన పరాక్రమమును జూపి తెంపరితనముతో బోరాడిరి. వారు చందవోలి కోటను దుస్సాధము కావించిరి. శత్రుసైన్యము విజయవాడ దరియకుండ ప్రయత్నించిరి. అటుపిదప రాజమహేంద్రవర, జననాథపురములను కాపాడుకొనిరి. కాని ఏమి ప్రయోజనము? అనంతపాలుడు మహాప్రచండ దండనాయకు డయ్యె. పశ్చిమచాళుక్య దండనాథులు పూర్వ పరాభవాగ్నిని చల్లార్చుకొన దీక్షాకంకణము దాల్చిన కాకలుదేరిన మహాయోధు లైరి. ఇక వేంగీశరాధినాథులకు విజయ మెక్కడ? కుతకుతలాడు ఉడుకు రక్తముతో పడుచు ప్రాయమున నున్న గొంక భూవరుడు సమరాంగణమున తండ్రి నిమించిన కొడుకై విక్రమించెను. కాని ప్రయోజనము లేకపోయినది. విజయవాడ విధ్వంస మయినది. ధనదుపురదుర్గము దగ్ధమయినది. పూర్వచాళుక్య మను జేంద్రుల మొదలిదుర్గము వేంగి విలయమయినది. ఈ మహావిజయధాటిలో అనంతపాలుని పతాక జననాథపురదుర్గముపై చిత్రలాస్యము చేసినది. వెలనాటిచోడ మహీపతి శౌర్యసాహసములకంటెను అతని కుమారుడు గొంకభూవిభుని సంగ్రామవిద్యా వైదుష్యము, శరలాఘవప్రశస్తి అనంతపాల దండనాయకుని చంచల స్థైర్యవృత్తినే కంపింపజేసినవి కాబోలు. అతని శాసనములయందు తాను గొంకభూపతి నోడించినట్లె చెప్పును కాని చోడరాజును గెలిచినట్లు తెలుపడు. అట్టిది ఇమ్మడి గొంకనరేంద్రుని శౌర్యమహిమ. ఏమయిననేమి, వేంగికి మాత్రము పరాధీనత తప్పలేదు. కర్ణాటాధీశుల కీ వేంగీవిజయము క్రీ. శ. ౧౧౧౫లో విక్రమచోళ చక్రవర్తి ద్రవిడదేశమున కరిగిన వెంటనే సమకూరినది.

త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు పూర్వాంధ్రరాజ్యమునకుగూడ ఏలికయైనాడు. వెలనాటి చోడ మహీభర్తయు, అతని సామంత దండనాయకులును పశ్చిమచాళుక్య సింహాసనమునకు ప్రణమిల్లి కానుకలర్పించినారు. పశ్చిమచాళుక్యరాజప్రతినిధియై అనంతపాలదండనాయకుడు విజయవాడ రాజధానిగ వేంగీ రాజ్యమును బరిపాలించెను. అతని మేనల్లుడయిన గోవిందదండాధిపతి కొండపల్లిదుర్గమున కధిపతిగా నియమితు డయ్యెను. ఆంధ్రదేశమున నేదుర్గముపై

జూచినను కర్ణాటరాజేంద్రుల పతాకలే. చాళుక్యవిక్రమశకము ఆంధ్రదేశమున ప్రవర్తితమై చాళుక్యరాజ విజయమునకు సంకేత మయినది.

వేతులు కల్యాణిచాళుక్యమనుజేంద్రులకు జోతలు సమర్పించుచునేయున్నను వెలనాటి చోడయ్య హృదయమున్మాత్రము చాళుక్యచోడనృపాలచరణకమలముల నారాధించుచునేయుండెను. శౌర్యమూర్తియు, మానధనుడు నైన అతని కుమారుడు గొంకయ్యకీపారతంత్ర్యము దుర్భరమైనది.

ఇట్లుండ క్రీ. శ. ౧౧౨౬ లో పశ్చిమచాళుక్య చక్రవర్తి విక్రమాదిత్యనృపతి విధివశము నొందెను. ఇదియే యదనని వెలనాటి చోడభూమీశుడును, అతని కొడుకు గొంకనరేంద్రుడును విక్రమచోడచక్రవర్తితో రహస్యముగ రాయబారములు నడపిరి. కాళహస్తిలో అందఱును సమావేశమయిరి. తంత్రప్రతితంత్రము లాలోచించుకొనిరి. కాళహస్తీశ్వరుని సన్నిధానమున వేంగిని పారతంత్ర్యమునుండి విడిపింతు మని కత్తిముట్టి బాసచేసిరేమో దుర్జయరాజచంద్రులు కొలది కాలముననే వేంగిరాజ్యమున విప్లవపతాకలు రెపరెపలాడినవి. విక్రమచోళచక్రవర్తిసేనలు గుంటూరుమండలమునందలి చేబ్రోలుదాఁక విజయయాత్ర సాగించినవి; కాని యంతమాత్రమున ప్రయోజనము లేకపోయినది. కొండపల్లికటకాధీశుడయిన గోవిందదండాధిపతి విక్రమచోడసైన్యాని నరికట్టి పాఱద్రోలుటయేకాక అశ్వగజాందోళికాదివాహనాదికములను, ధనకనకరత్నాదికములను మూఁగలాడి చోడరాజ్యమున గొంత దేశమును గూడ నాక్రమించుకొనెను. మహాసామ్రాజ్యాధినాథుడు విక్రమచోడరాజునికే అట్టిగతి పట్టినపుడు ఇక దుర్జయవంశ్యులైన చోడ, గొంకనృపతుల సంగతి చెప్పనేల?

అయినను ఈ పరాజయము శౌర్యైకధనుడును, ప్రభుభక్తిపరాయణుడును అయిన గొంకయ్యకు నిరుత్సాహము పడలేదు. అతడు వేంగిరాజ్యమును కర్ణాటభూపతుల దాస్యమున నుండి విముక్తము కావింప రహస్యముగ తంత్రములు పన్నెను. దుర్జయులకు వెనుకటికంటె నిర్బంధము లధికమైయుండు ననుటకు సందియము లేదు. విజయవాడకారాగారమున బంధితులుగకూడ నుండిరేమో వారు. ఒకవేళ నట్లుండినచో శీఘ్రకాలముననే వారు మాయోపాయమున చెఱనుండి తప్పించుకొనిపోయి యేకొండకోనలయందో దాగియుండవలెను; అచటనుండియే యీతడవ పశ్చిమచాళుక్యాధికారవిధ్వంసమునకును, చాళుక్యచోళాధికారప్రతిష్ఠాపనమునకును రహస్యముగ నఖండప్రయత్నము చేసిరి.

విక్రమాదిత్యచక్రవర్తి యనంతరము పశ్చిమచాళుక్యసింహాసనము నధిష్ఠించిన యతని తనూభవుడు భూలోకమల్లసోమేశ్వరుడు ఒకవేళ నీదుర్జయభూపతులు చెఱనుండి తప్పించుకొని పాఱిపోయిన కారణముననేమో వేంగిరాజ్యపరిపాలనము సరిగా లేదని కావచ్చు అనంతపాలాదిదండనాయకులను కర్ణాటదేశమునకు బిలువనంపి వారికి బదులుగ గోవిందదండనాయకుని, అతని కుమారుడు దండాధిపలక్ష్మరాజును, సిద్ధరాజదండనాయకుని, అతని యాత్మజుడు మహాప్రధాని కేశిమయ్యదండనాయకుని వేంగిరాజ్యపాలనమునకు నియోగించెను.

తమ ప్రయత్నములు పూర్తియైనపిదప క్రీ. శ. ౧౧౩౨ లో వెలనాటి కులోత్తుంగచోడయ్యయు, అతని కొడుకు ఇమ్మడిగొంకయ్యయు బలములను గూర్చికొని పశ్చిమచాళుక్యకటకాధిపతులమీద కత్తులందూసిరి. వెలనాటి గొంకయ్య మేనమామ పండయ్యయు, బావమఱది గొంకయ్యయు వరూథినీప్రధాననాయకులై వ్యూహతంత్రరచనాపరతంత్రులైరి. కృతహస్తులైన ధానుష్కవీరులతో, కొంతకులతో, ఖడ్గఖేటకధారులైన పదాతులతో దుర్జయసేన కిటకిటలాడుచు మహావాహినిననుకరించుచుండెను. నీతిబృహస్పతులైన ప్రెగ్గడలు, భండనభీములును, రణరంగరాఘవులు నైన నాయకులు, సెట్లు మొదలైనవారు దేశమును పారతంత్ర్యమునుండి విముక్తినొందింప విప్లవపతాకచ్ఛాయను గుమిగూడిరి. వేంగియందలి పశ్చిమచాళుక్య ప్రధాని, సామంత, ధ్వజినీనాథులు ఏకమై మంతనములు సలిపి సేనలను నడిపించుకొని స్కంధావారములు తీర్చుచుండిరి. కళింగదేశాధిపతులు పశ్చిమ చాళుక్య భూనాథులకు

సాహాయ్యముగ వచ్చిరి. అది యపూర్వ మయిన మహాసేనావిన్యాసము. వేంగి మహారణక్షోణి యైనది. రాజసేవాతత్పరులకు, విప్లవోద్యమ నాయకులకు ప్రతి జనపదమున కలహములు రేగినవి. కర్ణాట రాజ సైన్యములును, దుర్జయ నృపాల సైన్యములును, గోదావరి తీరమున గలసికొన్నవి. అప్పుడు దారుణమైన మహా సంగ్రామము జరిగినది. ఈ గోదావరీ మహా సంగ్రామమునకు సంబంధించిన కథలు తెలుగునాట జాలకాలమువఱకు జెప్పుకొనువారు. తరువాతి కాలము నాటి ఓరుగంటి కాకతీయరాజన్యుల ఆంధ్రదేశ విజయ గాథలయందు ఇవి పేలవములై చెన్నుమాసి యడగారి పోయినవి. ప్రాయికముగ ఈ సంగ్రామ కాలముననే కావచ్చును వెలనాటి చోడనృపతి కాలధర్మము నొందెను. అంతకు పూర్వమే ఒక సంవత్సరమునకు ముందు విక్రమచోళచక్రవర్తి స్వర్గస్థు డయ్యెను. విక్రమచోళుని యనంతరము సింహాసనమెక్కిన యతని పుత్రుడు ఇమ్మడి కులోత్తుంగచోడచక్రవర్తి వెలనాటి గొంకభూపతి కే విధమునను సాయము చేసినట్లు కానరాదు. సర్వసైన్యాధిపత్యమును దాన వహించి ఇమ్మడి గొంక నృపుడు వీరరుద్రుడై సమరాంగణమున వీరవిహారము సల్పెను. ప్రళయాంతకుని వలె విజృంభించిన యాతని వీరావేశములో, శౌర్య ప్రతాపతాండవాటోపములో శత్రువులు ఎదిరించి నిలువగల నిబ్బర మెక్కడ? తుదకు గొంకభూపతి గోవిందదండాధిపతిని, లక్ష్మణదండనాయకుని, మహాప్రధాని కేచిమయ్యను, ఇంకను బిరుదప్రశస్తిమహితు లైన ఇతరకర్ణాటవీరధ్వజినీనాథులను ఓడించి, వారి హాటకఘోటకఉష్ట్రములను కొల్లలాడి కుంతల, లాట, కళింగసైన్యములను జించి చెండాడి చిందఱవందఱ కావించెను. హతశేషులు పంచకరపాట్లు పడి తమతమ దేశములను జేరుకొనిరి. భూలోకమల్లు నోడించి తన దుర్జయత్వము సార్థకముచేసికొన్న శంకరకింకరుడు గొంకభూపతి వేంగిరాజ్యమునందు పశ్చిమచాళుక్యాధికారమునకు స్వస్తిచెప్పెను. పిదప అతడు తన ప్రభువు చాళుక్యచోళచక్రవర్తి కులోత్తుంగచోడునికడ కరిగి వినయవినమితోత్తమాంగుడై ప్రణమిల్లి శత్రువు సేనాశిబిరములనుండి దోచుకొన్న బంగారము, గుఱ్ఱములు, ఒంటెలు మొదలైన వన్నియు నిర్విశేషముగ ఆప్రభువు పాదసన్నిధి నుంచి, "మీరు మావంశప్రభువులు, ఈ విజయము మీది; వేంగిరాజ్యము మీది; నేను మీకు విధేయసామంతుడను; అనుగ్రహింపు"డని పలికెను. ఇట్టి రాజభక్తిపరాయణత, ఇంతటి స్వామికార్య తత్పరత కని విని యెఱుగనిది కదా.

మఱల వేంగిలోని గోపీవల్లభప్రముఖదేవ కులములయందు చాళుక్యచోళ గోత్రనామాంకితము లైన పూజాపురస్కారములు సెల్లుమ మహానీరాజనావసరముల జయఘంటలు మ్రోగినవి. భావపురి, దాక్షారామ, త్రిపురాంతకాది దివ్యక్షేత్రములయందు నృత్తగీతవాద్యాదు లుల్లసిల్లినవి. వేంగి కవి మహాపర్వదినములు. కాదా మఱి! సాధించినది పశ్చిమచాళుక్యచక్రవర్తి భూలోకమల్లుని; పారద్రోలినది వైరికృతాంతులు, విక్రాంతధనంజయులు, సాహసోత్తుంగులు అయిన కర్ణాటదండాధినాథులను; పొందిన యమూల్య ఫలము కర్ణాటదాస్య విమోచనము. ఇక వేంగిని ఉత్సవముల కేమి కొదువ?

గోదావరీసంగ్రామవిజయముతో గొంకనరేంద్రుని యశశ్చంద్రికలు దశదిశల వ్యాపించినవి. "ప్రతాపలంకేశ్వర, చలమర్తిగండ, వీరమాహేశ్వర, చాళుక్యరాజ్యభవన మూలస్తంభ, క్రీడాఖండిత గౌడకుంతల కుభృత్సేనాగ్రణ, దాయగజసింహ, శివపాదశేఖర, వేంగివిషయ షోడశసహస్రావనీవల్లభ, శంకరకింకర, గొంకనరేంద్ర జయీభవ, విజయీభవ" అని వందిమాగధులు అతనికి కైవారము సేసిరి. అతని యధికారమున కిక అడ్డమాకలు లేకపోయినవి. ఇంతటినుండి చాళుక్యచోళభూపతులు వేంగికి పేరునకుమాత్రమే చక్రవర్తులు; సర్వాధికారమును వెలనాటి దుర్జయులదే. ప్రాగాంధ్రదేశమునందలి సామంతమండలికు లందఱు చందవోలు సింహాసనమునకు కానుకలు, కప్పములు చెల్లించినవారే. గొంకధారుణీశ్వరుడు క్రీ. శ. ౧౧౩౨ నుండి ౧౧౬౧-౬౨ వఱకు మహావైభవముతో రాజ్యమును బరిపాలించెను. ఇతని యిష్టసచివుడు గోవిందప్రెగ్గడ. ఇతడును, ఇతని తనయుడు కొమ్మన ప్రెగ్గడయు వెలనాటి దుర్జయాస్థానమున కార్యఖడ్గధురంధరులై వాసి గాంచినవారు.

# చక్కని యుద్ధసమయపు పెట్టుబడి

నేడు ప్రతివారూ దూరదృష్టితో డబ్బును—ఒకసారి కొద్దిగానే అయినప్పటికీ—నిల్వ చేస్తున్నారు. అయితే, ఒకసారి డబ్బు నిల్వచేయబడ్డదంటే, దానిని వినియోగించ తలపెట్టడం సహజం. ముందుజాగ్రత లేనివారికి బంగారం, వెండి, నగలు ఇళ్లువాకిళ్లు, తయారయిన సామానులు-వీటిమీద పెట్టుబడి పెట్టరాదని హెచ్చరిక చేయాలి. ధరలు తగ్గుదల చూపుతున్నవి. మీరు డబ్బును పెట్టుబడి పెట్టాలనే భావంతో ఈనాటి ధరలలో కొనేట్టయితే చాలా కొద్దికాలంలో మీరు ఎక్కువగా నష్టపడవచ్చు; యుద్ధానంతరం తప్పక నష్టపడతారు

నిల్వచేయబడిన ధనాన్ని నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లమీద పెట్టుబడి పెట్టడం నిస్సందేహంగా భద్రమయినది, కొనేటప్పుడు ఒక్కొక్కదాని ఖరీదు రూ 10 లు, కాని. 12 ఏళ్ల తర్వాత ఒక్కొక్కదాని ఖరీదు పూచీగా రూ 15 లు. ఈ సర్టిఫికెట్లపైన ఇన్‌కంటాక్సు లేదు ప్రతి పెట్టుబడిదారున్నూ రూ 5,000/-లకు మించకుండా ఈ సర్టిఫికెట్లను కొనవచ్చును. నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్ల విలువ తగ్గిపోదు. నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లను మొదటి మూడేళ్ల తర్వాత ఎప్పుడయినా రొక్కంగా మార్చుకోవచ్చు.

మీరు నిల్వచేసిన ధనాన్ని

## నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లమీద
## పెట్టుబడి పెట్టండి

మీ ధనం భద్రంగా వున్నదని గ్రహించండి.

నేడే ప్రారంభించండి!

### రిజిస్ట్రేషన్ - తెలివిగల ముందుజాగ్రత

అస్సాం, బెంగాల్, బీహార్, ఒరిస్సా, మద్రాసు రాష్ట్రాలలో నివసించేవారి సౌకర్యం కోసం, లక్నోలో, యు. పి. పోస్టుమాస్టర్ జెనరల్ అధికారం క్రింద ఒక సెంట్రల్ రిజిస్ట్రేషన్ ఆఫీసు తెరవబడ్డది. దీనిలో, డిఫెన్సు సేవింగ్స్ సర్టిఫికెట్లు, పోస్టాఫీస్ క్యాష్ సర్టిఫికెట్లు, నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లు కలవారు తమ సర్టిఫికెట్లను ఉచితంగా రిజిస్టరు చేయించుకోవచ్చు. ఇందువల్ల, ఒకవేళ సర్టిఫికెట్లుపోయినా, నాశనం చేయబడినా, తమ హక్కును సులభంగా నిరూపించుకోవచ్చు. పూర్తివివరాలు మీ వూరి పోస్టాఫీసులో తెలుసుకొనండి.

నేషనల్ సేవింగ్స్ బ్యాంక్ సర్టిఫికెట్లను సేవింగ్స్ బ్యాంక్ వున్న
ఏ పోస్టాఫీసులోనైనా కొనవచ్చు.

U P C 144.

కొమ్మనప్రెగ్గడ

"నవకోటిపరిమితద్రవిణ మేధూపతి
భండారమున నెప్డుఁ బాయకుండు
నేకోనశతదంతు లేరాజునగరిలో
నీలమేఘంబుల లీలఁ గ్రాలు
బలవేగరేఖలు పదివేల తురగంబు
లేనరేంద్రుని వాగె నెపుడుఁ దిరుగుఁ
బ్రతివాసరంబు డెబ్బదియేను పుట్ల(?)నే
యేవిభు మందల నెపుడుఁ గల్లు
నట్టి యధికవిభవుఁడగు కులోత్తుంగరా
జేంద్రచోడనృపతి కిష్టసచివ
తంత్రముఖ్యుఁడు..."

కులోత్తుంగరాజేంద్రచోడయ ఇమ్మడికొంక మహీపతికుమారుడు. ఇమ్మడి రాజేంద్రచోడయ యని యీ నితనికి నామాంతరము. తండ్రిమరణానంతర మితడు చందవోలుసింహాసనము నధిష్ఠించి రమారమి ఇరువదిసంవత్సరములకాలము రాజ్యమేలెను. ఇమ్మడి రాజేంద్రచోడయరాజు తండ్రికి దగిన కొడుకు; శౌర్య ప్రతాపములయందు తన జనకుని కేమాత్రము దీసిపోవని వాడు.

కులోత్తుంగరాజేంద్రచోడనృపతిరాజ్యకాలమున నైతము కల్యాణికటకసామంతులు వేంగిపై దండెత్తి వచ్చిరికాని ధనదుప్రోలుకటకసామంత, దండనాయకాదుల తోడ్పాటుతో సేనలను గూర్చుకొనిపోయి రాజేంద్రచోడని మంత్రి కొమ్మనప్రెగ్గడ మన్నేఱు క్రొత్తచెర్ల (కొచ్చెర్లకోట) పరిసరములశత్రుసైన్యము నెదుర్కొని తీవ్రముగ బోరాడెను. ఉభయపక్షముల వారికి మహాభయంకరసంగ్రామములు ప్రవర్తిల్లినవి. క్రొత్తచెర్లసమరమున కొమ్మనప్రెగ్గడ చూపిన ప్రతాప మీవిధమున బరికీర్తిత మయినది:

"నెలకట్టైవాటునఁ జెలఁగి రెంటెని మాఁటిఁ
గూడ గుఱ్ఱంబులు గుదులుగ్రుచ్చుఁ
బ్రతిమొగంబగు నరపతుల కత్తిలమునఁ
గడిమిమై పీఁపులు వడలఁబోడుచుఁ
బండెంపుగోతియల పగిది నేనుంగుల
ధారశుద్ధిగ నసిధారఁ దునుముఁ
జిదియించుఁ బగిలించుఁ జేతుల తీఁట వో
వడిఁ గాండ మేసి మావఁతుల తలలు
తల పుడికి వేసి మావంతు తలలు శత్రు
రాజశిరములు ద్రొక్కించు రాఁగెఁ దిరుగ
వాగె నుబ్బెడు తన వారువంబుచేత
మహితశౌర్యుఁడు కొమ్మనామాత్యవరుఁడు"

తుదకు పశ్చిమచాళుక్యసైన్యములు చాలవఱకు విఱిగి వీరక్షయమును నొందినవి; హతశేషములు శకావికలై పలాయనములైనవి. కటకదండనాథాగ్రణి చౌండరాయడు పరాజితు డయ్యెను. దుర్జయులు మరలనన్వర్థనాములైరి. వెలనాటి వీరవిజయపతాక వాయుమండలమున ఖేచరీకన్యకవలె లీలావిహారము చేసినది.

పశ్చిమచాళుక్యవాహిని వేంగిపై దండెత్తివచ్చిన కాలముననే కావమ్మను కోనమండలేశ్వరుడును, హైహయవంశ్యుడును అయిన లోక మహీపతి వెలనాటి చోడయధికారమును ధిక్కరించి దుర్జయసింహాసనముపై దిరుగుబాటు కావించెను. రాజేంద్రచోడయయాజ్ఞాపనంబూని యాతని దండనాయకులలో నొకడగు దేవనప్రెగ్గడ సైన్యసమేతుడై వెళ్లి కోనసాధించి లోకనరేంద్రుని వధించి హైహయమండలికులను వెలనాటిసింహాసనమునకు విధేయులను గావించెను.

ఇమ్మడి కులోత్తుంగరాజేంద్రచోడయరాజుల కాలమున దుర్జయుల చందవోలురాజ్యము ఉత్తరమున కళింగమునుండి దక్షిణమున పాకనాటివఱకు వ్యాపించినది. చందవోలుసింహాసనమునకు కళింగ, పాకనాడు దేశములుకూడ కానుకలు చెల్లించినవి.

ఈ కులోత్తుంగ చోడరాజుకు సమకాలికుడు ఆంధ్రదేశమున పండిత శైవసంప్రదాయమును ప్రచారము కావించిన మల్లికార్జున పండితారాధ్యులను శివాచార్యులు. ఈయన శైవేతర మతములను వాదమున ఖండించుచు శైవమత ప్రచారము చేయుచు రాజేంద్ర చోడయ రాజుల కాలమున ధనదుప్రోలి కరుదెంచెను. అచ్చట రాజాస్థానమున మల్లికార్జున పండితునికిని, బౌద్ధాచార్యునికిని వాదప్రతివాదములు జరిగినవి. బౌద్ధాచార్యుడు వాదమున నోడిపోయెను.

ఈ మతవివాదము కారణముగ శైవులకును, బౌద్ధులకును వైషమ్యములు పెరిగి కలహ మదయించి తుట్టతుద కది బౌద్ధాచార్యహత్యతో బర్యవసించినది. వెలనాటి చోడయరాజు ఈ హత్యావిషయము విని యది శివాచార్యుడైన పండితయ్య యెఱుకను, ఆయన ప్రోత్సాహమునను జరిగినదని భ్రాంతిపడి దండనముగ ఆ పండితేంద్రుని కన్ను లూడబెఱుక నుత్తరువు నేసెను. ఏమియు నెఱుంగని పండితమూర్తి యందులకు కడుంగడు గినిసి చందవోలిలోని లింగోద్భవ స్వామి నగరి కరిగి యామహాదేవుని గద్యంబున స్తుతించి పిదప తనకుదాన కన్నులూడబెఱికికొని, అధర్మముగ దన కీ శిక్ష విధించినందులకు

"ఎల్లవారును జూడ నీసేల గడవ
బల్లహు ప్రీతంబు వాడైనయట్టు
లీ యసంఖ్యాత మాహేశ్వరోత్థిత స
మాయత క్రోధోత్కటానలపటల
విరచితజ్వాలల వెలనాటిచోడ
ధరణీశితేశ్వరాధమ పతంగంబు
భస్మమయ్యెడు మ తద్బంధులు సుతులు
విస్మయంబుగ నిష్ఠ భస్మమైపోదు"

రని చోడనృపతికి శాపమిచ్చెనట. ఆశాపప్రభావమున నగునో కాదోకాని వెలనాటిరాజ్య క్షీణదశ కీరాజేంద్రచోడయ తుదికాలమున నుండియే యారంభము. పండితేంద్రుడు శపించిన కొలదికాలమునకే

"మనుజేశునకు నంత మంత్రివిరోధ
మును ప్రధానవిరోధమును నాప్తబలవి
రోధంబుఁ బుత్త్రవిరోధంబు నిరప
రాధంబుఁ బుట్టె, నూరను మారి మసఁగె"

నట.

వెలనాటి ఇమ్మడికులోత్తుంగచోడయ రాజులకు బిదప అతని యాత్మజుడయిన (మూడవ) గొంక నృపాలుడు సింహాసనము నధిష్ఠించెను కాని యితడు నాలుగైదేండ్లుమాత్రమే రాజ్య మేలినట్లు కన్పట్టును.

ఈ గొంకభూవరుని యనంతరము క్రీ. శ. ౧౧౫౬ లో ధనదుప్రోలు సింహాసన మెక్కిన ప్రభువు వెలనాటి పృథ్వీశ్వర మహీపతి. వెలనాటి దుర్జయధరణీశులలో ఇతడు కడపటివాడు. ఇతని యధికారము తూర్పున కళింగమునందలి శ్రీకూర్మము పర్యంతము చెల్లుచుండినట్లును, కళింగాధిపతులు వెలనాటిరాజన్యుల కరియప్పనములు సమర్పించు చుండినట్లును ఊహింప నవకాశము కలదు.

వెలనాటివారి రాజ్యమున అచిరకాలముననే అశాంతి యుదయించినది. పిఠాపురమును దమ కొణాచిగ జేసికొన్న పూర్వచాళుక్యశాఖకు సంబంధించిన నరపతులు కొందఱు ప్రబలులై వెలనాటి రాజ్యాధికారులను ధిక్కరించి యుపద్రవము కలిగింపజొచ్చిరి. ఈపూర్వచాళుక్యుల దండకికి ఓరుగంటిరాజన్యుల విద్వరములుకూడ తోడయినవి. తెలంగాణాలో పశ్చిమచాళుక్యరాజ్య మంతరించి కాకతిరాజవంశజుల యధికారము ప్రబలినది. వీరికి ఏకశిలానగర మను నామాంతరము గల ఓరుగల్లు రాజధాని. కాకతిరుద్రదేవరాజు వేంగిని జయింప బ్రయత్నించెనుకాని కృతకృత్యుడు కాలేకపోయెను. క్రీ.శ. ౧౧౯౯లో ఓరుగంటిసింహాసనము నధిష్ఠించిన రుద్రదేవరాజసోదరతనూభవుడయిన గణపతిదేవమహారాజు దూరదృష్టితో ముందురానున్న మహమ్మదీయదండయాత్రల నాశంకించియేమో ఆంధ్రదేశమునంతను ఒక్క ఛత్రచ్ఛాయకు దీసికొనిరావలెనని ప్రాగ్దేశముపై దండయాత్రలు మొదలిడెను. క్రీ. శ. ౧౨౦౩ నాటికి కృష్ణవేణ్ణానదీదక్షిణమహాప్రావని కాకతిగణపతిదేవమహారాజచరణకమలములకు దలవంచి మ్రొక్కినది. వెలనాటి పృథ్వీశ్వరనృపతికి తుదకు కళింగదేశ మాశ్రయభూమియైనది. కాకతివంశరాజదండయాత్రలకును, పిఠాపురపు పూర్వచాళుక్యవంశభూపతుల యుపద్రవములకును నడుమబడి నలిగినలిగి వెలనాటి దుర్జయుల వేంగిరాజ్యము విశీర్ణమయిపోయినది. వెలనాటి పృథ్వీశ్వరరాజేంద్రుడు క్రీ. శ. ౧౨౦౬ ప్రాంతమున కాలధర్మము నొందెను.

వెలనాటి రాజ్యము కాకతీయులవశమయినపిదప దుర్జయ రాజకుమారులు కాకతిరాజన్యులను భజించి వారికి విధేయసామంతులును, సేవకులునైరి.

కాకతిరాజన్యుల వెలనాటి విజయముతో చందవోలి వైభవప్రాభవము లడగారిపోయినవి. కర్ణాటాధీశులకు సైతము వెఱపుగొలిపిన చందవోలికోట ఓరుగంటి కాకతిగణపావనీధవుని ప్రతాపవిజయధాటికి ప్రయ్యలై నేల చదునైనది.

చందవోలు చరిత్ర ప్రసిద్ధమైన ప్రాచీనస్థలము; ప్రాగంధ్రదేశీయులకు వీరవిద్యాగంధమును వాసింపజేసిన గరిడికాల; చతుర్థాన్వయరత్నదీపములు తొలుదొలుత అఖండప్రకాశముతో వెలింగిన దివ్యభూమి; వీరదుర్జయ వసుంధరావరుల విహారక్షేత్రము.

అట్టిది చందవోలు—ధనదుప్రోలు.

# సత్

"సంపత్"

అన్నిటికీ - నెలవున్నది
అన్నిటికీ - నెరవున్నది
అన్నిటికీ - గుఱిఉన్నది
అన్నిటికీ - దరిఉన్నది.

పొదిగినదై, ఎదిగినదై,
ముదిసినదై విడిపోవును;
లేతదియై, పూతదియై,
పాతదియై పడిపోవును.

తుదియెఱుగక, మొదలెఱుగక
ముగియని ఆకాశములో
అలమటతో, అలసటతో
ఎగిరే చిఱు పిట్టలకూ —

గూడున్నది, కూడున్నది,
జోడున్నది, నీడున్నది;
చీకటిలో చేరుకునే
చెట్టున్నది, గట్టున్నది.

అటుతూగీ - ఇటుఊగీ
నటరేగీ - నటియించే
తరగలతో - నురుగులతో
పరుగులతో - పయనిస్తూ —

పడిలేచే నడిసంద్రపు
పడవలకూ తెరువున్నది;
గడితేరను, దరి చూడను
నడిపించే రేవున్నది.

లోతెరుగని లోయలలో
ఉస్సురనే ఊడిగముల
ఏడుపులో గాడుపులో
కనిపించని కడలందున

ఒకటున్నది, ఒకటున్నది
నడిపించే, ఒడిపించే
ఉన్నానని జడిపించే
దొకటున్నది, ఒకటున్నది.

ఔనంటూ, నిజమంటూ
జగమందలి, జనులందరి
మృత్యువులో, మృత్తికలో
సంజీవక మైయున్నది.

[కన్నడంలో వి. సీ. గారి 'ఇహుదు' అన్న రచన ఇచ్చిన బలంతో.]



# ఆచార్యరాయ్

•

= శ్రీ కొమాండూరు శఠకోపాచార్యులు =

మొన్న జూను ౧౬-వ తేదీ సాయంకాలము ప్రఫుల్లచంద్రరాయి అస్తమయముతో భారతమాత పుత్రరత్నములలో నొకని గోల్పోయినది. ఆ మహనీయుని జీవిత మతి విచిత్రము, విశిష్టము, అద్భుతము నైనది. విఖ్యాత వైజ్ఞానికుడు, ఆవిష్కర్త, విద్వాంసుడు, మహామేధావి, అర్థశాస్త్రజ్ఞుడు అనియేకాక, గొప్ప దేశభక్తుడు, పరిశ్రమల నిర్మాత, వినమ్రుడు, నిగ్రహవంతుడు, సౌమ్యుడు, త్యాగి, దాత, విశాలహృదయుడు నగు లోకక్షేమపరు డగుటచే ఈ మహామహుని జీవితవృత్తాంతము లెల్లరకు స్మరణీయములు.

మహా ప్రతిభాశాలురగు మోతీలాలు నెహ్రూ, రవీంద్రనాథ ఠాకూర్ మున్నగు మహనీయులు జనించిన ౧౮౬౧-వ సంవత్సరములో ఆగస్టు ౨-వ తేదీని, ఇప్పటి ఖుల్నా జిల్లాలోని రరూలీ అను కుగ్రామమున ప్రఫుల్లచంద్ర రాయి జనించెను. వీరిది ప్రసిద్ధ పండిత కుటుంబము. తండ్రి హరిశ్చంద్రరాయ్ గొప్ప విద్వాంసుడు; కృష్ణనగర్ కాలేజీలో ఆంగ్ల విద్య నభ్యసించుటే కాక, అరబ్బీ పారశీలలోను ప్రవీణుడై, విద్య గోష్ఠియం దభిరుచి గల్గియుండెను; స్వగ్రామమం దొక పాఠశాలను స్థాపించి నడుపుచుండెను. ఆ పాఠశాలలోనే ప్రఫుల్లచంద్రుడు మొదట చదువు నేర్చుకొని, పిమ్మట కలకత్తాలో హేర్ హైస్కూలు, ఆల్బర్టు కాలేజీలలోను, తరువాత అక్కడి ప్రెసిడెన్సీ కాలేజీలోను ఉన్నత విద్య నభ్యసించెను. అప్పటి కీదేశమం దాంగ్లవిద్యకు తగు ప్రచారము లేదు. కుమారుని విద్యాసక్తిని, వైజ్ఞానిక ప్రవృత్తిని కనిపెట్టి, తండ్రి పూర్తిగా ప్రోత్సాహమిచ్చి విదేశ యాత్రకును సమ్మతించెను. ఇరువది యొకటవయేట మేధావి యగు ప్రఫుల్లచంద్రుడు 'గిల్క్రిస్టు స్కాలర్‌షిప్' అను వేతనమును బొంది బ్రిటిషు దేశమున కేగి, స్కాట్లండు రాజధాని యగు ఎడింబరోలోని విశ్వవిద్యాలయములో చేరి, రసాయన శాస్త్రమందు గొప్ప ప్రావీణ్యము సంపాదించెను. ఆరేండ్లు దీక్షతో వైజ్ఞానికుల పరిశోధనల పద్ధతులను పరిశీలించి గ్రహించెను. సహజ మగు ప్రతిభకు విజ్ఞానాభిరుచియు, దీక్షయు సహాయపడెను. ప్రఫుల్లచంద్రుని కచ్చట గొప్ప విద్వాంసుడనియే కాక, స్వతంత్ర పరిశోధకుడని ప్రఖ్యాతి వచ్చెను. ౧౮౮౭-వ సం॥లో చాల కష్టసాధ్యమగు "డాక్టర్ ఆఫ్ సైన్సు" డిగ్రీ లభించెను.

కుశాగ్రబుద్ధి యగు డాక్టరు రాయి స్వదేశమునకు మరలి వచ్చినంతనే, కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజీలో కెమిస్ట్రీ ప్రొఫెసరుగ (రసాయనాచార్యుడుగ) నియమితుడై ౧౯౧౬ వర కాపదవియందే ప్రకృతి శాస్త్ర బోధకుడుగ నుండెను. రసాయనశాస్త్రమం దాయన పాండిత్య మపారము. ఆయన ప్రతిభావిశేషమును గమనించి, ఈదేశమందేగాక పాశ్చాత్యదేశములలోని విశ్వవిద్యాలయములును "డి. ఎస్. సి" "పి. హెచ్. డి" మున్నగు గొప్ప వైజ్ఞానికబిరుదముల నిచ్చి గౌరవించిరి. రసాయనవిజ్ఞానమం దనేకయువకుల నాతడు మహావిద్వాంసులుగ తయారుచేసెను. "మెర్క్యురీయస్ నైట్రేట్సు" మున్నగు స్వతంత్ర పరిశోధనల ద్వారా ప్రపంచమంతట విఖ్యాతి గాంచెను. రసనత్ర జనివస్తువుల గూర్చి ఆయన కనిపెట్టి ప్రచురించిన విషయములు లోకవిజ్ఞానాభివృద్ధికరములగుటయేగాక, వైద్యరసాయనాదులలో మిక్కిలి యుపకరించినవి. ఆతడు వ్రాసిన పరిశోధన వ్యాసములు యూరపులోని పాశ్చాత్యభాషల వైజ్ఞానికపత్రికలలో ప్రముఖస్థాన మీయబడి, ప్రపంచవైజ్ఞానిక శిరోమణుల యామోదమును బడసెను. ౧౯౧౬ తరువాత ప్రెసిడెన్సీ కాలేజీనుండి విరమించినను, పాలిట్, ఘోషుల దాతృత్వముచే స్థాపితమైన యూనివర్సిటీ కళాశాల

లోని రసాయనాచార్యస్థానము వహించి వైజ్ఞానికపరిశోధనల నింకను వృద్ధిజేసెను. జీవితాంతమువరకు విశ్వవిద్యాలయముతో సంబంధ ముంచుకొని, అభవనము నందే మరణించుట యీనైష్ఠిక బ్రహ్మచారి కెంతయు తగియున్నది.

అద్భుతఆవిష్కర్తగ స్వయముగ లోకవిఖ్యాతి గాంచుటే కాక రాయ్ అనేకులను శిష్యులకు తగు తరిఫియతు నిచ్చి వారిని గొప్ప పరిశోధకులుగ జేసెను. ఆదినములలో భారతదేశపు ముఖ్యకళాశాల లన్నిటిలోను రసాయనాచార్యస్థాన మాంగ్లేయులే వహించుచుండిరి. ఇటీవల దాదాపు భారతావని యందంతట రసికలాల్ దత్త, నీలరత్నధర మున్నగు రాయిగారి శిష్యులు ప్రతిభావంతులై రసాయనాచార్యస్థానముల నధిష్ఠించి, స్వతంత్రపరిశోధనల జేసి, విదేశములయందును విఖ్యాతి బడయుచున్నారు. అందువలననే రాయిగారికి(డాక్టర్ ఆఫ్ డాక్టర్సు)ఆచార్యుల కాచార్యు డను మన్నన గల్గినది. వృద్ధుడయ్యు, రసాయనపరిశోధనల నిరంతరకృషి యొనర్చుచు, తన ప్రాముఖ్యతకై ప్రాకులాడక, తన శిష్యుల కాపరిశోధనల మూలమున ఖ్యాతి గడింప రాయి మహనీయుడు పాటుపడుచుండెడువాడు.

సంస్కృతమందున్న మన ప్రాచీనరసాయన వాఙ్మయమును పూర్ణముగ శోధించి, ప్రాచీన భారతీయులు తత్త్వవేదాంత శాస్త్రములయందు ప్రముఖులై యితరదేశములకు మార్గదర్శకులైనను, ప్రకృతిశాస్త్రమునమాత్ర మితరులకు వెనుకబడియుండిరను నపోహ పారద్రోలుటకు తీవ్రకృషి సలిపెను. పూర్వపు హైందవులు ప్రకృతిశాస్త్రములలో - విశేషించి రసాయన విద్యయందు ప్రవీణులై గొప్ప గ్రంథములు రచించిరి. అందు కొన్ని కాలగర్భమున నశించినవి. కొన్ని నేటికిని మిగిలియున్నవి. సంస్కృతభాషలోని రసార్ణవము, రసరత్నసముచ్చయము మొదలగువాని నభ్యసించి అందలి సాంకేతికభావముల గ్రహించి, అందలి యమూల్యవిషయములను లోకుల కాయన వెల్లడించెను. పదునైదేండ్ల తీవ్రకృషితో, నీరంగమం దాయన చేసిన పరిశోధనల ఫలితముగ "హిస్టరీ ఆఫ్ హిందూ కెమిస్ట్రీ)" (హిందూరసాయనచరిత్ర) అను సద్గ్రంథము నాయన రచించి ప్రచురించెను. ఇది రెండు సంపుటముల యమూల్యవిషయము. రసాయనవిజ్ఞానములో మన పూర్వవిద్వాంసుల భావములను విమర్శించి, వారి సిద్ధాంతములను ప్రణాళికలను వివరించి వానిని వైద్యశాస్త్రమునకు వా రెంత బాగుగ నుపయోగించిరో, ఈ రసశాస్త్రగ్రంథములనే అరబులు తమ భాషలోనికి తర్జుమాచేసి పిమ్మట యూరపియనుల కందిచ్చి పాశ్చాత్యుల నవ్యపరిశోధనల కెట్లు బీజములు నాటిరో రాయిగా రీయమూల్యగ్రంథములో సప్రమాణముగ వివరించిరి. మూలగ్రంథములనుండి అవసరమగు ఉదాహరణ లిచ్చిరి. ఈవిషయమునుగూర్చి ఇదియే ప్రామాణికగ్రంథముగ నేటికిని ప్రపంచమంతటను ఆదరింపబడుచున్నది. మన దేశమున రసాయనవస్తునిర్మాణమునకును రాయిగారే మార్గదర్శకులు. రంగులు, సబ్బులు, ఎరువులు, బట్టలు, తోలువస్తువులు మున్నగు నిత్యావసరములకు వివిధవస్తునిర్మాణమునకు రసాయనపరిశోధనయే మూలాధారము. ఈ శాస్త్రమున ప్రవీణులగుటచేతనే జర్మను లీవస్తువుల నిర్మాణములో ఖ్యాతి గడించిరి. దేశపారిశ్రామికాభివృద్ధికి రసాయనశాస్త్రపరిశోధనలద్వారా కృషిచేసి, వైజ్ఞానికావిష్కారపు సహాయముతో నవ్యరీతికర్మాగారములు నిర్మించి, అందుపయుక్తవస్తువులు తయారుచేయుట అవసరమని గ్రహించి రాయిగారు అందుకై ఒక సంస్థను స్థాపించి, కొందరు శిష్యులతోబాటు తామును అందు కృషిచేసి, ఇక్కడి పరిస్థితుల కనుకూలముగ చౌకయగు యంత్రములు నిర్మించి, మన దైనికజీవితమున కవసరమగు వస్తువులనేకముల నుత్పత్తిచేయ నారంభించెను. ఈ యద్భుతజాతీయపరిశ్రమకు మార్గదర్శకుడగు ప్రఫుల్లచంద్రుడు తాను ధనాఢ్యు డగుట కెక్కడవకాశ ముండినను, అందు కీయకొనక, లభించిన ద్రవ్యము నాసంస్థకే వినియోగించి, దానిని పోషించి దాని నభివృద్ధికి దెచ్చుటయేకాక, సబ్బులు, పింగాణీ వస్తువులు, తోళ్ల పరిశ్రమలు మున్నగువానికై యెన్నో ప్రత్యేకసంస్థల స్థాపింపజేసియు భారతపారిశ్రామికాభివృద్ధికి మార్గదర్శి యాయెను.

డాక్టరు రాయిగారి యద్భుతవైజ్ఞానిక వైదుష్య

మును గుర్తించి ప్రభుత్వమువారు యూరపులోని రసాయనకళాశాలలలోని పరిశోధనలు గమనించి తెలుపుట కాయనను నియమించిరి. ఆయా ప్రసిద్ధస్థానముల కేగి, అచ్చటి యాంత్రిక, నవ్య ఆవిష్కరణములను, పరిశోధన పద్ధతులను పరిశీలించివచ్చి నిర్దేశించిరి. కలకత్తా విశ్వవిద్యాలయ కళాశాల రసాయన శాఖలో ఆయన స్థాపించి వృద్ధి చేసిన కొత్త యంత్రపరికరములు, బోధన విమర్శపద్ధతులు, వైజ్ఞానిక సంప్రదాయములు నేటికిని భారతదేశ మంతటికిని ఆదర్శప్రాయముగ నున్నవి. ౧౯౨౦ లో ఆచార్య రాయి భారత విజ్ఞాన మహాసభ కధ్యక్షత వహించెను. వారి ప్రతిభను గమనించి, సర్కారువారు సి. ఐ. ఇ., సర్ బిరుదము లిచ్చి గౌరవించిరి. బిరుదుల కాశపడి, ఆవ్యామోహమున పడుతత్వ మాయనకు లేదు.

బోసు, రామను మున్నగు మిగిలిన వైజ్ఞానికుల వలెగాక, రాయిగారు మొదటినుండియు రాజకీయ దృష్టిగూడ కల్గియుండిరి. రసాయనవిద్యకై బ్రిటను కేగిన బాల్యమందే బ్రిటిషు రాజ్యాంగమును, రాజనీతిని గూర్చి వివరములు గ్రహించి, విద్యార్థిదశలోనే బ్రిటనులో నెల స్వాతంత్ర్యభావములు వెల్లడించుచుండెడివారు. "౧౯౧౮ వరకు ప్రార్థనయు, పరిమితాను భారత దేశస్థితి" అను పేర మన దేశములోని ప్రజాదుస్థితిని, బ్రిటిషువారి రాజనీతిని విమర్శించుచు నొక రచనను ప్రకటించెను. అందలి సత్యవాదమును గని బ్రైటు మున్నగు స్వాతంత్ర్య ప్రియులు మెచ్చి ప్రఫుల్లు నభినందించిరి. సర్కారువారు రాతని ధోరణి కసంతృప్తు లగుట సహజము. బ్రిటిషు వైజ్ఞానికుల ప్రోద్బలము, ఆయనకు గల అద్భుత ప్రతిభవలన తెము కళాశాలలయం దాయన కుద్యోగ మిచ్చినను, ఆయన యోగ్యతకు తగు ముఖ్యస్థానములను విద్యాశాఖయం దాయన కీయక క్రింది తరగతిలోనే యుంచిరి. ౧౯౦౫ లో మన దేశములో జాతీయోద్యమము ప్రారంభమైనప్పుడు, రాయిగారు, తాను ప్రభుత్వోద్యోగమందున్నను, కలకత్తాలో నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషన్ (జాతీయవిద్యా పరిషత్తు) స్థాపింపజేసి, అందు ముఖ్యసభ్యులై యెంతయో సహాయ మొనర్చెను. ఆసంస్థలో తాను స్వయముగ రసాయనబోధ చేసెను.

ఆర్థిక సమస్యలయందును మొదటినుండియు ఆయన జాతీయవాదియే. స్వదేశీయోద్యమవ్యాప్తికిని, ముఖ్యముగా విద్యార్థులలో దేశీయవస్తువుల వాడుకకును ఆయన చేసిన తీవ్రకృషి నిరుపమానము. దేశమందు లేని కొత్త పరిశ్రమలు నిర్మించవలెనని, పాతపరిశ్రమలు పునరుద్ధరించి వృద్ధిచేయవలెనని ఆయన ప్రబోధించి, ప్రత్యక్షముగ తానే చాలా కొత్త పరిశ్రమలు స్థాపించెను.

౧౯౧౯ లో గాంధిమహాత్ముని నాయకత్వముతో మన జాతీయజీవనములో క్రొత్త దృక్పథ మేర్పడినది. ఆ ప్రభావము ప్రఫుల్లచంద్రునికిని సోకినది. అంతవరకును తక్కినవారివలెనే రాయిగారును యాంత్రికవాది; అనగా యాంత్రికాభివృద్ధితోనే మన పరిశ్రమలు పెంపొందవలె నని ఆశయము. ఆధునిక వైజ్ఞానికునకు యాంత్రికవిధానమునే ప్రోత్సహించుట సహజమే. ఫాక్టరీపద్ధతివల్ల కొన్ని వేలమందికి జీవనాధార మేర్పడినను, తిండిలేక యల్లాడు కోట్లకొలది బీదభారతీయుల సమస్యపరిష్కారమునకు మరొక సాధనము కావలె ననియు, అందుకు గాంధిగారు ప్రచారముచేయు ఖద్దరు మున్నగు కుటీరపరిశ్రమల పోషణయే సాధనమనియు రాయిగారికి నచ్చెను. ఈధోరణి పాశ్చాత్యవిజ్ఞానసంప్రదాయమునకు వ్యతిరిక్తమని కొంద రాక్షేపించిరి. అప్పట్లో టాగూరు మున్నగు విఖ్యాతవిద్వాంసులును ఖేదించిరి. అయినను లక్ష్యపెట్టక రాయిగారు వెంటనే ఖాదీప్రచార మారంభించి, తమ సహజోత్సాహముతో బెంగాలులోను, భారతదేశమంతటను ఆయుద్యమమునకు ప్రాబల్యము గల్గించిరి. స్వయముగ ఖాదీ ధరించుటయేగాక, నూలు తాను వడుకుచు, ఇతరులచే వడికించి నేయించుచు సుప్రసిద్ధమగు ఖాదీప్రతిష్ఠాపనమును స్థాపింపజేసిరి.

౧౯౨౩ సంవత్సరములో కాకినాడలో కాంగ్రెసు మహాసభ జరిగినప్పుడు, ఆయన విచ్చేసి అఖిల భారతఖద్దరుప్రదర్శనమునకు ప్రారంభోత్సవము చేయుచు నిచ్చిన యుపన్యాసము విన్నవా రెవ్వరును

దానిని మరువలేరు. మన జాతీయపరిశ్రమలను, ముఖ్యముగా నాజూకగు ఖాదీయుత్పత్తిని నశింపజేయుటకు కంపెనీ ప్రభుత్వ మవలంబించిన అన్యాయచర్యను తీవ్రముగ ఖండించి, వాగ్వాదములతో కాలము గడుపక భారతీయులు కార్యపరులై గృహపరిశ్రమలను వృద్ధిచేయుట యత్యవసర మని ఆయన ప్రబోధించెను.

రాయిగారు గొప్ప త్యాగి, మహాదాత. అధ్యాపకత్వమువల్లను, సర్కారు పెన్షనువల్లను, పరీక్షాధికారిగను, ఆయా పరిశ్రమల డైరెక్టరుగను ఆయనకు ప్రతి నెలకు కొన్ని వేల రూపాయల రాబడియుండెను. కాని ఆయన దానిని స్వార్థమున కుపయోగించుకొనలేదు. అందు ముఖ్యభాగమును విద్యార్థుల కిచ్చివేసి, నిరాధారు లనేకులకు సాయపడుచు, అనేక ధర్మకార్యములకు ద్రవ్యసహాయము చేయుచు, దీనజనరక్షణకే తన ధనమంతయు వినియోగించుచుండెను. పేదల రక్షణ యన్న ఆయనకు మిక్కిలి ప్రీతి. ౧౯౨౨ లో వరదలవల్ల బెంగాలులో గొప్ప క్షామము కల్గెను. అప్పు డాయన క్షామనివారణనిధి నేర్పరచి, ద్రవ్యము ప్రోగుచేసి తోడ్పడుటేగాక, తాను వసించు కాలేజీ అంగణములో పెద్ద ఖద్దరుడిపో పెట్టి, నిరాధారులకు రాటము లిప్పించి, నూలు వడికించి, నేయించి, వస్త్రహీనులై అల్లాడు పేదలకు బట్టలు సరఫరాచేసి, క్షామనివారణోద్యమమును క్రొత్త పద్ధతులపై తన శిష్యుల ద్వారా తానే నడిపించెను.

మద్యనిషేధము, సాంఘికైక్యము, జాతీయ విద్యాపద్ధతి, స్త్రీల యభ్యున్నతి - ఇట్టి నిర్మాణకార్యాంగములకును సానుభూతిని జూపుచుండెను. హరిజనుల అస్పృశ్యతానివారణకృషి చాల ముఖ్యమైన దని గాంధిగారి వలెనే ఆయనయు విశ్వసించి, ఆ విషయమై తీవ్ర ప్రబోధము చేయుచుండెను.

తన జీవితచరిత్రను రెండు సంపుటములలో ఆంగ్లమున వ్రాసి ప్రచురించెను. అందు విజ్ఞానావిష్కారములతోబాటు, జాత్యుద్ధరణకును ప్రాముఖ్య మిచ్చెను. ఆర్థిక స్వాతంత్ర్య మన్న అభిమానము మెండు. బెంగాలీలు తమ యార్థికోన్నతికై విశేష కృషి చేయవలెననియు, గుజరాతు మిల్లు బట్టలు సంయుక్తరాష్ట్ర) ప్రాంతపు పంచదార మున్నగు వానిపై ఆధారపడరాదనియు ఆయన హెచ్చరించెడివాడు. ఇందు సంకుచిత ప్రాంతీయ దృక్పథము సూచితము. ఇతర ప్రాంతములపై ఆధారపడి తమ ప్రాంతముల నభివృద్ధిపరచుట కవకాశమున్న పరిశ్రమలను సాగింపక వ్యర్థపుచ్చుటవలన, దేశమున కార్థికబాధ హెచ్చుగునను సూచన, అన్ని ప్రాంతములతోబాటు, ఆంధ్రులము ముఖ్యముగ గమనింపవలసియున్నది.

రాయిగారికి స్వభాషాభిమానము మెండు; తన మాతృభాషయగు బెంగాలీలో వైజ్ఞానికగ్రంథము లనేకములు రచించెను. చక్కని సులభశైలిని, పారిభాషికపదములతో తేటతెల్లముగ వ్రాయుచుండెను. వైజ్ఞానికావిష్కారములను సామాన్యులకుగూడ సుబోధకమగునట్లు స్వభాషలో ఆయన వ్రాసిన వ్యాసములు చాల జ్ఞానప్రదములు. ధార్మిక, సాంఘికవిషయములలో రాయిగా రుదారులు. కేశవచంద్రసేనుని ప్రబోధమున యువకదశయందే ఆయన బ్రహ్మసమాజము జొచ్చెను. అప్పటినుండియు వర్ణవిభేదములకు, కులతత్వములకు వ్యతిరిక్తుడై, పరిశుద్ధ ఆస్తికధర్మపరుడై యుండెను.

రాయిగారి భక్తి, నిగ్రహము లద్భుతములు. యౌవనమందు వారొక యువతిని హృదయపూర్వకముగ ప్రేమించిరి. కాని ఆబాలిక మరియొకరి కీయబడి వివాహమొనర్పబడెను. అంతటితో తన ప్రణయము నణచుకొని జీవితాంతమువరకు బ్రహ్మచారిగనే యుండి, విజ్ఞానరమణినే వరించి, రాత్రింబవళ్లు పరిశోధనయందే నిమగ్ను డాయెను. యౌవన దశలో అందుచే అజీర్ణసంబంధమగు వ్యాధి అంకురించి బాధించెను. వ్యాధిగ్రస్తుడయ్యు, నిరంతరకృషిపరుడయ్యు, ఆహారవిహారములలో నిగ్రహముచే దీర్ఘాయువు నొందగల్గెను. విద్యార్థులే ఆయనకు సంతతి; విజ్ఞానమే శ్రేయసి; దేశమే తల్లి. తన సర్వస్వము వారికై ధారవోసి ధన్యజీవియై, జీవన్ముక్తుడై, తన పూర్వశిష్యగణము నలువంకల ఉపచర్య లొనర్చుచుండ, తన కత్యంతప్రీతికరమగు కళాశాలలోనే ఐహికజీవితము చాలించెను. భారతమాత సుగుణఖనులలో నొకని గోల్పోయినది. ఆమహనీయుని ప్రబోధముల నాచరించుటయే ఆయన లోటు అగుపడకుండ జేయు సాధనము.

# విమర్శనము

## Chandragupta Maurya and his times.

ఎందరో రాజులు, మరెందరో సార్వభౌములు భారతదేశాన్ని ఏలినారు. పురాణేతిహాసాలేమి, సమకూరిన భారతదేశచరిత్ర గాథలేమి భారతసార్వభౌముల ప్రతిభావిశేషముల నగ్గించినవి. చారిత్రికంగా సరియైన కాలనిర్ణయం కాకపోయినా మహాపద్మనందుడు, నందుడు, బింబిసారుడు మొదలుగా గల చక్రవర్తుల నెందరినో భారతదేశం చూచింది. సమగ్రమైన, సరియైన భారతదేశచరిత్ర ఇంకనూ వ్రాయబడవలసి యున్నప్పటికినీ ఈ మహాత్ముల్ని గురించిన ఉద్గ్రంథములు ఇటీవల కొందరు అల్పసంఖ్యాకంగానే వెలువడుచున్నవి. అట్టి ఉద్గ్రంథశ్రేణిలో చేరిందే రాధాకుముద్ ముఖర్జీగారి 'చంద్రగుప్తమౌర్యుడు, ఆతని కాలము' అన్న ఈ ఆంగ్లగ్రంథం. ౧౯౪౦-౪౧ సంవత్సరాల్లో మద్రాసు విశ్వవిద్యాలయంవారి ఆహ్వానమున డాక్టర్ ముఖర్జీగారు చేసిన సర్ విలియం మేయర్ స్మారకోపన్యాసముల సంపుటి ఇది. మద్రాసు విశ్వవిద్యాలయమువారే దీని ప్రకటనకర్తలు. వెల ౧౧ రూపాయలు.

రాధాకుముద్ ముఖర్జీగారు ప్రఖ్యాతచారిత్రక ప్రవీణుడు. లక్నో విశ్వవిద్యాలయమునందలి చారిత్రకశాఖకు ప్రధాని. వారి చారిత్రక పాండిత్యం, పరిశోధనా ప్రావీణ్యం ఈ గ్రంథంలో ప్రతిఘట్టంలోనూ ప్రత్యక్షంగా గోచరించుతూ వుంటుంది.

చరిత్రకారు లందరికీ ఒక 'జబ్బు' సర్వసాధారణంగా ఉంటూవుంటుంది. ఏదోవొక ప్రత్యేక దృక్పథంతో వ్రాస్తారు. నిష్పాక్షికంగా సంఘటనలను గూర్చి తయారుచేయడం చాలా అరుదు. అందుచేత సరియైన, న్యాయమైన చరిత్రగ్రంథాలు బహు అరుదు. అయితే ముఖర్జీగారు సాధ్యమైనంతవరకూ తన పరిశోధనాఫలితముల నాధారముగ తీసుకొని, చంద్రగుప్తుని చరిత్రను సప్రమాణంగా వ్రాసినారని చెప్పవచ్చును. విషయములను విచక్షణతో పరిశీలించి, చక్కని పద్ధతిమీద కూర్చినారు.

చంద్రగుప్తుని పుట్టుక మొదలు ప్రతివిషయమును

కూలంకషముగ చర్చించి, నిర్ణయములు చేసినారు. చంద్రగుప్తుడు క్షత్రియవంశమునకు చెందినవాడు కాడనియు, దాసీపుత్రుడనియు కట్టుకథలు గలవు. చరిత్ర గ్రంథములందునూ ఈ కథలకు హెచ్చు ప్రాధాన్యమివ్వబడినట్లు విన్సెంట్ స్మిత్ వ్రాసిన భారతదేశ చరిత్ర మొదలు మామూలు పాఠశాలలకై వ్రాయబడిన చిన్నచిన్న చరిత్రపుస్తకములవరకూ తెల్పుచున్నవి. చంద్రగుప్తమౌర్యుడు క్షత్రియుడేనని, అందుకు భిన్నముగ తలంచుటకు సరియైన ప్రమాణములు, దాఖలాలు లేవనీ ముఖర్జీగారు ఋజువుచేసినారు.

ప్రతిఒక్క విషయమునందు ఇంతటి శ్రద్ధను చూపి సప్రమాణముగ తెలియజేసినారు. చంద్రగుప్తుని జైత్రయాత్రల కాలనిర్ణయములు, ఫలితములు సుబోధకముగ నున్నవి.

భారతదేశమును తరతరాలుగా పాలించిన క్షత్రియవంశము లున్నవి. కాని భారతదేశచరిత్రయందు చంద్రగుప్తమౌర్యుని కాలమున కొక ప్రత్యేకత ఉన్నది. నేటికినీ భారతదేశ ఆర్థిక, రాజ్యాంగవిధానమునకు మూలమైనట్టి కౌటిల్యుని అర్థశాస్త్రము అప్పటిదేకదా!

ముఖర్జీగారు ప్రత్యేకముగా కౌటిల్యుని అర్థశాస్త్రమునకు సంబంధించిన భాగములను బహు చక్కగా తయారుచేసినారు. సామాన్యులకు సైతము సులభముగ బోధపడునట్లు ఈఅర్థశాస్త్రమును వ్యాఖ్యానించుచూ వివరించినారు. గ్రంథమునందలి రెండు భాగము లీఅర్థశాస్త్రమునకు సంబంధించియేయున్నవి. చంద్రగుప్తుని పరిపాలనాపద్ధతియంతయు దీనిపైననే గదా ఆధారపడియున్నది.

ఇక చంద్రగుప్తుని కాలమునాటి సాంఘికాచారములు, వర్ణవ్యవస్థలు, ఆర్థికపరిస్థితులు వీటినిగురించీ, విదేశాలతో ఆనాడుగల సంపర్కం, పారిశ్రామికకృషి మున్నగు విషయములను సాకల్యముగా వివరించిరి.

భారతదేశచరిత్రవిషయంలో కృషిచేయు ప్రతివారూ తరచి, చదువదగ్గ గ్రంథం. రాజ్యాంగమూల సూత్రాలను తెలుసుకోటానికికూడా ఈగ్రంథం ఉపకరిస్తుం దనడానికి సందేహంలేదు.

నా. రా

---

## అష్టావక్ర చరిత్రము

గ్రంథకర్త: బులుసు వెంకటేశ్వర్లుగారు, బి.ఏ. క్రౌనుసైజు ౧౭ + ౭౨ పుటలు. విలాసము : గ్రంథకర్త, శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయము, సూర్యారావుపేట, కాకినాడ. వెల ఒకరూపాయి.

ఇది మహాభారతమునందలి ఆనుశాసనికపర్వమునందలి ఇతివృత్తము నాధారముగ గైకొని మూడాశ్వాసములలో (సుమారు) మూడువందల పద్యములలో గూర్పబడిన అష్టావక్రమహర్షి చరిత్రము. మనోహరమగు ధారాప్రవాహముతో గ్రంథ మామూలాగ్రముగ నడచినది. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు మున్నగు మనీషుల ప్రశంసల నందినగ్రంథమును మరల నిచ్చట ప్రశంసింప బూనుట చర్వితచర్వణము. ఆధ్యాత్మిక - ఇతివృత్తమును పరిగ్రహించుట ప్రశంసనీయము. తదితర పురాణములలోగూడ శ్రుతమగు ఏతన్మహర్షి జీవితచరిత్రాంశములను, బోధనములనుగూడ నిందుగూర్చిన మరింతగ శోభగల్గెడి దీగ్రంథమునకు.

కళాశాలలలోని విద్యార్థుల కీగ్రంథము పఠనీయముగ నుండదగినది.

'ఆనందపురి'

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.

# భారతీయ సంప్రదాయము

భారతదేశము, కళ, అతిథి సత్కారము—యీ ద్వివిధ సంప్రదాయములకును ప్రసిద్ధిగన్నది. ఇవి రెండును జీవితానందముతో అతి సామీప్యమైన సన్నిహితత్వము కలిగి వున్నవి. సున్నితమైన యీ దేశ శిల్పకళను చూస్తూవుంటే—మీ ఆప్తమిత్రులను "టీ" తో సత్కరిస్తూ వున్నప్పుడు కలిగే ఆనందము మీకు కలుగుతుంది. ఏ సమయమున వచ్చినప్పటికీ రుచికరమైన పానీయమును మించిన అతిథి సత్కారము మరొక్కటి వున్నదా? మీ సంప్రదాయమును విడువకుండా అనుసరించుటయే ప్రతి వారూ స్వగృహమున ఉన్నట్లు భావించులాగున ఇండియా టీ పానీయమును అందించడముతో సత్కరించండి.



"నిత్యానుష్ఠానము"—గృహములో "టీ" త్రాగుటకు యెటువంటి సమయము అనుకూలమైనదో తెలియజేయుటకు మేము క్రొత్తగా వెలువరించి ముద్రితమైన పవిత్ర పుస్తకముయొక్క శీర్షికయిది. ఈ ప్రకటన కత్తిరించి మీ పేరు, పూర్తి విలాసము (పెద్ద అక్షరములలో)తో సహా కమిషనర్ ఫార్ ఇండియా, ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డ్, పోస్టు బాక్సు నెంబర్ 2172, కలకత్తా విలాసానికి పంపితే, ఆయన మీకు చిన్న పుస్తకాన్ని ఉచితముగా పంపగలరు.





## ఒకేయొక కుటుంబ పానీయము



# ఇండియా టీ

ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డువారిచే ప్రచురించబడినది

IK 204

Regd. No. M. 1856.